శ్రీ

# భాగవతకథ

(శ్రీ మద్భాగవత దర్శనము)

## ఏకోనవింశతి భాగము

హిందీ మూలము

శ్రీగంల ప్రభు దత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

శ్రీ వేంకటేశ్వరార్ష భారతీ ధర్మసంస్థ

హైదరాబాదు.

# తొలి పలుకు

బ్రహ్మ సృష్టిలో మానవుఁడు ఉత్తమోత్తముఁడుగా పరిగణింపఁబడుచున్నాఁడు. అందుకితర జీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుఁడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుఁడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతఁడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతోఁ గాలము పుచ్చుచుండు నితర జీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూఁడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ భక్తి మార్గములు. ఈ కలియుగమునఁ దీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింపఁ జాలువారరుదుగా నుందురు. ఇంక మూఁడవదైన భక్తిమార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందఱు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుఁడగు కృష్ణద్వైపాయనుఁడు బ్రహ్మసూత్ర శ్రీ మద్భాగవతములతో పాటు పదునెనిమిది మహాపురాణములను ఉపపురాణములను కూడ రచించియుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిక్షిప్తములైన ధర్మనీతితత్త్వములను జిజ్ఞాసువు లందఱికిని సుబోధ మొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా, అను విషయమున పండితులలో వివాదమున్నది.

భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందుచేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడుటయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైనఁ దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగవతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమున్నందుండును. శ్రీ మద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారము లును (21) వర్ణింపఁబడియున్నవి. "యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" . అని శ్రీ మద్భాగవద్గీతలో భగవంతుఁడు చెప్పినట్లాతఁడు ధర్మ సంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విషయమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింపఁబడి నది. మత్స్యకూర్మాద్యవతారములన్నియు నవతార ప్రయోజనములను నిర్వహించినమాట వాస్తవమేయైనను "కృష్ణస్తు భగవాన్ స్వయం" మ్మను మాక్తి ననుసరించి యిందు దశమస్కంధమున శ్రీకృష్ణుని జన్మాది వృత్తాంతములు విపుల తరముగా వివరింపఁబడినవి. భాగవత సారాంశ మునకు దశమస్కంధము తరశ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపఁబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్షప్రాప్తి కదియే పరమసాధనమని యది బోధించును. అందలి కథోపాఖ్యానములన్నియు భక్తిమహాత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు కూడ భక్తిని విరసించ లేదనుటకు "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేకచూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యముకూడనంతే. కలియుగము నందలి జనులు కర్మజ్ఞాన మార్గముల నవలంబింపఁజాలని వారగుటచే భక్తినే ఆశ్రయింపవలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుఁడు భాగవతము నిగమ కల్ప తరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టములను సిద్ధింపఁజేయును.

వ్యాసుఁడు సంస్కృతమున రచించిన శ్రీ మద్భాగవతమును మహాభక్తుఁడును, కవిపుంగవుఁడునైన బమ్మెర పోతరాజు గద్య పద్యాత్మకముగా తెలుఁగున కనువదించెను. ఆతఁడు రచించిన భాగవతమునందలి కొన్ని భాగము లేకారణముచేతనో శిథిలమగుటచే వాని నతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను వారు పూరించిరి. అయినను తెలుఁగున భాగవతము మాట విన్నంతనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మఱే గ్రంథమునకును లేదనుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యములందలి ధారాశుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో

నోటికి రాని అక్షరాస్యుఁడు మొన్నమొన్నటి వఱకు ఆంధ్ర దేశమున నుండెడివాఁడుకాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొనరించుకొనువారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కువైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించియుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతఁడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొనఁ గలవా రిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూఁడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతమువంటి ఉత్తమ గ్రంథమెంత అధికముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలు కలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్తశిఖామణులునైన శ్రీశ్రీశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు జగద్ధితార్థమై శ్రీ భాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవపూర్వకముగా సరళసుందరమైన హిందీభాషలో నఱువది సంపుటములుగా వచన రూపమున రచించి యుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనర్సయ్య గురుపుంగవులు సర్వసుబోధమైన భాషలో తెలిఁగించి యుండిరి. భక్తిప్రధానమైన శ్రీ మద్భాగవతమును భక్తవరేణ్యుఁడైన పోతరాజాంధ్రీకరించుటవలన నాంధ్ర లోకమున కెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవు లాంధ్రీకరించుట వలన నంతమహోపకారము శ్రీ మద్భాగవతదర్శనమను పేరు

సార్థకము. అది రెండుసార్లు ముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మకార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొకరా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్ప బీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపమున ఫలించినది. ఆంధ్రులా ఫలమును ఆస్వాదించి ఆనందపారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్షధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహా పురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవతకథా సంపుటములు కూడ, శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపఁబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతి ప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా,

—దివాకర్ల వేంకటావధాని

## శబ్ద కల్పద్రుమము ననుసరించి మరుత్తుల పేర్లు ఇట్లున్నవి :

1 ఏకజ్యోతి 2 ద్విజ్యోతి 3 త్రిజ్యోతి 4 జ్యోతి 5 ఏకశక్రుడు 6 ద్విశక్రుడు 7 త్రిశక్రుడు

10 సత్యధర్ముఁడు 11 పతిపక్షౌత్పతురుడు 12 మిత్రుడు 13 సక్షిత్రుడు 14 సుమిత్రుడు 15 మహాబలుడు 16 శ్రుతజిత్తు 17 సత్యజిత్తు 18 సుషేణుడు 19 సేనజిత్తు 20 అంతిమిత్రుడు 21 అనమిత్రుడు 22 పురుమిత్రుడు 23 అపరాజితుడు 24 శ్రుతుడు 25 శ్రుతవాహుడు 26 ధర్త 27 ధరుణుడు 28 ధ్రువుడు 29 విధారణుడు 30 దేవద్రేషుడు 31 ఊర్ధ్వగుడు 32 అదృశుడు 33 ప్రతిసుడు 34 ప్రసధృత్తుడు 35 వభరుడు 36 మహాయశస్కుడు 37 ధాత 38 దుర్గాధితి 39 భీముడు 40 అభియుక్తుడు 41 అపాత్తు 42 సహుడు 43 ఘృతి 44 వసువు 45 అనాయ్యుడు 46 వాసుడు 47 కాముడు 48 జయుడు 49 విరాట్టు.

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

—సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణ మూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్ము నై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వు
ర్విన్ సద్ద్విజశ్రేయమై.

—శ్రీ మదాంధ్ర మహాభాగవతము

# విషయసూచిక

| విషయము | | పుట |
|---|---|---|

| విషయము | | పుట |
|---|---|---|





భా గ వ త క థ

# చిత్రకేతూపాఖ్యానము?

## వృత్రాసురుని పూర్వ జన్మ వృత్తాంతము.

(౪౧౮)

శ్లో॥ ఆసీద్రాజా సార్వభౌమః శూరసేనేషు వై నృప।
చిత్రకేతు రితి ఖ్యాతో యస్యా సీత్కామధుఙ్మహీ॥
తస్య భార్యాసహస్రాణాం సహస్రాణి దశాభవన్।
సాంతాని కశ్చాపినృపో నలేభేతాను సంతతిమ్।

శ్రీభాగ—౬స్కం, ౧౪ అ, ౧౦-౧౧ శ్లో॥

చ॥ అమిత సుభూతిఁ జాల నమరాధిపుఁబోలుచు శూరసేన దే
శములకు భర్తయై ప్రజలు సంతసమందఁగ సార్వభౌముఁడై
క్షమదమ కెల్లకాలమును గామదుహంబుగఁ జిత్రకేతు నా
మమునఁ బ్రసిద్ధికెక్కె గుణమండనుఁడంచిత కీర్తికాముఁడై॥

తే॥ కలిమి వేవేలు భార్యలు గలిగియుండి
పరఁగ సంతతి యొక్కండుఁ బడయ లేక
చిత్తమునఁజాల బాయని చింత వొడమి
బడలఁజొచ్చెను వేసవి మడువుఁబోలె॥

శ్రీమదాంధ్ర భాగవతము.

పూర్వ సంస్కారములు గర్భము మీఁది పొరవలె నంటుకొని యుండును. ఏ దేశములోని, ఏవర్ణములోని, ఏజాతిలోని స్త్రీగర్భమున నైనను బుట్టిన నాతఁడు మానిచేఁ గప్పబడియే యుండును. అట్లే జీవుఁడేజన్మము నెత్తినను బూర్వకృత పాప పుణ్యములు వాని వెను వెంటనే యుండును. పూర్వ జన్మములే లేకున్నఁ బ్రపంచములోని జన్మలలో విషమత యుండవలసిన పనియేలేదు. పూర్వ జన్మములో మనమెవరిని దుఃఖ పెట్టితిమో వాడకారణముగా వచ్చి యీ జన్మమున మనకు హాని చేయును. ఎన్నో పక్షు లెగురఁగా దేఁగయే ఒక్కటియో రెండో పక్షులను కొట్టును. మిగిలిన వేల తప్పించుకొన్నవి? ఒక యింటిలో నెన్నో యెలుక లుండినఁ గొన్నియే పిల్లికి చిక్కుచున్నవేల? మిగిలిన వేలచిక్కవు? పాఱిపోవనేల? ఎందుకో మానవు లుండఁగా నొకరిద్దరి మీఁదనే మనకుఁబ్రేమ కలుగనేల? మిగిలినవారు దగ్గఱ నున్నను మనము పేక్షింపనేల? అనేకమంది కన్యకలొకే పాఠశాలలోఁ జదువు చుందురు విష్ణు మిత్రునకు సుశీలతోడనే వివాహము కానేల? ఇతర కన్యకల నాతఁడు చూచుచున్నను నేలఁజూడఁడు? అతని మనస్సు సుశీల వైపున కేలఁబోవలయును? ఇది అకస్మిక విషయ మనియు, దైవిక మనయు ననవచ్చును. దీనికిఁ బ్రత్యుత్తరముగఁ బ్రపంచములో నేకార్యమును గారణములేక కలుగదని నేనందును. అకస్మాత్తుగా నేది యును జరుగదు. దైవికమును దైవేచ్ఛచేఁ బూర్వజన్మ కృత కర్మాను సారముగ జరుగును. పూర్వ జన్మమందు మన కెవరితో సంబంధము కలదో వారే యీజన్మ మందా రూపమున సుఖ దుఃఖము లొసంగ వచ్చుచుందురు.

వృత్రాసురుని వృత్తాంతమును విని అతని భగవద్భక్తియును,

శ్రీకృష్ణ పదార విందము లందనన్యాపు రక్తిని స్మరించి పరీక్షిన్మహా రాజు శ్రీశుక మహర్షి నిట్లడిగెను:- "స్వామీ! ఇదిచాల ఆశ్చర్యకరముగ నున్నది-ఘోర రజోగుణ తమోగుణుఁడగు వృత్రాసురునకుఁ బ్రభుపాద పద్మము లందిట్టి భక్తి యెట్లు కలిగినది? భయంకరమగు సంగ్రామ రంగమున నిశ్చల భావముతో నాతఁడు భగవత్ స్తుతి నెట్లొనర్చెను? ఇంతటి యుగ్ర స్వభావము గల అసురునకు వెంటనే ముక్తి యేవిధ ముగ లభించినది?"

ఈమాటను విని నవ్వుచు శ్రీశుకుఁడిట్లనెను:- "మహారాజా! ముక్తిని భగవద్భక్తిని నెవరైన గుత్తకు తీసుకొనిరా యేమి?"

అంతఁ బరీక్షిన్మహారాజు శీఘ్రముగ నిట్లనెను:- "కాదు స్వామీ! గుత్తకు కొనుటకాదు. నా అభిప్రాయమేమనఁగా, అపవాదము లన్నిటికి నుండును, కాని సాధారణముగ శుద్ధ సత్వగుణము కలిగి పవిత్రాచర ణము కలిగినవారి హృదయముననే భగవద్భక్తి సంచారము కలుగును. సత్వ గుణు లందఱును భగవద్భక్తు లగుదురనునదియును లేదు. సత్వ గుణము కలిగిన చాలామంది దేవత లందును, పవిత్రచిత్తము కలిగిన ఋషులు మునుల యందును భగవత్పాద పద్మములందు ప్రీతియుత్పన్న మగుట లేదు. అట్టియెడ మహాపాపి యగు వృత్రాసురుని హృదయ మందింతటి ప్రగాఢ ప్రభు ప్రేమ యెట్లు ప్రకటమైనది ?"

అంత శుకదేవుఁ డిట్లనెను:- "రాజా! నీవిట్లేల మాటలాడు చున్నావు? భగవంతుని చేతులలోఁ బడ్డిన క్రూర పాపులును దుష్ట

చిత్తులగు నసుర లందఱును ముక్తులైరి. అట్టియెడ భగవత్తేజ యుక్త మగు వజ్రముచేఁ జచ్చి ముక్తుఁ డగుటలో నాశ్చర్య మేమున్నది?"

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను:- "స్వామీ! ముక్తి పొందుట వేఱువిషయము. ముక్తిని బొందుట భక్తిని బొందుటంత కష్టము కాదు. ముక్తి చాలామందికి లభించును. సాధారణముగ, జాలమంది అసుర రాక్షసులు ముక్తులగు చుందురు. కాని భక్తి విశేష భాగ్యశాలికే ప్రాప్తించును."

ఇది విని నవ్వుచు శ్రీశుకు, డిట్లనెను:- "రాజా! ముక్తి మిఠాయి ముద్దను కొంటివా గుటుక్కున నోటిలో వైచుకొని మ్రింగుటకు? ముక్తి సులభమని నీవెట్లు పలుకు చున్నావు?"

శీఘ్రముగ, బరీక్షిన్మహారాజిట్లనెను:- "కాదు కాదు స్వామీ! ముక్తి సులభమని నాయభిప్రాయముగాదు. ముక్తి మార్గము క్షురధారవలె, దీక్ష్ణమైనది. ఈజగత్తునందు ముక్తి కొఱకే సమస్త జీవుల ప్రయత్నము. కొందఱు రోగ ముక్తి కొఱకును, గొందఱు దుఃఖముక్తి కొఱకును, కొందఱు వాసనాముక్తి కొరకును. కొందఱాఁకలి ముక్తి కొఱకును, కొందఱు శీతోష్ణ విముక్తి కొరకును, కొందఱు కలహముక్తి కొరకును, గొందఱు పున్నామనరకముక్తి కొఱకును. ఇట్లేదో విధముగ నభావ పూర్తి కొరకు సతతము ప్రయత్న మొనర్చుచున్నారు. విశ్వము లో ససంఖ్యాకములగు జీవులు గలవు. పృథివి యందలి కణముల నైన లెక్కఁబెట్ట వచ్చునుగాని జీవులను లెక్కించ నసంభవము. ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజ అని యానివిధముగ జీవులలో

నాలుగు భేదములు కలవు. ఈ నాలుగు నెనుబది నాలుగు లక్షల యోనులు. ఒక్కొక్క యోనియందు అసంఖ్యాకులగు జీవులీ బ్రహ్మాండమునఁ గలవు. ఇది పదునాలుగు భువనముల బ్రహ్మయే యనరాదు. ఇట్టి బ్రహ్మలనేకులు గలరు. ఆయన్నిటిలో వేఱు వేఱుగ బ్రహ్మ విష్ణు మహేశ, దేవతా, మను. ప్రజాపతులు మొదలైనవారు కలరు. వీరందఱిలో నీసంసారమును దాటుటకు బ్రయత్నించు వారు మానవులే. అట్లాలోచించు వారిలో గొందఱే ముక్తికిఁ బ్రయత్నించుచున్నారు. ఆప్రయత్నించు వారలలోను బ్రబలేచ్ఛ కలవారరుదుగ నుందురు. అట్టి ప్రబలేచ్ఛగల ముముక్షువులలోను జీవన్ముక్తులౌదురా యనునదియునులేదు. వారిలో నేదో భాగ్య శాలియే సిద్ధలాభమున మోక్షాధికారి యగును. జీవన్ముక్తులు, సిద్ధపురుషులు కోటి మందిలో నేయొక్కఁడో అరుదుగ శాంత చిత్తుఁడై నారాయణ పరాయణుఁడగు మహాపురుషుఁడగును. భగవన్నారాయణ పరుఁడైనవాఁడు కాఁడు. వేషమును ధరించి మాల త్రిప్పగనే సరిగాదు. వృత్రాసురుఁడు నారాయణ పరాయణుఁడని సంగ్రామమందును నాతనికి భగవచ్చరణార విందములందు దృఢ బుద్ధి కలదనియు మీరంటిరి. అది ఆతనికెట్లు కలిగినది? ఈ విషయమున నాకు మిక్కిలి ఆశ్చర్యము కలుగుచున్నది. వృత్రాసురుఁడు సాధారణ వీరుఁడును గాడు. యుద్ధములో నాతఁడు దేవతలను గాయపఱచినాఁడు. తన పురుషార్థముచే నాతఁడు రణమందు ఇంద్రుని మెప్పించెను. ఇది యెట్లుసంభవించినది?

ఇదివిని శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఇదంతయును బూర్వజన్మ సంస్కారముచే గలుగును"

అంత రాజిట్లనెను:- "స్వామి! ఈ విషయమును వినవలయు నవియే నాకు గోరిక కలదు. ఈ వృత్రాసురుఁడు పూర్వజన్మమున నెవఁడు? ఈతనికి భగవంతుని యందనురాగమెట్లు కలిగినది? ఇంతటి భగవద్భక్తుఁడయ్యు నీతడట్టి యసుర యోని యందేల జన్మించినాడు? ఇది నాకు తెలియవలెను. మీరు సర్వజ్ఞులు. భూత భవిష్యద్వర్తమాన ములు మీకు దెలియును. కావున మీరీ విషయములన్నిటిని జెప్ప వలయును.

సూతుఁడిట్లనెను:- మునులారా! పరీక్షిన్మహారాజీ విధముగా నడుగగా మా గురుదేవులు వ్యాసనందనుఁడగు శుకమహర్షి ఆతనికడ నా ప్రశ్నముల కిట్లు ప్రత్యుత్తర మొసంగెను"

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- రాజా! ఇందులో సర్వజ్ఞత అవసరము లేదు. ఇది అతిప్రాచీనమైనదియును నితిహాస ప్రసిద్ధమగు విషయమునై యున్నది. నేనిదివఱలో దీనిని నా తండ్రియగు వ్యాసభగవానుని ముఖ మున వింటిని. ఒకసారి నాకు దేవలముని తటస్థపడెను. ఆతనితోగూడ నీపువర్ణనమ్మ విషయమునఁ జర్చకురాగా నాతడును నీ ఇతిహాసమును నాకుఁ జెప్పెను. ఒకసారి నాకు దేవర్షియగు నారదుఁడు కనఁబడెను. ఆతనితో భక్తి యెవరి హృదయములలో నుత్పన్నమగునని ప్రశ్నించి తిని. దానికి ప్రత్యుత్తరముగ నాతఁడిట్లనెను:- భగవంతుడెప్పుడెవరి మీదఁ గృపజూపునో యీ విషయమున నేమియును నిశ్చిత నియమము లేదు. చూడుడు వృత్రుడెంతటి బలపరాక్రమ వంతుడో. దేవతలను భయ భీతుల నొనర్చు నసురుడు. ఆతనికి భగవంతుని యందహైతుక భక్తి

కలదు. ఈ ప్రసంగమునను నాతడు నాకు వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతమును జెప్పినాడు."

ఇది విని రాజిట్లనెను:- "అయితే స్వామీ! ఇది గొప్ప ప్రాచీన ప్రామాణీకమగు వితిహాసము. ఇంత మంది గొప్ప గొప్ప మహర్షులు ప్రమాణ భూతముగ గ్రహించి దీనివి జెప్పుచున్నారు. అయిన మీరు నాకు దీనివిఁ దప్పకఁ జెప్పవలయును."

అంతనప్పుడు శ్రీ శుకమహర్షి యిట్లనెను:- మంచిది రాజా! వినుడు. నేను మీకీ పరమ పుణ్యమయమగు కథను జెప్పెదను."

చాల పూర్వకాలమున శూరసేన దేశమున నొక గొప్ప ప్రతాప వంతుఁడగు రాజు రాజ్యము చేయుచుండెను. మహారాజా! యమునా తీరమున నేడు వటేశ్వర శివుడుండు చోటుకు దగ్గరనున్న ప్రాంతమునే శూరసేన దేశమందురు. ఆ ధర్మాత్ముడగు రాజు పేరు చిత్రకేతువు. అతని పుణ్య ప్రభావముచే నాదినములలో బృథివి కామధేనువువలె సమస్త యిష్ట వస్తువులను సంకల్ప మాత్రముచేతనే యొసంగు చుండెడిది. రాజా! మానవులలో సవిశ్వాసము వృద్ధి జెందినపుడును, ధర్మ ప్రాబల్యము కలిగినపుడును నీ భూమి సమస్త వస్తువులను దనలో దాచుకొనును. మంచి మంచి బీజములుగల వస్తువుల నుత్పన్నము కానింపదు. ప్రభావ శాలియగు నౌషధములను బ్రసాదింపదు. దుష్ట రాజులవలన విది విర్జీవమగును. ధర్మాత్ముడగు రాజు పరిపాలించినచో నది దున్నబడకయే విత్తబడకయే యిష్టము వచ్చినట్లు పండును. అచ్చటచ్చట రత్నములు, ముత్యాలు బయలుదేరును. చిత్రకేతు మహారాజు

రాజ్యమందిట్లే యుండెను. ఎవ్వరికిని నే వస్త్రమును గొదువలేదు. అన్న వస్త్రముల నవ్వారిగఁ బృథివి యుత్పన్నము కావించు చుండెను.

రాజు మిక్కిలి రూపవంతుడు కామదేవునివలె మిక్కిలి సుందర శరీరము కలవాడు. మిక్కిలి ఉదారుడు. ఎవఁడే వస్తువును యాచించునో దాని నాదరము తోడను, సంతోషము తోడను నొసంగును గాని యెన్నఁడును నెవరిని నాశాభంగము కావించి విముఖుడుగ బోనీయడు. అతడు వంశ పరంపరగ రాజు. సత్కుల సంజాతుడు. పితృ పితామహ ప్రపితామహులనుండి వచ్చుచున్న రాజ్యమునకధికారి. సాధారణముగా రాజెక్కువగ జదువుట వ్రాయుట నేర్చుకొనడు. ఈతఁడట్లు కాదు. ఈతఁడు సమస్త విద్యలందును బారంగతుడు. ఆతని కతులనీయమగు నైశ్వర్యము కలదు. ఆతని కంతులేని సంపత్తు దానికి మేరలేనేలేదు. సారాంశమేమనఁగా నాతని యందు సమస్త సద్గుణములున్నవి. యథాసమయమున కాతఁడు సత్కుల సంజాతయగు రాజకుమారిని వివాహమాడెను. రాజులు సంతానము నుత్పత్తిచేయుటలో మొనగాండ్రు. కాని యీతనికి సంతానము లేదు. అందువలన నాతడు రెండవ పెండ్లి చేసికొనెను. ఆమెకును సంతానము లేదు. ఇట్లే మూడవ, నాల్గవ ఇట్లు లక్ష వివాహములు చేసికొనెను; కాని యే రాణి వలనను నాతనికి సంతానము కలుగలేదు.

అంత శౌనకు డిట్లడిగెను:- "సూతా! ఒక్క పురుషుఁడు లక్షల, కోట్ల భార్యలకు పతియెట్లు కాగలఁడు? ఇది మాకబద్ధముగా దోచుచున్నది.

అంతను పేశా స్వరమున సూతుఁడిట్లనెను:- "మహాభాగా! ఇచ్చట లక్షలు, కోట్లు భార్యలున్నారనినఁ జాలమంది భార్యలున్నారని మాత్రమే

గ్రహింపవలెను. శత సహస్ర, లక్ష, ఆయుతము ఇవన్నియును బహు వచన శబ్దములు. మహారాజా! సామర్ధ్యము కలవానికి వేయి వివాహములు జేసికొనుటేమంత గొప్ప విషయము కాదు ఈ కలియుగమందు ఒకానొక రాజునకు నూర్గురు రెండువందలమంది భార్యలుండుటను నేను వ్వయముగ గాంచితిని. సరియే ఆతనికిని జాలమంది సుందరులును, సత్కులోత్పన్నలునగు భార్యలు కలరు. అయితే నందఱును వంధ్యలే అందులో నొక్కదానికిని బుత్రుఁడుకాని పుత్రికగాని కలుగలేదు.

రాజన్ని విధములను సుఖియే తాను సమస్త గుణ సంపన్నుడు సమస్త పృధివికి సార్వభౌముఁడు సర్వత్ర ఆతని యాజ్ఞ మన్నింపఁబడు చుండును మంత్రి, పురోహిత, ఆమాత్య, అన్యరాజ కర్మచారులందఱు ననుకూలురే ప్రజలాతని బ్రాణములకంటె నధికముగఁ బ్రేమించు చుందురు. ఆతఁడును బుత్రులవలె నందఱను ధర్మముగ బరిపాలించు చుండెను. ఈతనికి సమస్త విధములగు సమృద్ధియున్నను సంతతి లేక పోవుటచే నాతనికి సుఖములేదు. భోగములన్నియును నాతనికి విసార ములుగఁ దోచుచుండెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గృహస్థునకుఁ బిల్లలేశోభ. చిన్న చిన్న పిల్లలెవరియింట బాల గోపాలురవలె నిటునుండి అటు చిలుక పలుకులు పలుకుచు నవ్వుచు దిరుగుచుండిన నా గృహస్తే చాల గొప్ప భాగ్యశాలి. కమలములు లేక సరోవరమును, పతిలేని స్త్రీయును, బొట్టులేని ముత్తైదువును, ఛత్ర చామరములు లేని రాజును, విద్యలేని బ్రాహ్మణుఁడును, చంద్రుడు లేని రాత్రియు దీపము లేని చీకటి

యిల్లును శోభింపనట్లు బాలకుఁడు లేని గృహస్థు శోభింపడు. అంతు లేని సంపత్తియుండి పుత్రులు లేకున్నచో నట్టివాడు భగవానునే తన పుత్రునిగ భావించి రాత్రిం దివములు ప్రేమతో నుండవలయును లేదా ధనమును దాన ధర్మములకు వినియోగించి వనములకుఁ బోవలయును. వీనిలో నేదియును జేయక, ధన సంగ్రహ మొనర్చుటయే కార్యముగ బెట్టుకొని తాను తినక, నొరులకుఁ బెట్టకయున్నచో నట్టివాడు బ్రదికి యుండియే నరకము ననుభవించును. చచ్చిన తరువాతఁ బ్రేత మై ధనముమీదఁ దిరుగుచుండును. చివరకు నరకాగ్నిలో మాడును. పుత్రుడు లేక గతిలేదు, శాంతిలేదు. సుఖములేదు.

చిత్రకేతు మహారాజు పుత్రప్రాప్తి కొఱకు వివిధోపాయముల నొనరించెను. సమస్త దాన, ధర్మ, వ్రతోపవాసాదుల నన్నిటి నొన ర్చెను. కాని ఆతనికిఁ బుత్ర ముఖమును జూచు సౌభాగ్యము కలుగలేదు. దీనిచే రాజెల్లప్పుడును జింతగా నుండెను. ఆతని కేపనిలోనికి మనస్సు పోవుటలేదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! మీపనియే బాగున్నది. మొదటి నుండియు నీ భార్యా బిడ్డల జంజాటములో బడలేదు, స్వామీ! దీనిలోఁ బడిన వానిని భగవంతుడు బయట బడవేయవలసినదే తప్ప వేఱు మార్గము లేదు. పుత్రుఁడు లేకున్న నెట్టి దుఃఖము కలుగునో యిల్లు వాకిలి లేక బైరాగులైన మీకెట్లు తెలియఁగలదు? అందువలన దాని వర్ణన మధికముగ మీముందు చేయను చేసినను వ్యర్థమే కాగలదు. మూడు నాలుగేండ్ల పిల్లదగ్గర నత్తవారింటి సుఖమునుగూర్చి వర్ణించిన

నెట్లు తెలిసికొనజాలరో అట్లే మీరును దెలిసికొన జాలరు. కావున మునులారా! ఇప్పుడీ ప్రసంగము నింతటితో సమాప్తము కావించి రాఁబోవు రసవత్తరమగు కథను జెప్పెదను"

—❀—

## చిత్రకేతుని ఇంటికి అంగిరోముని ఆగమనము

శ్లో॥ తస్యైకదా తు భవన మంగిరా భగవనృషిః ।
లోకాననుచరన్నేతా మపాగచ్ఛద్యదృచ్ఛయా ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧౪ శ్లో॥

వ॥ ఇట్లు సంతతి లేక యతి దుఃఖ మానసుండయిన యా నరేంద్రుని మందిరంబున కంగిరసుండను మహాముని వచ్చి యతనిచేత నతిథి సత్కారంబులు వడసెను."

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచములో నన్ని వస్తువులును సులభములే కాని సాధు సమాగమము, సత్సంగ మొక్కటియే దుర్లభమైనది. ఏదో ఒకానొక సాధువు యొక్క కృపకలవారే లోకములో ధన్యులు, ఈ గృహస్థ రూప మగు నంధకూపములో నంతయును దుఃఖమే. ఇది విపత్తులకు నిల యము, చింతా గృహము. నిత్య నూతన చింతలుండును నేఁడీ వస్తువు

లేదు నేఁడిది అభావము, నేఁడిది విఱిగినది. ఇది మలినమైనది. రేపచ్చటకుఁబోవలయును నేఁడిది తేవలయును. నేడు భార్యకు జబ్బుగా నున్నది, చిన్న పిల్లవాని ఆరోగ్యము చెడినది నేఁడాఁకలి యగుటలేదు జ్వరము వచ్చినది, తలనొప్పి వచ్చినది. ఏదో చింతలేక ఒక్క క్షణ మైనను గడువదు. ఇంటిలోనికి సాధువులడుగిడిన సమయమే సార్థకమై నది. మహాత్ముల సత్సంగమందు గడచిన క్షణములే అమూల్యములు. అవియే సార్థకములు సుఖమయములు. మిగిలినవన్నియును దుఃఖ మయములే.

సాధు సంగము గొప్ప సౌభాగ్యము వలనఁ బూర్వ జన్మముల లోని మహా పుణ్యముల వలనఁ బ్రాప్తించును. ఏ యింటి కప్పుడప్పుడు సాధువులు కృపఁజేయుదురో, ఎవరి అంగణములోనికి సాధువులు తమ పదధూళిచేఁ బవిత్ర మొనరించెదరో, ఎవరి గృహములలో మహాత్ముల పాద ప్రక్షాళన జలముపడినదో, ఎవరికి సాధుసేవ చేయు సంయోగము ప్రాప్తించినదో అట్టి గృహస్థే భాగ్యశాలి సాధువులందఱ యిండ్లకుఁ బోరు. ఏ భాగ్యశాలి యింటికో పావనము జేయబోవుదు. ఏ సుకృతికో వారు సేవాభాగ్యమును గలుగఁజేయుదురు.

శాస్త్రకారులు సాధుసేవను భగవత్సేవకంటె మిన్నగ నెన్నిరి భగవత్సేవలోఁ గేవలము భగవంతుని అర్చనయే జరుగును. కాని భగవద్భక్తుని సేవలో భక్తభగవానుల సేవలు జరుగును. సౌభాగ్య వశమున మా యింటికి సాధువులు పదార్పణమును గావించిరి తాను వారి కొఱకై ఫలహారములను దయారు చేయించెను. తయారుకాగానే

సాధువులు తినువారు కారు. వారు ముందుగా భగవానునకు నైవేద్యమిడి ప్రసాదమును చేసి కొందురు. వంటయైనచో భగవంతునకు నైవేద్య మిడిప్రసాదమునుగైకొందురు. అందువలననేభగవన్నైవేద్యమునకుమహా ప్రసాదమందురుమహాప్రసాదమును భక్తులుతిని, ఉచ్ఛిష్టమునువదలివేయు దురు. అదిమహాప్రసాదమని పిలువఁబడును. ఈవిధముగమననముసాధువుల కొఱకు మాలను గట్టితి మనుకొనుడు. సాధువులు భగవంతుని కర్పింపక, నిర్మాల్యము నొనర్పక ధరింపరు. ముందుగా భగవంతున కర్పించి తర్వాత సాధువులు ధరింతురు, ఇద్దరి సేవయును జరిగినది. ఈ విధముగ వస్త్ర చందన అను లేపనాదులన్నిటిలోను గ్రహింప వలయును. సాధు సేవచే భగవంతుడు సంతోషించినట్లు తన సేవకు సంతోషింపడు.

ఏ భాగ్యశాలియొక్క యింటియందు సాధువులు నివసించెదరో ఆ యిల్లు సాధారణపు టిల్లుగా నుండదు. అది తీర్థ స్వరూపమగును సాధువులడుగు పెట్టిన చోటులును, వారు భగవత్పూజచేసిన చోటులును, వారు సుమధుర భగవన్నామములను గీర్తించిన చోటులును, వారి యశస్సునకు సంబంధించిన కథలు జరిగిన చోటులును దివ్యములగును. సాధువులే యీ పృథివినిఁ బావన మొనర్చుచుందురు. దేవ, బ్రాహ్మణ, గోవులును, సాధువులును, సతులును నీ భూమిని ధరించినారు. వారు లేక ప్రపంచమే లేదు. సాధువు భాగ్యహీనుఁడగు పాపి కడకు బోనేపోడు. ఒక వేళ పోయిన వాని భాగ్యము మారిపోవును. పాపాత్ముడగు వాడు పుణ్యాత్ముడగును. ఆతని బంధమే తీరిపోవును. ఆతఁడు శాశ్వతముగ సంసార బంధనము నుండి బయటపడును.

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! శూర సేనాధిపుఁడగు చిత్రకేతు మహారాజు సంతతి లేక సదా దీనుఁడై చింతించు చుండును. ఒక దిన మున దైవయోగముచే లోకములలోఁ దిరుగుచు నంగిరముని అచ్చటకు విచ్చేసెను. అంగిర మహాముని వచ్చుటను గాంచి చిత్రకేతు మహారాజు వెంటనే తన ఆసనమునుండి లేచెను. అత్యంత శ్రద్ధతో మునికి సత్కార మును గావించెను, పురోహితుని బిలిపించి విధ్యుక్తముగ నాతనిని బూజించెను. అర్ఘ్య పాద్యాచమనాదులను ఫలములను నొసంగి మునిని సంతోష పరచెను. అతిథి సత్కారాదులు పూర్తికాగానే ముని మిక్కిలి ప్రసన్నుడై రాజును గూర్చుండ నియమించెను. మునియాజ్ఞచే నాతఁడు సమీపముననే సింహాసనము మీద జేతులు జోడించుకొని కూర్చుండెను.

రాజు వినయ పూర్వకముగ సమీపమున గూర్చుండుటను గాంచి మునివరుఁడగు నంగిరు డాతని కుశలము నడిగి యిట్లనెను:- రాజా! నీ రాజ్యములో నందఱును సుఖముగ నున్నారా! రాజొక బ్రహ్మాండము వంటివాడు బ్రహ్మాండము పృధివ్యప్తేజో వాయురాకాశ అహంతత్వ మహత్తత్వములను సప్తావరణములచే సదాచుట్టుకొనియుండునట్లు రాజును స్వామి, అమాత్య, జనపద, దుర్గ, కోశ, దండ, మిత్రులను నీ సప్తావరణములతో నుండును. రాజు వీరు లేక యుండజాలడు, అతఁడెల్లప్పుడు వీరిచే జుట్టుకొనఁబడియుండును. వీరు రాజున కావశ్యమగు సంగములు ఈ యేర్పురతో నీవు సుఖముగనున్నావా?

చేతులు జోడించుకొని రాజిట్లనెను:- "స్వామీ! ఇదంతయును మీ కృపయే. ఈ ప్రకృతి రూపావరణములన్నియును నాకనుకూలములే"

దీనిమీద నంగిర మహాముని యిట్లనెను:- ఈ యేర్పురును నీకను

కూలమైనప్పుడు నీ రాజ్యములోఁ బరిపూర్ణ సుఖముండి యుండవల యును. నీకే చింతయు నుండరాదు. నీ ముఖకమల మెల్లప్పుడును నవ్వు చుండవలయును. కాని చూడఁగా నీ ముఖము మ్లానమైయున్నది. నీ యంతఃకరణము సంతోషముగ లేదు. చిత్తమందు ప్రసన్నత లేదు. ముఖాకృతిలో నేదియో తీవ్ర వేదన స్పష్టముగఁ గనఁబడుచున్నది"

ఇంకొక్క విషయము నీవు ప్రకృతి కనుకూలముగ బోవలయును కాని దాని నాశ్రయించుకొని యుండువారేకారణము చేనైనను దానికను కూలముగ నుండకున్నచో, విరుద్ధా చరణము కావించినచో గార్యము జరుగదు. దీనివలనను రాజుయొక్క శాంతికి విఘ్నముకలుగును. ఇంకొ కటి అడుగఁదలంచుచున్నాను. నీరాణులు నీకనుకూలచరణ మొనర్చు చున్నారా? వారిలో నేకారణముచేనైనను దురాచారము ప్రవేశింపలేదు కదా! నీ ప్రజలు హృదయ పూర్వకముగ సంతోషించుచున్నారా? వార రాజకత్వములు వ్యాపింపఁ చేయుటలేదు కదా! నీయాజ్ఞల నుల్లంఘించుట లేదుకదా! నీయమాత్యులు రాజ్యమందలి యేర్పాటులను జక్కగ నిర్వ హించు చున్నారా! వారు ప్రజలదగ్గరమండి అనుచితముగ మోసగించి ద్రవ్యమును గాజేయుటలేదుకదా! నీ సేవకులు ధర్మమును తెలిసికొని శ్రద్ధతో సేవ చేయుచున్నారా? వారు కేవలము లోభముచే ననిచ్ఛా కార్య ములు వారి మనస్సులకు వచ్చినట్లు చేయుటలేదుకదా! నీ రాజ్యములోని వ్యాపారులు కపట మోసములను జేయుట లేదుకదా! అవసరమునకు మించి అబద్ధములాడి వస్తువులను ప్రియముగ నమ్ముట లేదుకదా! సమయమునకు వారు నీకు సన్నుల నొసంగు చున్నారా? నీ మంత్రు లెల్లప్పుడును మంచి సలహాల నొసంగుచున్నారా? వారు రహస్యముగ

శత్రువులతోఁజేరి నిన్ను రాజ్యచ్యుతునిఁగావించుకొనుటకు సన్నాహములను చిన్నది లేదుకదా! పురవాసు లందఱును నీ కనుకూలురేనా వారికి నీయందు శ్రద్ధ కలదా? నగరములలోని వారుగాక యితర దేశవాసులందఱును నీపైననురాగమును జూపుచున్నారా? సదా నీ మేలునే కోరుచున్నారా? సభలోనుండెడు నీ సామంతగణము నీ కధీనులైయున్నారా? వారికి నీయెడల సహజ స్నేహమున్నదా? నీ రాజకుమారులు నీ యాజ్ఞలను బాలించుచున్నారా? రాజకార్యములలో నీకు చేదోడువాదోడుగనున్నారా?

రాజకుమారుల మాట వినగానే రాజున కుదాసీనత యెక్కువయై దుఃఖిత చిత్తముతో నిట్లనెను:- "ప్రభూ! మీరడిగిన వారందఱును నా కనుకూలముగనే యున్నారు. నాకు విరుద్ధాచరము కావించు వారెవరును లేరు. అందఱును నన్ను బ్రాణములకంటె నధికముగ బ్రేమించుచుందురు."

అంత శీఘ్రముగ ముని యిట్లనెను:- "అట్లైన నీవింత చింతతోడను, దుఃఖముగను నుండనేల? రాజునకుదుఃఖ కారణము లివియే యుండును. ఎవడైన శత్రువుదండెత్తినను, తన ప్రజలు విరుద్ధులైనను. కఱవు కాటకములు సంభవించినను, దుర్భిక్షమైనను దుఃఖము కలుగును. ఇది నీ రాజ్యములోలేనే లేవాయెను, అయినను నీవు చింతా గ్రస్తుఁడవుగనున్నావు, కావున నీ దుఃఖ కారణమును దెల్పుము నీ విపత్తునకు బీజమేమో తెలుపుము. నీకేదో మానసిక వ్యధ కలుగుచున్నట్లు తోచుచున్నది. ఏలయనగా మానసికముగ దుఃఖముగ నుండిన దుఃఖితుఁడుగను. మానసికముగ సుఖముగనుండిన సుఖవంతుడుగను మానవుఁ డెన్నఁబడుచున్నాడు. మనస్సు స్వాధీనమైనచో నన్నియును స్వాధీనములో

నుండుసు, దేవతలు(లోకపాలురుకూడా వాని యాజ్ఞలను మన్నించెదరు. సదా వాని కనుకూలాచరణ మొనర్చుచుందురు. తన స్నేహితులు, హితైషులు, శుభచింతకుల సమ్ముఖమున దుఃఖమును ప్రకటించుటచే వారు పంచుకొందురు, చిత్తము తేలికయగును. కావున నీవు నా సమ్ముఖమున నీ దుఃఖమునకు గారణము చెప్పుము."

శ్రీ శుకదేవుడిట్లనెను:- "ఉత్తరానందనా! ముని త్రికాలజ్ఞుడు ఆతనికిఁ దెలియనిదేమున్నది? అయినను నాతని వద్దనుండి మాటను రాబట్టుటకై రాజీవిధముగ ప్రశ్నించెను."

అంగిరోముని అడుగఁగా జేతులను జోడించుకొని అత్యంత వినీత భావముతో సిగ్గుజెంది, తన యంగములను లోనికి లాగుకొని రాజాతనితో నిట్లనెను:- "స్వామీ! మీరు సాధారణులవలె నెఱుఁగనట్లు నన్ను ప్రశ్నించుచున్నారు.పాపములను వాసనలను నశించిన యోగీశ్వరులకు వారు సమాధిలో నుండి తపః ప్రభావముచే లోన బయట యెఱుఁగని విషయములేమి యుండును? మీరు సర్వజ్ఞులు. భూత భవిష్యద్వర్తమానములను నఱచేతిలోని ఆమలకము వలెఁజూడంగలుగుదురు. అట్లయ్యును మీరు నా మానసిక వ్యధనుగూర్చి కారణము నడుగుచున్నారు. అయినను మీరు త్రికాలజ్ఞులగుటలో నాకు సందేహమేమియును లేదు. నా నోట జెప్పింప వలయునని మీరడుగుచున్నట్లు దలంచుచున్నాను. మీ సంశయమును బోగొట్టు నభిప్రాయముతోఁగాక మీ యాజ్ఞయను భావముతో నేను జెప్పుచున్నాను. మీకు తెలియని దేమియును లేదు; కాని మీరు

ప్రేరేపించుచున్నారు. ఆజ్ఞాపించుచున్నారు. నేను దాని నెట్లుల్లంఘింపఁ గలను?"

మునివరా! నాకన్ని సుఖములునుగలవు నాకెవరివలన నేకష్టమును లేదు. ప్రజాపురోహిత, అమాత్య, మంత్రి మొదలగు వారందఱును నా కనుకూలురే నాకు తక్షణము నెఱవేఱవలసిన కోరిక యేమియును లేదు, కాని ప్రభూ యింతసుఖమున్ననూ, నాకు సుఖములేదు. శాంతి లేదు ఆకలిచే వ్యాకులము చెందినవానికి అన్న జలములుతప్ప సమస్త విషయ భోగములును దుఃఖదములైనట్లు నాకీ సంపత్తు లన్నియును గోయవచ్చుచున్నట్లున్నవి. ఆకలి చెందిన వానికి అన్నమును బెట్టక వాని మెడలోఁ బూలమాలలను వైచి సుందర శయ్యపై బరుండబెట్టి, వీవన లతో విసరి, చందనము నలఁది తైలమర్దనము నొనర్చి, సుగంధ ద్రవ్య ములను బూసినచో వానికి సుఖముగ నుండునా? యువతియగు స్త్రీకిఁ దన భర్త ఆమెకు యథేష్టముగ భోజన వస్త్రము లేర్పాటు గావించును. భోగ వస్తువులన్నియును నత్యధికముగ నొసంగును, వేలకొలది సేవకు లను నియమించును, కాని పతి యామె సమీపమునకుఁబోడు. ఆమెకు దర్శనమే యొసంగడు. అట్టియెడ సుఖోప భోగవస్తువు లామెకానంద మును గలుఁగజేయునా? ఇదే విధముగ స్వామీ! నాకడ సమస్త సామాగ్రులుమగలవు; కాని పుత్రుఁడు లేక అన్నియును వృథయే! సంతానము లేక యీ యమృతోపములగు విషయములు విషసమానముగ నాకుఁ దోచుచున్నవి."

అంత ముని యిట్లడిగెను:- నీ కెందఱు రాణులు కలరు? రాజు దుఃఖితుఁడై యిట్లనెను:- "రాణుల సంఖ్య నడుగవలదు. అసంఖ్యాక ములుగనున్నారు. కాని దౌర్భాగ్యము పండినది. వెదకి వెదకి ఒకదాని తర్వాత నింకొకదాని నిట్లనేక వివాహము లొనర్చు కొంటిని. కాని అందఱును వంధ్యలైరి. ఒక్కతెకును బుత్రులు కలుగలేదు. మీకు నాపైఁ గృపయున్నచో మీరు నన్ను సేవకునిఁగా నొనర్చుకొని సుఖిగా జేయదలచుచో నా కెందఱో అక్కఱలేదు. కనీస మొక్క పుత్రునినైన నొసంగి ననుగ్రహింపుడు."

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! చిత్రకేతు మహారాజు యొక్క మాటలను విని ముని కొంచె మాలోచనలోఁబడి రాజునకు గళ్యాణమెట్లు కలుగునని యాలోచించుచుండెను."



# మహారాజు మునిని సంతానము నడుగుట

(౪-౨౦)

శ్లో॥ లోకపాలైరపి ప్రార్థ్యాః సామ్రాజ్యైశ్వర్య సంపదః।
న నందయన్త్య ప్రజం మాంక్షుత్తృట్కామ మివాపరే॥
తతఃపాహి మహాభాగ పూర్వైః సహగతం తమః।
యథా తరేమ దుస్తారం ప్రజయా తద్వి దేహినః॥

శ్రీ భాగ. ౬ స్కం, ౧౪ అ. ౨౫-౨౬ శ్లో॥

"చిత్రకేతు అంగిరో మునితో నిట్లనెను:- మునివరా! లోకపాలు రైన గాంక్షించు నంతటి సామ్రాజ్యైశ్వర్యములు నాకుగలవు. కాని అది ఆకలి చెందిన వానికి ప్రత్యందనాది భోగములు సుఖము నొడగూర్ప జాలనట్లవి పుత్రహీనుడనగు నాకు సుఖము నొసంగుటలేదు మహాభాగా పుత్రహీనుడనై నేను నా పితృవ్యులతో నరకమునకుఁబోవుచున్నాను, మీరు నన్ను నరకమునుండి రక్షింపుఁడు పరలోకమందున్నాము నరకమును బుత్రుని బొంది తరించునట్లు చేయుము."

గృహస్థులకడకు స్వార్థులే పోవుచుందురు; ఏలననఁగా వారు సదాస్వార్థమందే సంలగ్నులై యుందురు. ఎవఁడెట్టివాడో వాని కట్టివారి తోడనే సంబంధ సంసర్గములుండును భాగ్యశాలియును, బుణ్యాత్ముఁడు నగు సుకృతునికడకే యథార్థమగు సాధువులు దయచేయుచుందురు. వాని సేవలను స్వీకరించి వానిని గృతార్థు నొనర్చు చుందురు. సాధు సందర్శనముచేఁ బాతకము దూరమగును. సాధు దర్శన మెన్నటికిని వ్యర్థముకాదు. అది అమోఘమగును సాధువుల వలన బ్రపంచమున నేటి వఱకు అనిష్టమేమియును జరుగలేదు. వారకారణముగ నపకార మొనర్చు వారిపైనను గృపఁజూతురు. ద్వేషించువారిని బ్రేమింతురు. నిందించువారి నాదరింతురు వారధికారము ననుసరించి యుపదేశింతురు ఆర్తి అధికారి దుఃఖమును దూరముగావించి వానిని బరమార్థమునకు గొని పోవును: అర్థార్థికి నర్థము నొసంగి చివరకు విరాగమును గలుగజేయు దురు. ముముక్షువునకు మోక్షమార్గము నుపదేశించి జ్ఞాన సోపానముల నెక్కించును. జ్ఞానులకు భగవద్భక్తిని గురించియును బ్రభు ప్రేమను

గూర్చి పాఠమును జెప్పి, భక్తులకు హరికథను జెప్పి సంతోష పెట్టు దురు వారివలన నెవరికి నహితముగాని అనిష్టముగాని జరుగదు. సాధు వుల ప్రతి రోమము పరోపకారము కొఱకే. వారి శ్వాస శ్వాసయందు కృష్ణ నామోచ్చారణము జరుగుచుండును. వారు పరకార్యములను నిర్వ హించుట చేతనే సాధువులనబడుచున్నారు."

శ్రీశుకదేవుఁడిట్లనెను:- చిత్రకేతు మహారాజు మునిని బుత్రు నిమ్మని ప్రార్థింపగా మునియిట్లనెను:- "రాజా! అన్ని వస్తువులు నదృష్ట వశముననే ప్రాప్తములగును. నీ యదృష్టమున బుత్రసుఖమున్నట్లు తోచదు, ఇందఱు రాణులుండియు బుత్రులు లేరనిన నింకేమనవలయును కావున నీవు పుత్రపౌత్ర మోహమును వీడి భగవద్భజనముగావించు కొనుము".

రాజు మనస్సు పుత్రమోహమున లగ్నమైయున్నది. ఆ సమయ మున నాతని మనస్సునఁ బుత్రేషణము కలదు. అందువలన నాతడు చేతులు జోడించుకొని మునితో నిట్లనెను:- "ప్రభూ! ఇప్పుడు నాకేమి యును దోచుటలేదు. పుత్రుఁడు దయింపక నాకు మనశ్శాంతిలేదు. నాకు భగవంతుని యందును జిత్తము నిలువదు. నాకే విధముగనైనఁ బుత్రుఁ నొసంగుడు. ఇక నదృష్టము విషయమందు మా సాధువులు విధిరేఖను దుడిచిపెట్టి అదృష్టమును మార్చగలరు. ప్రారబ్ధమును గూడ అన్యథా చేయగలరు. సాధువులకు గొప్ప సామర్థ్యముండును. నేనీ విషయమున సాధువుల నోటనే ఒక కథను వినియుంటిని. ఆజ్ఞయగుచోఁ జెప్పెదను"

ఇది విని అంగిరోముని యిట్లనెను:- "రాజా! సాధు మహిమకు సంబంధించిన ఇతిహాసమును నీవవశ్యము వినిపింపవలయును. ఏల యనగాఁ బ్రపంచములో వినఁదగినవి రెండే. అవి హరిదాస చరిత్రలు లేదా హరిచరిత్రములు. సరియే ఏ సాధువు అదృష్టమున కన్యథా మొనర్చినాడు? ఎవఁడు విధి వ్రాసిన వ్రాలను దెలిపినాఁడు? చెప్పుము"

ముని యాజ్ఞనుబొంది చిత్రకేతు మహారాజిట్లనెను :— "ప్రభూ! నేను గథాకథకుల నోట నీ కథను వినియుంటిని. విషయము ప్రాచీనమైనది. ఒకానొక ధనిక శ్రేష్ఠుఁడుండెను. ఆతనికడ అంతులేని ధనముండెను, సర్వత్ర ఆతనికి వ్యాపారము జరుగుచుండెను. ఇంటిలో సమస్త సుఖసామగ్రియును గలదు. కాని ఆతనికి బుత్రులు లేరు. శ్రేష్ఠిగారి భార్య గొప్ప ధర్మపరాయణ. సాధని నామె ప్రాణాధికముగ ప్రేమించుచుండెడిది. ఆతని ఇష్టానుసారము వర్తించుచుండెడిది. శ్రేష్ఠి సాధుసేవి. సాధువులు వచ్చిన సత్కారమొనరించు చుండును, యథాయోగ్యముగ నాతనికిఁ బూజయొనర్చుచుండును. శ్రేష్ఠి దంపతులు సంతానము లేకున్న సదా నావలెనే చింతించుచుండురు. ఒకసారి దైవ యోగమునఁ నారదుఁడాతని యింటికి వచ్చెను. దేవర్షియగు నారదుని గాంచి ఆ భార్యా, భర్త లిరువురును బరమ ప్రసన్నులై, ఆతనికి యథోచిత సత్కారములను గావించి విధ్యుక్తముగ షోడశోపచార పూజలు కావించెను. శ్రేష్ఠి పూజలను స్వీకరించి,నారదుఁడాతని కుశలము నడిగెను"

తన కుశలమునుజెప్పి శ్రేష్ఠి యిట్లడిగెను:- "ప్రభూ! మీరెచ్చటి నుండి వచ్చుచున్నారు? ఇప్పుడెచ్చటికి బోయెదరు?

నారదుఁడిట్లనెను:- "నాయనా! జన లోకములో ఋషుల సత్ర యాగ మొకటి జరుగుచున్నది; దానిలో బాల్గొనుటకు వెళ్ళియుంటిని. ఇప్పుడు నేను విష్ణుదర్శనము చేయుటకు విష్ణు లోకమునకు బోవుచున్నాను."

శ్రేష్ఠి దీనతా స్వరమున నిట్లనెను:- "ప్రభూ! మీరు భగవంతునకుఁ బార్షదులు. పరోపకారమే మీకు వ్రతము. నిత్యము భగవంతుని కడకు వచ్చుచు పోవుచుందురు. నాపని నొకదానిని జేసిపెట్టగలరా?"

నారదుఁడిట్లనెను:- "చెప్పుము. నేను నీకేమి పనిని జేసిపెట్టి వలయును. నాకు యోగ్యమైన కార్యమగుచో దానినిఁ జేయుటకు సదా సిద్ధముగనున్నాను"

శ్రేష్ఠి యిట్లనెను:- స్వామీ! మీకు యోగ్యమేమి? అయోగ్యమేమి? మీరు సర్వసమర్థులు. ఏది కావలయుననిన దానినిఁజేయుదురు. నాకొక చింతపట్టుకొనియున్నది. నాదగ్గఱ ఇంతటి అతులసంపత్తికలదు. కాని దీని నుపభోగించువాడును. పితరులకుఁ గొంచెము నీరు విడుచు వాఁడును నాకు బుత్రుఁడు లేడు. ఈ వస్తువులన్నియును నదృష్టము వలన లభించు చుండును. నాయదృష్టమునఁ బుత్రుడు కలఁడో లేడో దీనిని నేనెఱుఁగఁ గోరుచున్నాను. లేకున్నచో నేను నిశ్చయ మొనర్చుకొని సాధు సేవను జేసెదను. మీరు దీనిని మాత్రమడిగి రావలెను. ఎప్పుడు కలుగునో. ఈ విధముగ ద్వివిధముగఁ జిత్తము వ్యాకులము చెందుచున్నది."

నారదుఁడిట్లనెను:- "మంచిది. నేను నేఁడేపోయి భగవంతునడిగెదను. నేడే నీకు నేను దీనికి బ్రత్యుత్తరమును దెచ్చెదను"

ఇట్లు పలికి నారదుడు తన వీణను దీసికొని విష్ణు లోకమునకు బోయి అతడు భగవానుని స్తుతించెను. గాన మొకర్చి సుమధుర కీర్తనము బాడెను. నారదుని స్తుతిని విని భగవానుడు ప్రసన్నుఁడై యిట్లడిగెను:- "నారదా! ఈ సమయమున నీవెచ్చటనుండి వచ్చుచున్నావు?"

భగవానుని వాక్యములను విని ఉత్సాహ స్వరమున నారదుఁడిట్లనెను:- "స్వామీ! నేనీ సమయమున మర్త్య లోకమునుండి వచ్చుచున్నాను. మిమ్మొక మాట నడుగవలయును. ఆ శ్రేష్ఠి కలఁడే అతఁడు గొప్ప సాధు సేవి మీకును భక్తుడే అతనికి సంతానము లేదు, అతఁడు దీనికొఱకై చింతించుచుండును. అతనికి సంతానము కలుగునా కలుగదా?

ఇది విని భగవానుడు నవ్వి యిట్లనెను:- "నారదా! నీకెప్పుడు నితరుల చింతయేనా? మహాభాగా! అతని నొసటను నీ జన్మకే కాదు ఏడు జన్మల వఱకును సంతానము లేదు. వ్రాలిన కన్యథా జరుపుటకు నాకును సాధ్యము కాదు"

"ఇదివిని నారదుఁడు భగవానునకు ప్రణామము గావించి వీణను వాయించుకొనుచు మరల క్షణములో మర్త్య లోకమునకు వచ్చి, ఆ శ్రేష్ఠితో నిట్లనెను:- "భక్తా! అత్యంత దుఃఖకరమగు విషయము. నీకు సంతానము కలుగదు. ఈ జన్మములోనేకాదు, ఏడు జన్మల వఱకు నీకు సంతానయోగము లేదు.

శ్రేష్ఠి యిట్లనెను:- "మంచిదైనది. ఈ విషయము తెలిపినది ఇప్పుడు ద్వివిధ చింతలేద్దు. ఇఁక నీ ధనమును సదుపయోగము గావిం

చేదను. సాధు సజ్జనుల సేవకును, బరోపకారమునకును నేను దీని నుపయోగించెదను"

ఇదివిని నారదుఁడు వెడలి పోయెను. ఇప్పుడు శ్రేష్ఠి తన ధనమును సమపయోగ మొనర్ప నారంభించెను. అతఁడు విద్యార్థుల కొరకు చాలగ విద్యాలయములను దెఱపించెను. అనాథ బాలికులకు భోజన, వస్త్రము లేర్పాటు గావించెను. దీనులకును దుఃఖితులకును నన్నక్షేత్రము లేర్పాటుగావించెను. బీదలకు ఉచిత వైద్యాలయములను గట్టించెను. ఆతురుల కుపచార గృహములను. శుశ్రూషా భవనములను నిర్మించెను. సారాంశ మేమనఁగా నాతఁడు తన ద్రవ్యమును బరోపకారమునకు వినియోగించెను. ఆతనికడకెవరైన సాధుసజ్జనులు వచ్చిరా వారి నీశ్వర బుద్ధిచేఁ బూజించును. సమస్త విధములను సేవించును.

ఒక దినమునఁ దిరుగుచు దిరుగుచు నొక విరక్తుఁడగు నవధూత వచ్చెను. ఆతఁడు భగవానున కనన్య భక్తుడు. అహర్నిశములు కృష్ణ కీర్తన మొనర్చుచుండెను. ఈతనికడ నున్నదొక కౌపీనము మాత్రమే. భక్తదంపతులాతని కత్యధిక సేవా శుశ్రూషలను గావించిరి. ఆ దంపతుల సేవకు సంతుష్టుడై సాధువు వారినిట్లడిగెను:- "మీ యింటిలో సంతాన మెవరును లేనట్లున్నారే?"

దుఃఖముతో నాస్త్రీ యిట్లనెను:- స్వామీ! మాకా భాగ్యమెక్కడిది? పూర్వజన్మమున నేమైన జేసి యుండినచో బుత్రముఖమును జూచెడు వారమే.

మహాత్మని హృదయమున దయ కలిగెను. అతడు వెంటనే యిట్లనెను "మంచిది, మీకొక పిల్లవాడు పుట్టగలడు.

స్త్రీ యులికిపడి యిట్లనెను:- "స్వామీ! మాకొక పిల్లవాడు కలుగునా? మీరెట్టి మాటలు మాటలాడు చున్నారు.

సాధువిట్లనెను:- నీకొక్కఁడైనఁ దృప్తిలేదా? అయితే యిద్దరు కలిగెదరు!"

స్త్రీ శీఘ్రముగ నిట్లనెను:- కాదుస్వామీ! నాయభిప్రాయమదికాదు. ఒక్కడు కానిండు, ఇద్దఱు కానిండు. అదెట్లు సంభవమగును. మాకెట్లు సంతానము కలుగఁగలదు.

మహాత్ముడిట్లనెను:- చెప్పుచుంటిని గదా! కలుగుదురు, కలుగుదురు. ఇద్దరుకాదు ముగ్గురు పుట్టెదరు.

ఇప్పుడు శ్రేష్ఠి యూరకుండ జాలక యిట్లనెను:- "స్వామీ దేవర్షి యగు నారదుఁడు వచ్చినాడు. వారి వలన మా ముఖమున సంతానపు వ్రాత లేదని వినియుంటిమి. ఏలయనఁగా .... .... ....

మధ్యలోని మాటనాపుచు సాధువిట్లనెను :- నారదునికేమి తెలియును నీకిప్పుడు చెప్పుచున్నాను. నీకు వల్గురు పుత్రులు కలుగఁగలరు.

శ్రేష్ఠి మిక్కిలి ఆశ్చర్యములోబడి అతఁడిట్లనెను:- "స్వామీ! మీరు నా మాటను వినుఁడు. నారదుఁడు భగవానుని కడకు వెడలుచుండెను.

నేనాతనిచేత నడిగించితివి; నా యదృష్టమున సంతానము కలదా లేదా యని. అంత భగవానుఁడేడు జన్మలవఱకును నాకు సంతానము లేదని చెప్పినాడట.

అంత సాధువిట్లనెను:— "నేను చెప్పుచున్నాను. మీ కేడుగురు కొడుకులు పుట్టఁగలరు"

ఇప్పుడేమనఁగలఁడు. శ్రేష్ఠిగారు మెదలకుండెను. మహాత్ముఁడు ఇచ్ఛానుసారముగ నన్యత్ర వెడలి పోయెను. కొంత కాలమైన తరువాత శ్రేష్ఠిగారి భార్యకు గర్భమునిలిచెను. ఒక సంవత్సరమైన తరువాత నామె ఒక పుత్ర రత్నమును బ్రసవించెను. ఈ విధముగ నేడు సంవత్సరములకు ఏడ్గురు కొడుకులు పుట్టిరి. ఆ భక్త దంపతుల యానందమునకు మేరలేకుండెను. పిల్లలందఱును మంచి సుందరులు, సుకుమారులు, శీల సద్గుణ సంపన్నులు. వారు తమ బాల లీలలచే దల్లిదండ్రులకు మిక్కిలి యానందమును గలిగించుచుండిరి.

కొంతకాలమునకు దిరుగుచుఁ దిరుగుచు నొకదినమున ఆ నారదుఁడు మరల నా గృహస్థుని యింటికి వచ్చెను. నారదుని గాంచి పతి పత్నులిద్దరును నాతని కత్యధికాదరమును గావించిరి. పిల్లలందఱునువచ్చి ముని చరణములకు వందనము గావించిరి. తల్లి దండ్రులందఱును ముని చరణముల మీద బడవైచెను.

పిల్లలను గాంచి నారదుడాశ్చర్యముతో నిట్లడిగెను:- "భక్తవరా వీరెవరిపిల్లలు? వీరు మీ యింటిలో నేల నివసించుచున్నారు?

చేతులు జోడించుకొని శ్రేష్ఠి యిట్లనెను:- "స్వామీ వీరందఱును మీ సేవకులే"

అదరిపడి నారదుఁడిట్లడిగెను:- "ఆఁ. ఏమంటిరి ? వీరందఱును మీ పుత్రులా? వీరందఱును శ్రేష్ఠిగారి భార్య గర్భముననే ఉదయించిరా?

శ్రేష్ఠిగారి భార్య యిట్లనెను:- "అవును స్వామీ మీబోటి సాధువుల దయ, వీరందఱును సాధుసేవకులగు నట్లాశీర్వదింపుడు"

నారదునియాశ్చర్యమునకు మేఱలేకుండెను. ఆతనికి భగవంతునిపైఁ గోపమువచ్చెను. ఇట్లనుకొనెను:- భగవానుఁడు నన్నబద్ధముగావించినాఁడు. ఈ గృహస్థులునారదుఁడ బద్ధములుపలికినాడనుకొందురు. నేను భగవానునికడకు బోవలయును." అని యాలోచించుకొనెను, నారదునకు మిక్కిలి కోపము వచ్చెను. వెంటనే ఆతడు తన వీణను దీసికొని, పాదుకలు తొడిగికొట్టుకొనుచు దలనాడించుచు రామకృష్ణ గుణగాన మొనర్చుచు భగవానుని సమీపమునకు దోయెను."

నారద భగవానుని వ్యగ్రతను గాంచి నవ్వె. ఇంకను నవ్వుచు నిట్లనెను:- "రమ్ము నారదా! ఎచ్చటెచ్చటికి వెడలి వచ్చుచున్నావో చెప్పుము. నేడేదో తికమకగా నున్నావేమి ?

రోషస్వరమున నారదుఁడిట్లనెను: ఏమండీ స్వామీ! చాలులెండు. మీరు నన్నెల్లప్పుడును నందఱముందు హాస్యాస్పదునిఁ గావించుచున్నారు

మీకు సామాన ప్రతిష్ఠ కీర్త్యప కీర్తుల విషయములో ధ్యానము లేనే లేదు."

తెలియని వానివలె భగవంతుడిట్లడిగెను:- " ఏమి నారదా! ఏమైనది ? ఏమైనది ? నీ కవమాన మెట్లు జరిగినది ?

నారదుడు రోష స్వరమున నిట్లనెను:- " ఆశ్లేషి కేడు జన్మల వరకు సంతానము లేదని మీరు చెప్పితిరి. ఆతని కొక్కడుకాదు, ఇద్దరు కాదు, ముగ్గురుకాదు, ఏడ్గురు కొడుకు లీజన్మముననే కలిగిరి. వారాడు కొనుచుండ నేను బ్రత్యక్షముగ జూచి వచ్చితిని. భగవానుడు చెప్పినాడని చెప్పుచు నారదుడిట్లే అబద్ధములు చెప్పుచుండునని వారనుకొను చుండవచ్చును.

అంత భగవానుడిట్లనెను : నారదా ! ఈ సమయమున నాకు స్వస్థముగలేదు. రేపు నేను దీనికి బ్రత్యుత్తర మొసంగెదను."

మరునాడు నారదుడు పోగా లక్ష్మీదేవి చింతతో నిట్లనెను:- "నేడు భగవానునకు ఎంతో బాధ కలిగినది."

నారదుడు విని భయపడి భగవానుని సమీపమునకు బోయి యిట్ల నెను :- "ప్రభూ ! మీరు ! సుఖ దుఃఖ రహితులు. మీకిట్టి సహింప రాని వేదన యెట్లు కలిగినది ?

భగవానుడనన్య మనస్కుడై యిట్లనెను:- నారదా ! ఏమి చెప్పు దును ? నాకు స్వయముగ నేమియును గష్టములు లేకున్నను భక్తుల కష్ట

ములను నేననుభవింప వలసియుండును. ఏ భక్తుడైన దీనిని నివారింప నంతవఱకు నాకు శాంతి లేదు, సుఖములేదు."

నారదుడు దృఢతా స్వరమున నిట్లనెను:- స్వామీ! మీరుచెప్పుడు. ప్రపంచములో మీ కెందరో భక్తులు కలరు. కొందఱు భక్తిలో నాడు చుందురు. ఏడ్చుచుందురు. పాడుచుందురు. రోజంతయును గొందఱు గంట గొట్టుచునే యుందురు. మీ కొఱకు మీ భక్తులందఱును నేదైన జేయుటకు తత్పరులై యుందురు.

భగవానుడిట్లనెను:- " మంచిది, గొప్ప భక్తుడైన వాడెవడైన బ్రదికియుండగా దన చేతులతో దన హృదయమును దీసి యొసంగినచో నా దుఃఖము పోగలదు "

నారదుడు శీఘ్రముగ నిట్లనెను:- "స్వామీ! ఇదేమంత గొప్ప విషయము నేను పదునాల్గు భువనములు తిరుగుచుందును. చాలామంది భక్తులతో నాకు బరిచయము కలదు.

భగవానుడిట్లనెను:- "మంచిది నారదా! నీవుపోయి ఏ భక్తుని హృదయమునైన దీసికొని రావలెను. కాని గృహస్థ భక్తుల కడకు పోవలదు సుమా! పాపము వారు వారి హృదయమును వారి భార్యా బిడ్డలకు ఇచ్చియుండిరి. నాకొఱకై గోచీపెట్టుకొని సన్యాసులైన వారును, నా నామమును బలుకుచు భిక్షావృత్తిని జరించువారునగు విరక్తుల కడకే పోవలయును.

నారదుడిట్లనెను:- "స్వామీ! ఇది యింకను దేలికైనది. గృహస్థులలోను గొప్పగొప్ప భక్తులుకలరు; కాని భార్యాబిడ్డలవలన హృదయము నొసంగుటకు వెనుకాడవచ్చును. ఈ సన్యాసులకుముందెవరైనను వన్నారా, వెనుకెవరైననున్నారా? భగవత్కార్యమందు వారి హృదయము లగ్నమైనచో నింతకంటె నుత్తమమగు గార్యమేమికలదు? నేనిప్పుడే పోయెదను.

భగవానుడు కష్టముతో నిట్టూర్పును విడుచుచు నిట్లనెను:- "నారదా! సరే పొమ్ము. ఇట్టి భక్తుని హృదయము లభించినచో నాకు శాంతి కలుగును, కాకున్న నీ విధముగనే కొట్టుకొనుచుండవలసినదే,

నారదుడిది వినగానే తన వీణను గైకొని బయలుదేరెను. ఆతడు సాధువుల కడకుబోయి యిట్లనెను:— భగవానునకు జాల కష్టము సంభవించినది. మీలో నెవరైనను దన హృదయమును దీసి యిచ్చిచో భగవానునకు శాంతి లభించును. అనగానే కొందరు విని నవ్వుచుండిరి. కొందరు నారదుని గాంచి పిచ్చివానిగా జేయచుండిరి. కొందరు నారదుడిట్లే యేదో టక్కరిమాటలు చెప్పుచుండునని చుండిరి. గొందరు భగవంతునకు గష్టమేమి? యనుచుండిరి. "అయ్యా, ఏదో పత్రపుకూడు దిని యింతగా బెంచినది స్వహస్తములచే జీల్చుటకేనటయ్యా! కోసి కొనుటకును, జచ్చుటకును గృహస్థులు చాలమంది యున్నారు, మేము మా నోట బాగుగా రామ నామమును జపింతుము, కడుపు నిండ దిందుము. గుండెను జీల్చి యెవరీయగలరు?

భగవద్భజనముచే గడపునింపుకొను మహాంఘుఁడు పూర్తిగా సంఘదే. కొందఱిట్లనిరి:- "రామ రామ యనవె పరాయ సొమ్ములు మనవే." కొందఱిట్లనిరి:- "రామనామములట్టు, గోపాల నామము సేయి. హరి నామము కలకండ, కడుపు నిండదినుము."

ఈ సాధువులకంటె గృహస్థులే మేలని నారదుడు భయపడి, అటు నిటు దిరిగెను గాని తమ హృదయమును దీసియిచ్చుట కొక్కఁడును సిద్ధపడలేదు. నారదుడు చింతితుఁడై హరికడకుఁబోయి దుఃఖిత మనస్సుతో నిట్లనెను:— ప్రభూ! మీ మాయ అతి ప్రబలమైనది. స్వామీ! ఎవ్వరును తమ గుండెనీయ సిద్ధపడుటలేదు."

భగవంతుడిది విని మిక్కిలి చింతా మనస్కుఁడై కొంచెము సేపాలోచించి యిట్లనెను:- "నారదా! ఒక పనినిఁ జేయుము. వింధ్యా చలారణ్యమునకావల గంగాతీరమున నొక వట వృక్షము క్రింద నొక విరక్త సన్న్యాసి పరుండియున్నాడు. అతని కడకు బొమ్ము బహుశః అతని కడకుఁ బోయిన పని కావచ్చును."

నారదుడిది ఉత్సహించుచునే యుండెను. అతఁడా మహాత్ముని కడకుఁ బోయెను. చూడఁగా నచ్చట నొక యవధూత రాతిబండను దిండుగా బెట్టుకొని ఆనంద పూర్వకముగ శయనించియుండెను. అతని అధరపుటములు రెండును నిరంతరమును కదలుచుండెను. అతఁడు నిరంతరముగు నామస్మరణముప జేయుచున్నట్లు తోచుచుండెను. అతడొక

గోచిని మాత్రము పెట్టుకొని యుండెను. అతనికి బొంతగాని కమండు లువుగాని లేదు. మత్తుగా నాదోతువలె విశ్చింతతో బడియుండెను. నార దుడచ్చటికిపోగానే తనవీణనుగైకొని జయ జయ రామకృష్ణ హరీ అను నాలాపన మొనర్పసాగెను. తన యెదుట బ్రహ్మపుత్రుడగు దేవర్షి నారదునిగాంచి యాయవధూత లేచి నిలుచుండి ప్రణామము గావించి యిట్లనెను:- "నారదా రమ్మి! నీవు భక్తాగ్ర గణ్యుడవు ఎంతో యదృష్టమున గాని నీ దర్శనము లభింపదు"

నారదుడిట్లనెను:- స్వామీ! విష్ణు భగవానునకు గొంచెము వ్యథగానున్నది. ఎవరైన జీవించియుండిన భక్తుడు తన హృదయమును దీసియిచ్చినచో నది శాంతించును.

ఇది వినగానే ఆ పరమహంస యిట్లడిగెను: నారదా! నీవు కత్తితెచ్చితివా?" నారదుడు కత్తిని వెంటబెట్టుకొనియే తిరుగుచుండెను. అతడిట్లనెను:- స్వామీ! నేను కత్తి పట్టుకొనియే అంతటను దిరిగితిని. ఎవ్వరును విశ్వసింపరు. అందఱును భగవంతునకును గష్టముకలుగునా? భగవంతుడందఱి కష్టములను హరించు వాడుకదా! అందువలననే మేమెవరమును గుండెనిచ్చుటకు సిద్ధపడుట లేదందురు.

ఇది విని ఆయవధూత యిట్లనెను:- "నారదా! భగవానునకు గష్టము కలిగినదో లేదో అను నీ వివాదములో నేను బడదలచలేదు. అతనికి గష్టముకలుగనిండు, కలుగకపోనిండు మీరింతటి భగవద్భక్తులు చెప్పుచుండ నవిశ్వాసము చెందవలసిన పనిలేదు. ఈ క్షణభంగుర

శరీరముచే నణుమాత్రమైన భగవంతునకు నానందము కలిగించినచో నదియే మాకు మహాభాగ్యమని భావించెదము. మీవంటి భగవద్భక్తులు చెప్పుటచే అట్టివారి సమ్ముఖమున భగవన్నిమిత్తమై ప్రాణములు పోయి నను మాంసాస్థులచే నిర్మింపబడిన నీ హృదయము ప్రభువునకు విని యోగపడుచో నపవిత్రమైనదియును, నాశవంతమైనదియును, రోగ మందిరమును అశుచివంతమైనదియునగు నీ శరీరమునకుఁ గావలసినదేము న్నది? కత్తి నాచేతికిమ్ము తక్షణము నీవు నా హృదయమును దీసికొని పొమ్ము. నా మనః, ప్రాణ, శరీరములన్నియును ప్రభునిమిత్తము కొరకే."

చిత్రకేతు మహారాజు అంగిరో మునితో నిట్లనెను:- స్వామీ! ఇట్లు పలికి ఆ యవధూత వెంటనే తీక్షణమగు నా కత్తిచే దన హృదయ మును విదీర్ణము కావించునంతలో శంఖచక్రధారియును, వనమాలియును నగు హరి అచ్చట వెంటనే ప్రత్యక్షమై ఆ యవధూత చేతిని బట్టుకొని యిట్లనెను:- "నాయనా! నీవిదివఱకే నాకు హృదయము నొసంగి యుంటివి నేనావస్తువును నీ దేహరూపమగు మందిరమున నుంచితిని. నీవీ మందిరమును నాశము చేయకుము. నాకెప్పుడిష్టమైన నప్పుడు దానిని దీసికొని పోయెదను.

భగవంతుఁడెదుట నుండుటగాంచి అవధూత చకితుఁడయ్యెను. అతఁడాత్మ విస్మృతినిఁజెంది ప్రభువు యొక్క పునీత పాద పద్మము లందుఁబడెను. అతఁడు తన నయన సరోరుహములందలి శీతల జలము

లచే బ్రహ్మపాదపద్మములను బ్రక్షాళనము కావించెను. నారదుడును భగవానునెదుట నుండుటను గాంచి పరిహాసము కావించెను. అప్పుడు శ్రీమన్నారాయణుండు నారదునితో నిట్లనెను:- "నారదా! నీవే ఆలోచించుకొనుము. ఎవడు ఎంతో కఠినతతోగాని వదలజాలని గృహ, ద్వార కుటుంబ, పరివార, దార పుత్ర ధనవైభవాదుల నన్నిటిని వదలి నన్నొక్కనినే శరణు వేడినవారి యాజ్ఞల నెట్లుల్లంఘింపగలను? ఇట్టి భక్తులేది చెప్పినను దాని నన్యథా చేయుటకు నాకు సామర్థ్యము లేదు. ఇట్టి యనన్య భక్తుల ప్రారబ్ధమును నాశము గావించుటయును, విధి విధానమున కన్యథా కావించుటయును నేమంత కఠిన కార్యము కాదు. అందఱకును భాగ్యవిధాత నగునేను వారికధీనమై యుండగా వారి సమ్ముఖమున ప్రారబ్ధ, దైవ, భాగ్యములకేమంత మహత్త్వము కలదు? ఆ శ్రేష్ఠి యొక్క భాగ్యమున నేడు జన్మముల వఱకు పుత్రులు లేరనుట యథార్థము; కాని యీ మహాత్ముని నోట వెడలుటచే భాగ్యమున లేకున్నను నాతనికి బుత్రప్రాప్తి కలిగినది. నేను నా యనన్య భక్తుల వాక్యముల నసత్యములు కావింపను."

అంత నారదుడిట్లనెను:- "స్వామీ! నేనును మీ భక్తుడనే నా మాటను మీరేల అబద్ధము గావించితిరి"?

నవ్వి భగవానుండిట్లనెను:- "నీవు భక్తుడవు. ఇందులో సందేహమేమాత్రమును లేదు; కాని నారదా! అన్యథా తలంపకుండినచో నొక్క మాట పలికెదను."

నారదుడిట్లనెను:- "లేదు, స్వామీ! అన్యథా తలంచుటకే మున్నది? మీరేమన్నను నా మేలునకే పలికెదరు. మీ వచనము నాకు శుభప్రదముగనే యుండును."

అంత నవ్వుచు భగవానుడిట్లనెను:- "నారదా! నీవును గోచి పెట్టుకొనియే యుంటివి నీవును విరక్తశిరోమణిగ నెన్నఁబడుచున్నావు. నాకు విరక్తభక్తుని హృదయమవసరమైనపుడు నీవు నీ చంకలో గత్తినిఁ బెట్టుకొని అటునిటు లోకమున వెదుకబోయితివి గాని అయ్యా! నేను స్వయముగ నిచ్చుటనే యున్నానుగదా నా హృదయమును దీసియిచ్చెద నంటివా? అట్లు నీవు చేయలేదుకదా! అటునుండి ఇటును, ఇటునుండి అటును నా దుఃఖమున కనుతాపమును జెందుచుఁ దిరుగుచుంటివి. భగవదిచ్ఛలోఁదన యిచ్ఛను గలిపి దానికొఱకు బ్రయత్నించుటయును, ప్రయత్నములో నుండుటయును సాధారణ విషయముగాదు. గొప్ప భక్తుఁడవు. కాని తనకొఱకేమియును నుంచుకొనక అనన్యుడైనవాడు నాకంటెను గొప్పవాడు వానికి ప్రాలును దుడుపుటేమంత గొప్ప కార్యము కాదు."

చిత్రకేతు మహారాజు అంగిరో మునితో నిట్లనెను:- "ప్రభూ! మీరట్టి అనన్య భక్తులలోనివారలు. మీకు ప్రారబ్ధమును దుడిచిపెట్టుటే మంత ఘనకార్యము కాదు. నేను దుఃఖితుడను, ఆర్తుఁడను, సంతానము లేకున్న సుఖమును లేదు, శాంతియును లేదు. ఒకవేళ నాకు దురదృష్టమున బుత్రప్రాప్తి లేకున్నచో మీరు మీ తపః ప్రభావముచే నాయీ దురదృష్ట

మును దుడిచివేయుడు. ఏదో విధముగ నాకు బుత్రు నొసంగుడు. నేను మిమ్ము శరణు వేడినాను. మీరు నాకు ప్రభువులు. సేవకుని కోరికను స్వామి సదా నెఱవేర్చుచునే యుండును."

రాజు పలికిన యీ మాటలను విని సరళముగ అంగిరో మహాముని ఇట్లనెను:- "రాజా! నేనంతటి భగవద్భక్తుడనుగాను. నారదుని ముందు నా భగవద్ భక్తి నల్పమైనది. అయినను నేను నీ కోరికను నెఱ వేర్చెదను."

సూతుడిట్లనెను:- "మునులారా! ఇట్లు పలికి అంగిరో ఋషి రాజునకుఁ బుత్రుఁడెట్లు కలుగునా యని ఆలోచించుచుండెను."



## అంగిరోమునికృపచేఁ చిత్రకేతునకు బుత్రప్రాప్తి.

(౪౨౧)

శ్లో॥ ఇత్యర్థితః స భగవాన్ కృపాలుర్బ్రహ్మణః సుతః ।
శ్రపయిత్వా చరుంత్వాష్ట్రం త్వష్టార మయజద్విభుః ॥
అథాహ నృపతిం రాజన్నృషిస్త్రైక స్తవాత్మజః ।
హర్షశోక ప్రదస్తుభ్యమితి బ్రహ్మసుతో యయౌ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧౪అ. ౨౭. ౨౮శ్లో॥

వ॥ ఆ భగవంతుండైన యంగిరసుండు దయాళుండై పుత్త్రకామేష్టి చేల్చి యజ్ఞశేషంబతని యగ్రమహిషి యైన కృతద్యుతికిచ్చి నీకు బుత్త్రుండు గలిగెడి నతనివలన సుఖదుఃఖంబు లనుభవింపగలవని చెప్పి యమహాత్ముండు సనియె."

శ్రీమదాంధ్ర భాగవతము.

సత్య సాక్షాత్కారము కలవారి దర్శన మమోఘముగనుండును. ఇట్టి సాధువుల దర్శనము చేసినవారి భవ బంధనమూడి పోవును. వారి కృపయే కలుగుచో బంధము తీరిపోయినట్లే. సాధుకృప కొంచెము కష్ట ముగఁ దోచినను దాని పరిణామమున సుఖకరముగనే యుండును. ఏలననఁగా సాధువత్యంతాల్ప కాలముననే ప్రారబ్ధ భోగమును బూర్తి కావించును. సామాన్య నియమమును విశేష కృపచే నాశము గావించును లేదా తగ్గించును. తపో మంత్రములచే వారు నూతనాదృష్టము నుత్ప న్నము చేయఁగలుగుదురు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! చిత్రకేతు మహారాజు మాటి మాటికి నంగిరస మహామునినిఁ బుత్రుని కొఱకు యాచింపఁగాఁ గృపాళుఁడగు మునికి అతనిపై దయకలిగి ఇట్లనెను :- "రాజా! నేను నీచేత నొక పుత్రునికొఱకు యజ్ఞము చేయించెదను. దానివలన నీకవశ్య మొక పుత్రుడు కలుగఁగలడు."

ఇది వినఁగానే రాజు సంతోషమునకు మేఱలేకుండెను. వాడం బారిన యాతని ఆశాంత మునియొక్క అమృతవచనములచే మరలఁ

జిగిచ్చెను. ప్రేమ విహ్వలుఁడై యాతడు మునియొక్క పాదములను గట్టిగాఁ బట్టుకొని గద్గద కంఠముతో నిట్లనెను :- "ప్రభూ ! మీరే మునిగిపోవనున్న నాజీవన నౌకను నావలి యొడ్డునకుఁబట్టింపఁగల సమర్థ నావికులు. మీరే నా కోరికను నెఱవేర్పగల కల్పతరువులు. మీ కృపా సహకారముననే నేను నా మనోరథ రూపమగు దుస్తర సాగర మును సరళముగ దాటగలను. చెప్పుడు నేనేమి చేయవలెను. ఏమే సామాగ్రులను ప్రోవు చేయవలయునో తెలవిండు."

హర్షయుక్తములును వినీతములునగు రాజా యొక్క వచనములను విని అంగిరో మహాముని యజ్ఞమునకుఁగావలసిన సమస్త సామగ్రులను జెప్పెను. రాజా మిక్కిలి యుత్సాహముతో సమస్తసామగ్రిని నుత్సాహ ముతోడను, శుద్ధతతోడను సావధానముగను సంగ్రహించెను. అంగిర మహాముని శాస్త్ర విధిచే యజ్ఞమునారంభించెను. పుత్రార్థ మొనర్చు నాయష్టిలో త్వష్టయను దేవత ప్రధానుడు అందువలన సమస్త దేవతలకు నాహూతులైనతరువాత ముని విధ్యుక్తముగ మంత్రములతో త్వాష్ట్ర చరువును సిద్ధము చేయించి త్వష్టదేవతకగ్నియందు హవనముకావించి, అనంతరముయజ్ఞ శేషమగుచరువును దీసికొని ముని యిట్లనెను:- "రాజా ! నీ కొక్కడే పుత్రుడు కలుగగలఁడు చెప్పుము, ఏ రాణికి పుత్రుడు కలుగవలయును?"

ఒకరిద్దరైన రాజు చెప్పెను. వేలమంది కలరు. లక్షలకొలది రాణులుకలరు. తమ గర్భముననే సంతానమహోత్సవము కావలయునని

ప్రతి రాణికివిగలదు. అందఱును మిక్కిలి యుత్సాహముతో మహారాజు నిర్ణయము కొట్టుకొనుచున్న గుండెలతో బ్రతీక్షించుచుండిరి. ఇంతలోనే పురోహితుఁడిట్లనెను:- "అందరికంటె జ్యేష్ఠయును, శ్రేష్ఠయును, యజ్ఞములో బ్రధానముగా దీక్షను గైకొనినదియునగు రాణినే ముఖ్యముగ బత్ని యందురు. మహారాజు ప్రక్కన నందఱకంటె బెద్దదియును, బట్టమహిషియునగుఁ గృతద్యుతికలదు. ఆమెవలననే సంతానోత్పత్తి కలుగవలయును. న్యాయతః యీామెయే దీని కధికారిణి పురోహితుని యీా మాటలనువిని మిగిలిన రాణులందఱును హతాశలైరి. వారి యాశలు నిరాశలయ్యెను. న్యాయముగ కృతద్యుతియే పట్టమహిషి. యజ్ఞా వశిష్ట చరువామెకే యీాయఁబడినది. శాస్త్రీయ విధిచే రాజా చరువును మూఁచూచి రాణి కొసంగెను, పురోహితుల యొక్కయు, బ్రహ్మణుల యొక్కయు నాజ్ఞచే రాణి యాయజ్ఞా వశిష్టమగు పాయసమునుదినెను. యజ్ఞమునకు బూర్ణాహుతియై అవభృత స్నానమయ్యెను. మహామునియగు నంగిరుఁడు రాజానుమతినిఁబొంది బ్రహ్మలోకమునకు బోయెను."

ఇచ్చట ఋతు స్నానానంతరమున గృతద్యుతి మహారాజు దగ్గఱనుండి గర్భధారణమును గావించెను. రాజ్యమంతటను నానందము వ్యాపించెను. రాజునకును రాణికిని ఆనందమునకు మేఱ లేకుండెను; కాని రాణి యొక్క సవతుల మనస్సులలో నసూయ జనించెను,అయ్యో! మనమిట్లే యుంటిమిగదా! అనుకొనుచుండిరి.

శుక్లపక్షపాకరుని వలన సోమలత దినదిన ప్రవర్థమానమగుచుండును. అట్లే రాణి గర్భమును దినదిన ప్రవర్థమానమగుచుండెను.

రాణి యొక్క గర్భదినములు పూర్తికాఁగానే ఆమె యొక సుందర సుకుమార పుత్రుని గాంచెను. ఆ కుమారుడనినఁ గుమారుఁడా సౌందర్యమునకు సాక్షాత్ సజీవమూర్తి అతనిముఖము చంద్రుని మథింపగాఁ వచ్చిన సారభాగముచే జేసినట్లుండెను. ఇంతటి సుందర సుకుమారుఁడును మనోహరుఁడునగు బాలకునిఁ గాంచినఁ దల్లి దండ్రుల హర్షమునకు మేఱలేకుండెను.

తనపట్టమహిషి పుత్రరత్నమును బ్రసవించిన సంగతిని వినగానే రాజానంద కారణమున విహ్వలుఁడయ్యెను. రాజ్యములో వినినవారంద ఱను నానందమును జెందిరి. సర్వత్ర ఆనంద దుందుభులు మ్రోగెను. ప్రతి యింటను దమకే పుత్రుఁడు కలిగినట్లుగను త్సవములను గావించిరి. రాజ్యమంతటను నానంద తరంగము పెల్లుబికెను. ఎక్కడ చూచినను వైభవమే. రాజు తనకోశాగారమును దెఱచివేసెను. అన్న వస్త్రములను దెఱచెను. బ్రాహ్మణులతో నిట్లనెను:- "ఎవరి కెంతధనము కావలయునో తీసికొనిపొండు. ఎన్ని మణిమౌక్తికములు కావలయునో కొనిపొండు. కోరినన్ని గోవులను దోలుకొనిపొండు." బ్రాహ్మణులు మహారాజునకు విధ్యుక్తముగ స్నానమును జేయించి, మంగళమంత్ర స్నానమును గావింపఁజేసిరి. మహరాజు సుందర వస్త్రాభరణములను ధరించెను. బ్రాహ్మణు లాశీర్వదించిరి. బాలకునకు స్వస్తివాచన పూర్వకముగ జాతకర్మ సంస్కారమును గావింపజేసిరి. నాందీముఖ శ్రాద్ధసమయమున రాజు అసంఖ్యాకములగు వస్తువులను దానమొసంగెను. ఈ విధముగ స్వర్ణ, రజిత, భూషణ, గ్రామ, గజ, తురఁగములను, కోట్లకొలది

గోవులను రాజు బ్రాహ్మణులకును, యాచకులకును దానమొసంగెను. తన పుత్రుండు తేజస్వియును, యశస్వియును, దీర్ఘజీవియును గావలయు నని రాజునకు కోరిక.

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఏ వస్తు ప్రాప్తికొఱ కెంతటి అధిక ప్రతీక్షయును, దపస్సును జేయవలసియుండునో అది లభించి నప్పుడంతయధికమైన సుఖానుభవము కలుగును. ఏ వస్తువునకైనను శ్రమననుసరించి మూల్య ముండును. ఏ పరిశ్రమ లేకయే యెక్కడ పట్టిన నక్కడ భగవంతుఁడు లభించుచో నాతని ప్రాప్తి యింతటి మహత్వ పూర్ణమైనదిగ నెన్నరు. కన్యకకు బతిప్రాప్తియందింతటి యుత్కంఠతయును, బ్రతీక్షయును లేకున్నచో, నాతని వలన నామె కంతటి స్థాయీ సుఖముండదు. కంకరు రాళ్లవలె బంగారమును, వెండి యును నెచ్చటపట్టిన నచ్చట శ్రమలేక దొఱకినచో, కంకరురాళ్ళవలె వందలకును లభించుచో నా కంకరు రాళ్ళకును వెండి బంగారములకును భేదమేమున్నది? రెండును బృథివీ వికారములే. రెండును భూమినుండి వచ్చునవియే. భేదమేమనగా గంకరుకంటె సువర్ణమును దీయుట కధిక శ్రమను జెందవలయును. దానిని బొందుటకు గంకరుకంటె నధికముగ బ్రతీక్ష చేయవలసియుండును. అందువలన వస్తువునకు మూల్యము లేదు, దానికొఱకై పడు శ్రమకు అధికమూల్యమగును.

నిర్ధనులకు ప్రతిసంవత్సరమును కుక్కలకును పిల్లులకువలె బిల్లలు పుట్టుచుందురు. వారు పుట్టుటవలన వారిపై వారికి గారాబముండదు. ఇంతే

కాదు దరిద్రుడు గొప్ప పరివారమున నన్నవస్త్రాభారములవలన నధిక సంతానము కలిగినఁగష్టానుభవము కలుగును కాని ఇంటిలో నంతులేని ధనసంపత్తులుండి, పుత్రులు లేకుండినచో వారెల్లప్పుడును బుత్రుడు కలుగవలయునని కోరుకొను చుందురు. వారు చాతకము స్వాతి బిందువులకై ప్రతీక్షించునట్లు పుత్రుల కొఱకు ప్రతీక్షించుచుందురు. దైవ యోగము నట్టివారికిఁ బుత్రుడు కలిగెనా ఆ యానందము వర్ణనాతీతముగ నుండును.

శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! చిరకాలమునకు నెన్నో దినములు పుత్ర ప్రతీక్ష కావించిన తరువాత చిత్రకేతు మహారాజునకు బుత్రుని యొక్క మనోహర ముఖమును జూచుభాగ్యము కలిగెను. దరిద్రునకు గష్టముచే గోట్ల కొలది రూప్యములు ప్రాప్తింపగా వానికి దాని మీద నత్యధికాసక్తి యున్నట్లు రాజర్షియగు జిత్రకేతువ కత్యంత క్లేశముచేఁ బ్రాప్తించిన పుత్రుని వలన నాతని ప్రేమ దిన దిన ప్రవర్ధమానమగుచుండెను. అతనికి బుత్రముఖమును జూడక ఒక్క క్షణమైన దోచదు. రాజసభనుండి పుత్రునిఁ జూచుటకు మాటిమాటికిని లేచివచ్చి అతనిని మిక్కిలి ఆసక్తితో ముద్దు బెట్టుకొని పోవును. పిల్లవాడు పెరిగిన కొలది రాజునకాతనిపై మోహమును బెరుగుచుండెను. అతడు రాజునకు బహిః ప్రాణమువలెఁ బ్రియుడయ్యెను.



# కృతద్యుతి సవతులావెం సుతునకు విషమొసంగుట

(४-२)

శ్లో॥ ఏవం పందహ్యమానానాం సపత్న్యాః పుత్ర సంపదా।
రాజ్ఞోఽపమత వృత్తీనాం విద్వేషో బలవానభూత్॥
విద్వేష నష్టమతయః స్త్రియో దారుణచేత సః।
గరం దదుః కుమారాయ దుర్మర్షా నృపతిం ప్రతి॥

శ్రీ భాగ. ౬ సం. ౧४ అ. ४२-४३ శ్లో॥

వ॥ పుత్రమోహంబునఁ గృతద్యుతియందు బద్ధానురాగుండై మహీధవుండు వర్తించుచుండం దక్కిన భార్యలు సంతాన సంతోష వికలలై యీ మోహంబునకుం గారణంబు పుత్రుండయని యీర్ష్యంజేసి దారుణ చిత్తలై కుమారునకు విషంబిడిరి."

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రపంచమున శత్రువులు బయట లేరు లోపల దాగియున్నారు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను నీ యార్గురు శత్రువులు సదా మనుష్యునకు లోపల దిష్ఠవేసికొని యున్నారు. వీనిని జయించినవాడు విశ్వ విజయుఁడగును వీని కధీనుఁడైన వాఁడడుగడుగునకును బరాజితుఁడగుచుండును. పరోత్కర్షను గాంచి హృదయమున దాహము కలుగుటయును, మంట బుట్టుటకునే యీర్ష్య యందురు.

ఈర్ష్యకు వశీభూతుడై మానవుడెన్నో దారుణపాపము లొనర్చుచుండును. తాను బాధపడుచుండియును బరోపకార మొనర్చుటకును, సర్వదా తన స్వార్థమును నెఱవేర్చుకొనదలచుటకును స్వార్థమందిసుమంతైన వ్యాఘాతముకలిగెనా కోపగించుకొనుటకును గృపణత్వమందురు. వాని స్వభావము క్రూరమగును. వానిలో సౌహార్ద్రమే యుండదు, ధనికుల సాధారణముగ హృదయ హీనులుగ నుందురు. ఏలననగా వారిలో సౌహార్ద్రము మాత్ర మిసుమంతైనసుండదు. వీరికి జైతన్యమును బ్రేమించుట తెలియదు. వీరి ప్రేమ జడ పదార్థములగు వెండి బంగారముల మీదనే యుండును. వీరు ధన లోభమున నేమైన జేయగలరు. ఇదే విధముగ గ్రోధము కలవానికిని నెవ్వరిమీద బ్రేమయుండదు. క్రోధమున నట్టివాడు తన సంబంధులనైనను హత్య గావించును. కాముల స్థితియు నింతే. కామసుఖమునే సర్వ శ్రేష్ఠ సుఖముగ నెంచువారు వారియా సుఖమునకు వ్యాఘాతము కలిగెనా వారు క్రూరులగుచుందురు. పురుషుల కంటె స్త్రీలలో గామమధికముగనుండును. తన సతీత్వమును భ్రష్టము కావించుకొనిన స్త్రీ తన కామసుఖము కొఱకై క్రూరాతి క్రూర కార్యము లొనర్చుటకును జంకదు. కామము కొఱకు చేయరాని పనులన్నిటిని జేయును.

శ్రీ శుకదేవుడిట్లనెను:- "రాజా! ఈ ప్రపంచ రచనము భగవంతు డెంతవిచిత్రముగ జేసినాడు! ఎట్టి విపరీతములగు వస్తువులతో నీ జగన్నిర్మాణమును గావించినాడు. ఒకనికి సుఖకరముగ నున్న వస్తు

వింకొకరికి దుఃఖకరముగ నుండును. చంద్రుని వెన్నెల అందఱకును సుఖకరముగ నుండును; కాని విరహులకును జార చోరులకు నది దుఃఖకరముగ నుండును. వర్షమువలన నందఱకును సుఖముగనుండును. కాని పచ్చికుండలను బయట బెట్టుకొనిన కుమ్మరికా వర్షము దుఃఖము గలిగించును. తన పరిజనములోనివారు చచ్చినచో నింటిలోని వారికి దుఃఖము కలుగును; కాని శత్రువునకీ సంవాదము సుఖముగ నుండును ఒకానొక దొంగనుజూచి పథికుఁడు భయముచే గడగడ వణఁకును ఆతఁడే తన ప్రియురాలి కడకుబోయి నప్పుడామె సుఖించును ఇదే విధముగ నీప్రపంచమున నందఱకును బ్రియమగు వస్తువేదియును లేదు."

చిత్రకేతు మహారాజు భార్య కృతద్యుతి రాణికి పుత్రుడు కలిగెను. సమస్త ప్రజలకును. రాజునకును రాణికిని మిక్కిలి హర్షము కలిగెను; కాని కృతద్యుతి సవతులకు-రాజు యొక్క యితర భార్యలకు వాని కారణమున దుఃఖము కలిగెను. కారణ మేమనఁగా నిప్పుడు రాజు కృతద్యుతినే అందఱకంటె నధికముగ బ్రేమించుచుండెను. ఆమెకే అత్యధికముగ మాన సన్మానము కలుగుచుండెను. ఆమె యంతఃపుర మందే మహారాజు రాత్రి దినములు నివసించుచుండెను. కుసుమ పేశల సుకుమారశరీరుఁడగు నాతని యేకైక పుత్రునిఁగాంచిన నాతఁడాతనినిఁ జూడక ఒక్క నిమిషమైనను నుండజాలకుండెను. దరిద్రుఁడు ధనమును గోరినట్లు రాజు తన పుత్రునే కాంక్షించుచుండెను. ఇప్పుడాతఁడితర రాణులను మఱచిపోయెను.

ఇంతవఱకును రాణులందఱు నైకమత్యముతో నుండిరి. ఎవ్వరికిని సంతానము లేకుండెను. రాజందరి యిండ్లకును బోవుచుండెడి వాడు. అందర నొక్క రీతిగనే చూచుచుండెను. ఇప్పుడు భేదభావముద యించెను. ఒక్కతెకు పుత్రుడు కలిగెను. మిగిలిన వారందఱును వంధ్యలే. వంధ్యలైనను రాజిదివఱకువలె నాదర సత్కారములను జూపు చుండినచో వారికి సంతోషమయ్యేడిదే కాని రాజు పుత్రస్నేహమున విమూఢుడై రాణులనందఱను మరచిపోయెను. కృతద్యుతికి తన సౌభాగ్య మునకు గర్వముండెను. ఇతర రాణులామెను ద్వేషింప నారంభించిరి.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఒకే దుఃఖములో దుఃఖించు వారు పరస్పరము ద్వేష భావమును వీడి సహానుభూతిని జెందుచుందురు ప్రత్యక్షముగ జూచిన విషయమును జెప్పుచున్నాను. గంగా ప్రవాహ ములో నొకసర్పమును మనుష్యుడు గొట్టుకొని వచ్చి ఒకానొక చెట్టు నాశ్రయించిరి. ఆ చెట్టుమీద కెక్కిరి. సర్పము కఱవలేదు. అది శాంత ముగ బడియుండెను. రాజుగారి యితర రాణులందరకు నొక్కటే దుఃఖము. రాజందరను దిరస్కరించి యుండెను. అందఱును సంతాన హీనులే. అందరి అంతఃకరణములు మండిపోవుచుండెను. అందువలన వారందఱును గలిసి గోష్ఠిని గావించిరి. వారిలో నందరికంటె సర్వశ్రేష్ఠ సుందరిగ నెన్నబడునదియును, రూప యౌవన సౌందర్య మాధుర్యము లందత్యధిక గర్వము కలదియు నందరి యెడల సానుభూతిని బ్రక టించుచు నిట్లనెను:- "అక్కలారా! మన మందరమును రాజపుత్రు లము. మనము అటుల నిటుల వచ్చినవారమును గాదు. రాజు ధర్మ

పూర్వకముగ శాస్త్రీయ విధిచే మనలను వివాహమాడెను. ఇంతవరకాతఁడు మనలను సమాన భావముతో నాదర సత్కార సన్మానము లొనర్చు చుండెడువాడు కాని మన సవతియగు కృతద్యుతికి పిల్లవాడు పుట్టినప్పటి నుండి ఆతఁడు మనల నందర నవమానించుచున్నాడు. కృతద్యుతి దాసీలతో నాతఁడెంతటి కలిసిమెలసి మాటలాడుచున్నాడో చూడుము, కాని మనలను జూడఁగనే ముఖమును దిప్పుకొనును. మన యిండ్లకు వచ్చుట అటుంచి ఎన్నఁడును గుశలప్రశ్నయైన నడుగడు. స్త్రీలకు సర్వ స్వధనము పతియే. పతివలననే ఆమె సౌభాగ్యవతిగ నెన్నబడు చుండును తన భర్త తనను జూడక, సవతి దాసీలకంటె హీనముగ దిరస్కార మొనర్చుచుండ నట్టి భాగ్యహీనలును, బతి తిరస్కృతలును, దుర్భగులు, సంతాన రహితలగు స్త్రీలకు ధిక్కారము ఛీ! ఛీ! వారి జన్మలేల? నేడు మన కట్టి గతి పట్టినది. మన మందరము మన పతిచే నవమానింపబడుచున్నాము. మన యొక్క ధర్మము మన స్వామికి సేవ చేయుట మన సవతియగు గృతద్యుతి మన యీ యధికారము గూడ హరించినది. మనము ధర్మ హీనలమైతిమి."

అంత నింకొకతె యిట్లనెను:- "స్త్రీ సదా పరాధీనమైయున్నది. ఆమె యెల్లప్పుడును దాసిగా నుండవలసినదే. పతియాజ్ఞ ననుసరింప వలయును. ఆతనికోరిక ననుసరించి వర్తింపవలయును."

ఇదివిని మూడవ యామె యిట్లనెను:- "దాసీయగుటలో గొంచెము సుఖమును లేదు దుఃఖమును లేదు-పతిసేవ చేయు భాగ్యము కలిగినచో

దాసీతనము శ్రేష్ఠమైనదే. ఏలయనగా స్త్రీలకు బతిసేవకంటె గౌరవ మింకొకటి లేదు; కాని నేడు మనమందరమును సంతాన హీనులమగుటచే మనము కృతద్యుతి దాసీల కంటెను దాసీలమైతిమి. కృతద్యుతి దాసీల యొక్క సేవకులతోగూడ మహారాజు మాటలాడుచున్నాడు; కాని మనతో బలుకుటయే లేదు."

శ్రీ శుకదేవుడిట్లనెను:- "రాజా! ఈవిధముగ స్త్రీలలో బరస్పర మిట్టి రాగ ద్వేషయుక్తమును నీర్ష్యాయుక్తములును నగు సంభాషణము జరిగెను. కృతద్యుతియొక్క పుత్ర సంపత్తిచే వారిహృదయము సంతప్త మగు చుండెను. దానికితోడు రాజు యొక్క ఉపేక్ష ఆ మండుచున్న హృదయాగ్నికి ఇంధనములను దగిల్చినట్లుండెను. ఇప్పుడు దుస్సాహస మొనర్చు క్రూరచిత్తులగు సవితలు కలిసి యిట్లు నిశ్చయించుకొనిరి. కృతద్యుతి యొక్క ఈ బిడ్డడు మనకు కంటకుడు. వీడు పుట్టుటవలననే మనమింతగా దిరస్కృతలమును. నవమాన తలము నైతిమి. ఏదో విధ ముగ వీనిని జంపి వేయవలయును." ఇట్లు నిశ్చయించుకొని వారొక దినమున నిద్రించుచున్న పిల్లవానికి తీక్షణ విషము నొసంగెను. పిల్ల వాడు విషమును దినగానే మరణించెను.

శ్రీశుకదేవుఁ డిట్లనెను:- "రాజా! ఈ స్త్రీల హృదయమెవరికినిఁ దెలియదు వీరెంత స్నేహమయలు, కోమల హృదయలు, దయామయలు, సరళలుగనుందురో ద్వేషముత్పన్నమైనపుడు క్రూరహృదయలు, దుస్సాహ కర్మ నొనర్చు వారగుదురు. వీరు తమ ధర్మమందుండినచో సాక్షా లక్ష్మీరూపులుగను, గృహమునకుఁ గామధేనువులుగను, సుఖకారు

లగుదురు వీరు హిమవశీభూతలై యీర్ష్యాద్వేషములకును, ఆత్మగ్లాని, ప్రతీకారములకును నధీనులగుచుందురు. సాక్షాత్తుగ రణచండీదేవులుగను, భయంకరములుగను, రాక్షసులుగను నగుచుందురు. ఆ సమయమున వీరు కఠినాతికఠిన క్రూరకర్మ లొనర్చెదరు. పతినిగూడ చంపివేయఁగలరు. పుత్రుని హత్యనైన జేయఁగలరు. తోఁబుట్టువులకును దల్లిదండ్రులకును విషము నొసంగఁగలరు. వ్యయముగ బావులలో దుమికి, విషమును దిని, ఉరిపెట్టుకొని ఆత్మహత్యనైనఁ జేసికొందురు. వీరెంత స్వభావ సులభలుగను, కోమలాంగులుగ నుందురో అట్టివారు కామవశలై తీక్షణ హృదయులుగను క్రూరములుగను నగుదురు."

చిత్రకేతు మహారాజా భార్యల బిడ్డి సవతి సౌభాగ్యమును గాంచ గాఁనే విద్వేషముచే నశించెను. రాజింత పుత్ర ప్రేమతో నుండుటను వారు సహింపఁజాలకపోయిరి. ఈ మూలముననే తమకవమానము కలుగు చున్నదను దుర్బుద్ధి వారి మనస్సులలోఁ గలిగెను. అందువలన వానికి విషము నొసంగి వాని జీవితము నంతము గావించిరి.

శ్రీశుకదేవుడిట్లనెను:- "రాజా ! ఈ ప్రాణి యెన్నో మనోరథము లొనర్చుచుండును. కాని చివరకు వాని మనోరథములన్నియును విఫల ములైపోవును, కృతద్యుతి మహారాణి తన బిడ్డఁడు సుఖముగ నిద్రించు చున్నాఁడనుకొనెను గాని అతఁడు శాశ్వతముగ నిద్రించెను. అతఁడీ లోకమును త్యజించి పరలోక వాసుఁడయ్యెను. ఇంకను దనకుమారుఁడు లేవలేదేమని కృతద్యుతి మాటిమాటికి నమకొనుచుండెను. తాను స్వయ

మూర్ఛపోయి చూచివత్తునని చాలాసారు లాలోచించుకొనెను; కాని మరల, వెళ్లిన నాతని నిద్రకు భంగము కలుగునని తలంచెను మంచి నిద్రలో లేచినయెడల తలనొప్పివేయును. ఇట్లాలోచించుకొని ఆమె అంతఃపురములో నటు నిటుఁ దిరుగుచుండెను. పిల్లవాని కడకుఁ బోనేలేదు."



# మృత పుత్రుని కొఱకు తల్లిదండ్రుల శోకము

( ౪౨౩ )

శ్లో॥ పతిం నిరీక్ష్యోరుశుచార్పితం తదా
మృతంచ బాలం సుతమేక సంతతిమ్
జనస్య రాజ్ఞీ ప్రకృతేశ్చ హృద్రుజమ్
సతీ దధానా విలలాప చిత్రధా॥

శ్రీభాగ. ౬ స్కం, ౧౪ అ. ౫౨ శ్లో॥

తరలము: పుడమినిట్టిక నిర్వానందడి పొక్కుచుం గడుదీనయై, యడఁకు వేమియు లేని వాక్కుల నావురంచు విలాపమం, దెడరు దోఁపభృశాతురోన్నతి నేడ్చెనన్ విని భీతితోఁ, గడుపుఁబట్టి వియంగ భూపతి కాంత గ్రక్కుననేఁగుదున్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

సుఖదుఃఖములకుఁ బరస్పరము సమానరూపమున సంబంధము కలదు దేని సంయోగమున మనకధిక సుఖము సంభవించునో దాని వియోగమున మనకంతటి అధిక దుఃఖము సంభవించును. దుఃఖముయొక్క లఘుత్వ గురుత్వములు వ్యక్తిమీఁద నాధారపడి యుండలేదు. అది సంబంధము మీద నా ధా ర ప డి యు న్న ది. మ న కె ం త యధికస్నేహముండునో దాని వియోగమున నంతటి యధిక దుఃఖము కలుగును. మనము స్మశానమునకు సమీపమున నుండి ప్రతిదినమును, మృతకళేబరములను జూచుచుండిన మనకు దుఃఖము కలుగనే కలుగదు. ఏలయనఁగా వానితోమన కేమియును సంబంధములేదు. ఎవరైనఁ జెప్పినచో మనముపేక్షా స్వరమున నిట్లందుము- "సదా ఎవరు బ్రతుకుచున్నారు. పుట్టినవాఁడు చావవలసినదే. కాని మనకు సంబంధించినవాఁడు చచ్చినచో దుఃఖము కలుగును; పినతండ్రి, దగ్గఱ బంధువు చచ్చినచో దానివలన మనకత్యధిక దుఃఖము కలుగును. యువకుఁడును ప్రియుఁడుఁనగు బుత్రుడు మరణించినచో వానిదుఃఖమునుగూర్చి చెప్పవలసినదేమున్నది? అప్పుడు జ్ఞాన, ధ్యాన, వేదోపాసనలన్నిటిని మఱచి కన్నుల నీరు పెట్టుకొందురు. దీనినిఁబట్టి దుఃఖమునకుఁ గారణము మృత్యువు కానట్లు తెలియుచున్నది. ఒకవేళ మృత్యువువలననే దుఃఖము కలుగుచో నందఱు మరణించినను దుఃఖము కలుగవలెను; కాని అట్లగుటలేదు. పరులకు సంబంధించినవారు మరణించిన నత్యధికముగ నానందము కలుగుచున్నది. ఇంకొకనికి అత్యధిక దుఃఖము కలుగుచున్నది. యథార్థమునకు దుఃఖమునకుఁ గారణము మోహజనిత

స్నేహము. మమతాపూర్వకమగు నత్యధికాసక్తి, ఎవ్వరిమీఁదను నాసక్తి లేనివానికెవ్వరు మరణించినను దుఃఖముండదు, పుట్టిన సుఖముండదు. అట్టివాఁడన్ని సమయములందును సమానముగ నుండును. కాని యిట్టి సమదర్శియగు జ్ఞాని ప్రపంచమందరుదుగ నుందురు. అట్లుగాక సదా కలిసి మెలిసియుండి ప్రేమపూర్వకముగఁ నాలింగన చుంబనాదులొనర్చుచు గనుపాపవలె బ్రేమపూర్వకముగ బోషించుచు,నాహారపానీయముల నొసం గుచు, శయనింపఁ జేయుచునుండిన అట్టివాఁడు పోయిన నెవనిహృద యము బ్రద్దలుకాదో అప్పుడట్టి హృదయము వజ్రసదృశమైనను గావలెను లేదా, అట్టివాఁడు హృదయహీనుఁడైనను గావలెను.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! క్రూరచిత్తలగు నా స్త్రీలు పుష్పసుకుమారుఁడగు నా సుందర రాజకుమారుని నిర్దయత్వముగ హాలా హల విషము నొసంగిరి."

పిల్లవాఁడతి సుందరుఁడు మూఁడు నాలుగేండ్ల వాఁడయ్యెను. చిలుక పలుకుల వలెఁ గోకిలకంఠముతోఁ బలుకుచుండెడువాఁడు. ఒక్కొక్కప్పుడు తల్లిమెడకు గౌఁగిలించుకొనును. ఒక్కొక్కప్పుడు తండ్రి వడిలో నాడుకొనును. అమాయక సుందర స్వరూపము. అతఁడు నవ్వినచో నోటినుండి ముత్యాలు రాలుచున్నట్లుండెను. అతఁడు తన ఉంగరములు తిరిగిన ముంగురులను విజీయఁబోసికొని రాజహంసవలె నడుచుచు తల్లి వ్రేలుపట్టుకొని పోవుచుండిన తల్లియొక్క ఆనందము నకు మేఱలేకుండెడిది. తల్లి మాటిమాటికిని దృణమును దుడిచివేయును

దిగదుడుచును. దేవతలకు మ్రొక్కుకొనును. ఉప్పును వెంట్రుకలను
దిగదుడిచి నిప్పులలో వేయును. మిరపకాయలను దిగదుడిచి నిప్పులలో వేయును
తన కన్నయ్యకు దృష్టితగులకుండు నుపాయములన్నిటినిఁ జేయుచుండెడిది.
ఆమె ఎన్నితాయెత్తులను గట్టించెనో లెక్కయేలేదు. తన చేతులతోఁ
పిల్లవానికినీళ్లుపోసి, తుడిచి, తలదువ్వును. వివిధ రంగులుకల వస్త్రాభూష
ణములను ధరింపఁజేసి అలంకరించును. పెద్దపెద్ద కన్నులకుఁ జక్కగఁ
గాటుకను దిద్దును. తలకొకటోపీనిఁబెట్టును; పైఁగానాతని ముఖమును జూచి,
కౌగలించుకొని, ముద్దుపెట్టుకొని యుబ్బిపోవుచుండెడిది. బాగుగా నలం
కరించి రాజువడిలోని కొసంగును. రాజాతనిస్పర్శచే స్వర్గసుఖము ననుభ
వించుచుండును. ఆతనిముఖచుంబనముచే నాతని కమృతముకంటె మించిన
సుఖము లభించెడిది. ఆతనితోఁగూడ తాను బాలకుఁడై వివిధ క్రీడలలోఁ
బాల్గొనును. పిల్లవాఁడు ఒడిలో నాడియాడి నిద్రపోఁగా మెల్లగాఁ దీసికొని
పోయి తల్లికొసంగును. మహారాణి పిల్లవానిని బంగారపు టూయలలోఁ
బరుండఁబెట్టి జోలలు పాడెడిది.

ఇతర రాణులును బిల్లవానినిఁ జూడవచ్చుచుందురు. మా పిల్ల
వానిని జూచుట రావలదని స్పష్టముగ నెట్లు చెప్పఁగలదు? కాని వారు
వచ్చుచుండుట ఈమెకిష్టములేదు ఆమె దరిద్రుఁడు ధనమును దాఁచు
కొనునట్లు మిక్కిలి యత్నముతోఁ బిల్లవానిని దాఁచుచుండెడిది. ఎవ్వరి
దృష్టియును నాతనిపైఁ బడకుండునటులఁ జేతనైనంత వఱకుఁ బ్రయ
త్నము చేయుచుండెడిది. ఆమె క్షణక్షణమున బాలుని ముఖమును ముద్దు
పెట్టుకొనుచుండెడిది.

మధ్యాహ్న సమయము. బాలుఁడు పాలుద్రావి నిద్రించుచుండెను. రాణి వాని నుయ్యాలలో నిద్రబుచ్చెను. సుఖమున నీఁగలు వ్రాలకుండు నటులఁ జాలనులిపిరి పట్టువస్త్రమును సుఖమునఁ గప్పెను, దాపి విసురు చుండెను. ఇంతలోనే యిద్దరు ముగ్గురు రాణులు వచ్చి పిల్లవాని నూపు చుండిరి. వాసన చూడఁగానే మరణించునంతటి తీక్ష్ణవిషము నెచ్చటినుండి తెచ్చిరోగాని దాసీ చూడకుండునటుల వారావిషము నాతనిపైఁ బ్రయో గించిరి. విషప్రయోగము కాఁగానే సుకుమార కుమారుఁడు మరణించెను. వాఁడు కన్నులు తేలవైచెను. శరీరము నీలమయ్యెను. ముఖము మలిన ముగను దేజోవిహీనమగను నయ్యెను, రాణులు జాగ్రత్తగ వస్త్రమును గప్పి వెడలిపోయిరి. తరువాత నిద్దరు వచ్చిరి, నలుగురు వచ్చిరి. అనంతరము దాసీ వచ్చెను ఈ విధముగఁ బ్రతిదినమువలె వచ్చుచుఁ బోవుచుండిరి బాలుఁడు నిద్రలో నుండుటనుగాంచి దాసీజనము దొలగి పోయిరి,

కృతద్యుతి మహారాణి అటు నిటు దిరుగుచుండెను గాని ఆమె చిత్తము పిల్లవానిపైననే యుండెను. ఈ సమయమున నిత్యము పిల్లవాఁడు గడియ, రెండు గడియలు నిద్రించుచుండును. నిద్రలేవగాఁనే శబ్దము చేసెడువాఁడు. తల్లి పరువిడి వానికడకుఁ బోయెడిది. వెంటనే లేవఁదీని కౌగిలించుకొని తాను జనుపాలిచ్చెడిది. లేవఁగానే పిల్లవానికిఁ దల్లిపాలు త్రాగు నలవాటైపోయినది. తల్లికి దానివలన సుఖము కలుగు చుండెడిది. తనపాలిండ్లకుఁ బుత్రస్నేహముచేఁ జేపు బాగుగా వచ్చు చుండెడిది. పిల్లవాఁడు చాలసేపటివఱకు లేవకున్నచో మనుఁగుమగూడ గప్పెడిది.

పిల్లవాఁడు నిద్రలేచు సమయమైనను నిద్రలేవక పోవునప్పటికి తల్లి అనేకసార్లు దగ్గి తుమ్ముచుండెను. కాని ఆ చప్పుడుకు నేఁడు లేవలేదు. ఏమియును ఫరవాలేదు, పిల్లవానికి నిద్రవచ్చినదేమో, నిద్రింపనిమ్ము. పిల్లలకు నిద్ర చాలామంచిది; అనుకొనెను. రెండు గడియలయ్యెను మూఁడయ్యెను, నాలుగయ్యెను. కాని లేవలేదు. ఇప్పుడు తల్లికి సందేహము కలిగెను. పిల్లవాఁడింతసేపు ఇదివఱకెన్నఁడును నిద్రింపలేదు. మంచముమీఁద నుండియె మహారాణి యిట్లు కేకవైచెను:- ఓసీ దాసీ! నీవు పిల్లవానివద్ద నుంటివా లేవా?"

దాసీది యిట్లనెను:— "ఉన్నాను మహారాణీ! అబ్బాయిగారింకను నిద్రపోవుచున్నారు"

ఆమె మెల్లగా నిట్లనెను:- నేఁడు పరుండి చాలసేపైనది. ఇంకను లేవలేదే. నీవు లేవఁదీసికొనిరమ్ము. నేను నా మంచముమీఁద పక్కలోఁ బరుండబెట్టుకొనెదను. వాఁడెందులకో లేవలేదు. ఇంతసేపెన్నఁడును నిద్రించెడువాఁడు కాడు;"

రాణియొక్క యీ మాటలను విని దాసి నెమ్మదిగ ముఖముమీఁది వస్త్రమును దీసిచూచి చాల ఆడాపిడిఁ జెందెను. పిల్లవాని నరములన్ని యునునీలములై యుండెను. నోటివెంటఁ జొంగ కారుచుండెను. కన్నులు తేలవైచెను. ఆతఁడు ప్రాణశూన్యుఁడై నిర్జీవముగఁ బడియుండెను. ఆమె పిల్లవానిఁ గదలించి, ప్రాణములుగతి చూచుచు గుండెను బరీక్షించెను కాని ఆతనికిఁ బ్రాణము లెక్కడివి? ఆతఁడు పరలోక

ప్రయాణము చేసియుండెను. అతనిని యముఁడు తన పాశములబంధించి యమపురికిఁ గొనిపోయెను ఇప్పుడు పిల్లవాఁడులేఁడు. కేవలము అతని నిష్ప్రాణ మృతకళేబరము మాత్రము ఊయలలోఁబడియుండెను, దీనినిఁ గాంచి వెంటనే దాసి "హా! నా తండ్రీ!" అని పలికి ధమ్మని నేలపైఁ బడెను. దాసీయొక్క రోదనమును, పతన శబ్దమునువిని రాణి వెంటనే అధీరయై శంకితచిత్తముతో గొప్పగ నులికిపడెను. యంత్రమువలె సంకల్పములేకయే ఆమె మంచము మీఁదనుండి లేచి ఒక్కదుముకు దుమికి పరువిడుచుఁబోయి ఊయలకడకుఁజేరెను. అచ్చటి దృశ్యమును జూడఁగానే ఆమె హృదయము ముక్కలు ముక్కలయ్యెను. ఆమె హృదయము బ్రద్దలుకాఁజొచ్చెను. ఆమె తన్నుదాను సంబాళించుకొనఁ జాలకపోయెను. శోకకారణమున నామె సంజ్ఞాశూన్యమయ్యెను. ఆమెకు శరీరస్పృహలేదు. మూర్ఛితయై ఆమె ధడామ్మని నేలపైఁబడెను.

ఆ సమయమున నామె మేలిముసుఁగు జారిపోయెను. తలవెంట్రుకలు విఱియఁబడెను. తలలోఁ దుఱిమిన మాలతీ పుష్పములు వాడి అటునిటు చెదరిపడెను. అవి తాముగూడ దుఃఖమున నేడ్చుచున్నట్లుండెను. ఆమె అంగ ప్రత్యంగములు నస్తవ్యస్తములయ్యెను ఆమె కురరీ పక్షివలె గోలపెట్టుచుండెను. వత్సహీనయగు గోవువలె నఱచుచుండెను ఆమె కన్నులనుండి నిరంతర మశ్రుధారలు రెండు ప్రవహించుచుండెను. ఆమె బొమ్మను బాదుకొనుచు హా! నాతండ్రీ! నా జీవనాధారమా! అని పలుకుచు ముక్తకంఠముతో రోదనయి చేయుచుండెను.

ఆమెయొక్క దుఃఖ, కరుణాభరితమగు ప్రతిధ్వని అంతఃపుర మంతటను నిండెను. దాస, దాసీ. రాణి, ప్రతిహారాదులలో వినినవారం దఱును బుత్రుఁడు మరణించుటనుగాంచి రాణివలెనే బొమ్మలు బాదుకొనుచు నేడ్చుచు దుఃఖించుచుండిరి. మొత్తుకొని యేడ్చుచుండిరి. ఈ నీచకృత్యము నొనరించిన రాణులను దెలియనివానివలె వచ్చి యిట్లడుగ సాగిరి:- "ఏమైనది! ఏమైనది! అయ్యో! ఇప్పుడిప్పుడే ఆడుకొను చున్నాఁడు. అయ్యో! మేమందఱుమును గోల్పోయితిమి. అనాథల మైతిమి. మా సర్వస్వము వెడలిపోయినాఁడు" ఇట్లు పలుకుచుఁ గృతద్యుతి మహారాజుకంటెను మొత్తుకొనుచుండిరి. మహారాజా! ఈ స్త్రీల లీలలు భగవతుఁడును నెఱుఁగజాలఁడు, ఇఁక మనుష్యుఁడేమి యెఱుఁగ గలడు?"

ఆ సమయమునఁ జిత్రకేతు మహారాజు సభయందుఁ గూర్చుండి యుండెను. పరరాష్ట్ర విషయమున సంధి విగ్రహ విషయమునుగూర్చి చర్చ జరుగుచుండెను. వెంటనే అంతఃపురమందు కరుణాక్రందనమును, రోదనమును, భీషణధ్వనియును విని విభ్రాంతపడెను. ఇంతలోనే ఒకదాసి పరుగెత్తుకొనివచ్చి అస్తవ్యస్తభావముతో నేడ్చుచు నిట్లనెను:- "మహారాజా! కుమారుడు మనలందఱను వీడిపోయినాడు" ఇట్లు పలికి ఆ దాసి మూర్ఛితమై అచ్చటనే క్రింద బడెను.

ఆఁ! రాజకుమారుఁడు పోయినాఁడా! నేనిప్పుడే వానిని జూచి వచ్చిననే. రాజు శరీరమంతయును జల్లుఁబడిపోయెను. కోపివను రక్తపు

బొట్టులేదు. రక్తమంతయును నీరునీరయ్యెను ఆతఁడు వెంటనే అంతః పురమునకుఁ బరువిడెను గాని పోలేక దారిలోనే యెదురు తగిలి పడి పోయెను. మంత్రులుపోయి రాజునుబట్టుకొనిరి. ఆతఁడు సంజ్ఞాహీనుఁడై యుండెను. స్నేహాను బంధకారణమున నత్యంత వృద్ధుఁడగుటవలన శోక కారణమున సంజ్ఞాశూన్యుడయ్యెను. పోదలఁచుచుండెను కాని కాళ్లు స్వాధీనమునలేవు ఏదో పలుకఁదలచుచుండెను కాని వాక్కు రుద్ధ మయ్యెను. ఆతఁడు తడతడఁ గొట్టుకొనుచు, విలవిల నేడ్చుచు నంతః పురమునకు వెళ్లుటకుత్సహించుచుండెను; కాని వెడలఁజాలకుండెను. వాక్కు రుద్ధమగుటచే నెవ్వరితోడను బలుగజాలకుండెను నన్నెవరైన నాచచ్చిన బాలుని కడకుఁ జేర్చుఁడు. మంత్రులును రాజుయొక్క వివశ తను గాంచిరి. చాలమంది కలిపి పట్టుకొనిరి. రాజు మంత్రులు బ్రాహ్మణులచే బరివేష్టితుఁడై తపతప గొట్టుకొనుచు, గ్రిందఁబడుచు. అందఱి భుజముల మీఁదఁ జేతులు వైచుకొని వారి సహాయమును గొనుచు, నేడ్చుచు, నడచుచు నధీరతను బ్రకటించుచు నంతఃపురము నకుఁ జేరుకొనెను. అచ్చట చచ్చి పడియుండిన బాలునిఁ జూచెను. ఆతని తల్లి సమీపముననే వెంట్రుకలు విఱియంబోసికొని కురరీపక్షివలె నేడ్చుచుండెను. ఇప్పుడు రాజున కిదివఱకున్న ధైర్యముసుబోయెను. ఆతఁడు పిల్లవాని పాదములకడ వృక్షమువలెఁ గ్రిందఁబడెను. మంత్రు లాతని నోదార్చిరి బ్రాహ్మణులాతనిఁ జుట్టుకొని కూర్చుండిరి. రాణి యెదుటనే మూర్ఛితయై మొత్తుకొనుచుండెను. లక్షలకొలఁది రాణు లచ్చటఁ గన్నుల నీరు బెట్టుకొనుచుఁ గపట సహవేదనాదుఃఖమును

నటించుచుండిరి. ఆ రాణులందఱును గృతద్యుతివలె దుఃఖితులుగానున్నను ఆమెవలెనే రోదనము చేయుచున్నను వారి రోదనమునందును, పెద్ద రాణి యొక్క రోదనమందును నాకాశ పాతాళములకున్నంత భేదముకలదు ఆది కపట రోదనము. ఈమెది మర్మవ్యర్శియగు హార్దిక దుఃఖజనిత దుఃఖము.

మహారాజు కన్నులముందంధకారము క్రమ్మెను. అతని కిరీటము క్రింద బడెను. వెంట్రుకలు విఱియఁబడెను. వస్త్ర భూషణములు చిక్కిరిబిక్కిరిగ నయ్యెను. ఆత్యంత శోకకారణమున గొంతు బొంగురు పోయెను, స్త్రీల కరుణాక్రందనముచే వచ్చట భవన మేడ్చుచున్నట్లు తోచుచుండెను. రాజేద్వఁజూచుచుండెను కాని యేద్వఁజాలకుండెను కన్నుల నీరు పెట్టుకొందమనుచుండెను కాని ఆత్యధిక శోకముచే నశ్రువులుమనింకి రాకుండెను. ఆతఁడు మాడిన వృక్షమువలె వాడి యుండెను.

నిరంతరము సుఖములలో మునిఁగియుండు తన పతి యిట్లు శోకించుటను గాంచి మహారాణి దుఃఖమునకు మేర లేకుండెను. ఒక ప్రక్క జచ్చిన పుత్రుడును మఱియొక ప్రక్క సర్వసమర్థుఁడగు రాజరాజేశ్వరుఁడాపన్నమైనలేక పిచ్చివానివలె నేలపై దొరలుచుండెను శోకకారణమున నాతని అంగప్రత్యంగములు వ్యాకులములయ్యెను. దీని వలన రాణికి మిక్కిలి కష్టము కలుగుచుండెను. ఆమె పతి స్థితినిఁగాంచి శోకసాగరమున నిమగ్నయయ్యెను. ఆ సమయమున నామె కంటినీరు

పచ్చగఁ దోచుచుండెను. ఆమె కంటి కాటుకచే శుభ్రమైన పశుర్రిబిందువులు నల్లగనయ్యెను. అకజ్జలమిశ్రిత అశ్రుబిందువులు కుంకుమమిశ్రిత చందన చర్చితములగు గుచములపైఁ బడుచుండెను. నలుపు, పచ్చ, ఆకుపచ్చ, వర్ణములగు నశ్రుబిందువులచే రాణి వస్త్రము తడిసిపోయెను. ఆమె పిచ్చి దానివలెఁ దలనాడించుచుండెను. నేఁడామె పిగ్గుబిడియములను వీడెను. మంత్రి పురోహితులముందు పెంట్రుకలు విరియఁబోసికొని పెద్దగ నేడ్చుచుండెను.

శ్రీశుకుఁడిట్లనెను;- "రాజా! రాణి రోదనము చాలగ హృదయమును కరిగించునదిగ నుండెను. దానిని వర్ణించుటకిప్పుడు నాకు శక్తిలేదు. కొంచెము విశ్రాంతినిఁ దీసికొని ఆరోమాంచ కారియగు కరుణాక్రందనమును వర్ణించెదను."



# కృతద్యుతి సుతుని కొఱకై కరుణాక్రందనము

(౪-౨౪)

శ్లో॥ నాహం తనూజ దదృశే హతమంగలా తే
ముగ్ధస్మితం ముదిత వీక్షణమాననాబ్జమ్।
కింవాగతోస్య పునరస్వయ మన్యలోకమ్
నీతోఘృణేన నశృణోమి కలాగిరస్తే॥

శ్రీభాగ ౬ స్కం. ౧౪ అ. ౫౮ శ్లో.

ఉ: కుంకుమ రాగరమ్య కుచకుంభములం గడుఁగజ్జలంబుతో
బంకిలమైన బాష్పముల పాల్పడ మజ్జన మాచరించుచుం
గంకణపాణిపల్లవయుగంబున వక్షము మోదికొంచు నా
పంకరుహాక్షి యేడ్చెఁబరిభావిత పంచమమువ్వరంబునన్॥

శ్రీమదాంధ్రభాగవతము

హేభగవాన్! నీవు గృహస్థుల కేదుఃఖమునైనను గలుగఁ జేయుము కాని పుత్రదుఃఖమును మాత్ర మీయవలదు. ఏ పుత్రునిఁ బ్రాణములకంటెఁ బ్రేమగం బెంచుచున్నారో, తల్లి దండ్రు లెవని క్షేమమును గూర్చి క్షణ క్షణమును విచారించుచుందురో, ఎవఁడు ప్రేమకు సజీవ సాకారస్వరూపమగునో ఎవఁడు తనయాత్మయే నవీనశరీరమును ధరించి వడిలో నాడుకొనుచుండునో, ఎవనినిఁ జూచిన సుఖము కలుగునో, స్పర్శలో నానందోద్రేకము కలుగునో, ఎవనినిఁ జంకకు దీసికొనిన రోమాంచమగునో, ఎవని చంచలతా, చపలతా బాలసులభ సరళతా హృదయమందు నూతన స్ఫూర్తి సంచారము కలుగునో, ఎవని దేహమందీ దివ్యగంధము వెలువడునో, ఎవని శిరస్సును మూర్కొనుటచే సర్వోత్కృష్ట సుగంధము వెలువడునో, ఎవఁడేడ్చుచున్నను సుందరము గఁదోయునో, నవ్వుచుండిన హృదయము నవ్వునో అట్టి పుత్రుఁడు గృహస్థునిపుండే తల్లి దండ్రులు చూచుచుఁడఁగనే చచ్చి పరలోక వాసియగుచోఁ దల్లిదండ్రుల కెట్లుండునో అది తల్లిదండ్రులకుకాక యెట్లు తెలియగలదు?

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! తన ప్రాణములకంటెఁ బ్రియుఁడును, జీవనాధారమునగు నేకైక పుత్రుఁడు చావఁగా నా కృతద్యుతి మహారాణి విధాతను ధిక్కరించుచు మిక్కిలి కరుణాస్వరమున నేడ్చుచు నసంబద్ధప్రలాపము లొనర్చసాగెను. ఆమె యేడ్చుచుఁ జేతులతో బొమ్మలను బాదుకొనుచుఁనిట్లనెను:- "ఓయీ! నిర్దయవిధాతా! నీకిసుమంతైనను దయలేదా? నిన్ను సృష్టికర్తగాఁ జేసినవారెవరు? నిన్నెవరీ ప్రతిష్ఠిత పదమున గూర్చుండఁబెట్టిరి. వృద్ధులగు తల్లిదండ్రుల ముందు హంతకుఁడు బలిపశువును బట్టుకొనిపోయినట్లు మా పిల్లవానినిఁ గొనిపోవుటకు నీకు బుద్ధిలేదా! చంపువాఁడవు పుట్టింపనేల! ఈ పిల్లవానికింతటి సౌందర్యలావణ్యముల నేల ప్రసాదించింతివి. నీవు చంపఁదలఁచిన నన్నుఁజంపకపోయితివా! నన్ను నీ లోకమునకుఁ గొనిపోకపోయితినా! పెద్దవారు బ్రతికియుండఁగాఁ జిన్న వారినిఁ జంపుటలో నీ మూర్ఖతగాక ఇంకేమున్నది!

ప్రపంచములో వృద్ధులే ముందుపోవలయునని యేమున్నది ఎవరికి కాలము తీరినప్పుడువారు చచ్చిపోవుదురని ఇదంతయును ప్రారబ్దమని నీవనవచ్చును అట్లేయగుచో దానికొక క్రమము, నియమము లేనిచో నింక నీవెందులకు! పసికూనలు నవ్వుచు వాడుకొనుచుండఁగాఁ దల్లిదండ్రుల వడిలోనుండి లాగుకొని, వారిని వియోగదుఃఖములోఁ బడవైచుట శత్రువులు చేయవలసిన పని

జీవుని పుట్టుక చావులకొక క్రమనియమమే లేకున్నచో నీ ప్రేమపాశము నేల యేర్పఱచితివి? ప్రాణుల హృదయములందు నీ ప్రేమ

బీజమును, స్నేహాంకురము నేలఁ బుట్టించితివి? అయ్యో! దీనికంటె హృదయస్థానమున నీకొక బండను బెట్టి యుండిన బాగుండెడిది. ఎవ్వరు నెవ్వరినిఁ బ్రేమింపరు. ఇట్టి వియోగబాధను బొందరు.

ప్రాణులలోఁ బరస్పరము ప్రేమ లేకున్నచో భార్య భర్తను గాంక్షింపదు. పుత్రుఁడు తల్లిదండ్రులను బ్రేమింపఁడు, మాతృహృదయమున సంతానముమీదఁ మమత్వముండదనుచో నీ సృష్టి వృద్ధి యెట్లు కాఁగలదు? ఈ వర్గాభివృద్ధి యెట్లు ప్రాప్తించును? "నీవు సృష్టిని వృద్ధి చేయుటకే స్నేహమును గావించితివి, ప్రేమపాశము సృజించితివి, రచన మొనర్చితివనుటకు నిట్టి పసికూనను, ఏమియును దెలియని పిల్లవానిని, ఎవరివలన ముందు ముందు సృష్టి వృద్ధియగునో వానినేల సకాలమునఁ జంపివైచితివి?" తన చేతిమీఁదుగా నాటినది విషవృక్షమునై నను గొట్టరే? నిర్దయుఁడవగు నీవు స్నేహలతను నాటి దానిని మూలోచ్ఛేదనమును గావించితివి. దానిని జడమూలములచేఁ దెగఁగొట్టుచున్నావు. నీ యీ క్రూరతయెట్టిది? నీ నిష్ఠురత నీ నీచత యెట్టిది?

శ్రీశుకదేవుఁ డిట్లనెను:- "రాజా! ప్రేమోన్మత్తయై విరహవేదనచేఁ గాతరయైన రాణి తనలోఁ దానీవిధముగ నసంబద్ధ ప్రలాపములు పలుకుచు నామె లేచి వెంటనే మంచముమండి తన చచ్చిన బిడ్డను వడిలోనికిఁ గైకొనెను. వాని మెడ వ్రేలాడుచుండెను. నోటినుండి వెలువడిన నీలమగుచొంగ యెండినట్లయ్యెను గ్రుడ్లు మిటకరించుకొని యుండెను. పుష్పకోమలమైన పిల్లవాని యీ స్థితినిఁగాంచి వానిని

ఒడిలోనికిఁ దీసికొని రాణి మరలఁ గ్రిందఁబడెను. మాటిమాటికాతని ముఖమును ముద్దుపెట్టుకొనుచు నిట్లనెను:- "నాయనా! నాకన్నా! అనాధను దీనవగు నన్ను వదలి నీవెచ్చటికిఁ బోవుచున్నావు? వత్సా! నీవెచ్చటికిఁ బోయినను నభాగినియగు మీ అమ్మనుగూడ వెంటఁబెట్టు కొని పొమ్ము. ఇదివఱలో నేను గొంచెముసేపు మాటలాడకున్న నీవేడ్చెడివాఁడవు! ఇప్పుడు నేనెంతోసేపటినుండి నిన్నుఁ బిలుచు చుండినను నాతో మాటలాడవేల? నేనేమిచేసినానని నీవప్రసన్నుఁడవైతివి? నేనేమైన నపరాధ మొనర్చితినా? పోనిమ్ము, నాతో మాటలాడకుము. ఇదిగో మీ తండ్రి శోకసంతప్తుఁడై భూమి మీఁదఁబడియున్నాఁడు. వారి వైపునకైనను జూడుము, వారి యొడిలోనికిఁబోయి ఆడుకొనుము.

వత్సా! నీవు నన్ను మీ తండ్రిని మిక్కిలి ప్రేమించెడువాడఁవు. నేనెచ్చటికిఁ బోయినను నావెంటఁ బడెడువాఁడవు. నేఁడభాగినినగు నన్ను వదలి క్రూరపాశమును ధరించిన యమధర్మరాజుతో నేలపోవుచున్నావు? ఈలోకము నేడ్పించు మృత్యువుతోఁ బోకుము నాయనా! మేము నీమీఁద నెంతోయాశను బెట్టుకొంటిమి. నీవు మమ్మలను బున్నామనరకమునుండి యుద్ధరింతువని నమ్మియుంటిమి. అపుత్రులకు దుష్కరమగు ఘోర నరకమును నీసహాయమున సుగమముగాఁ దాటుదమనుకొంటిమి. నీవు దుఃఖించు మమ్మలను మధ్యలోనే వీడిపోయితివి. నేను మీ అమ్మను, ఇదుగో మీ నాయన. మేమెన్నడును గష్టమును సహించియుండలేదు. నీ కారణమున మేము నేఁడత్యంత కష్టమునఁ బడిటిమి, చూచుచుం డియు నీకు దయరాలేదు. నాయనా! నీవు చాలసేపు నిద్రించితివి.

ఇప్పుడిఁక లెమ్మ. మా శోకసంతప్త హృదయమును నీ చిలుక పలుకులచే శాంతింపఁజేయుము.

మంచిది మంచిది. నీవు మా యిద్దరియెడల నసంతుష్టుఁడవైనచో చూడుము. నీవు నిత్యమెవరితో వివిధములగు నాటలాడుకొనుచున్నావో అట్టి బాలకులు నేడు నీతోనాడ నుత్సహించుచున్నారు. వారితోఁగూడి ప్రేమపూర్వకముగఁ గ్రీడించుము. నీయాటవస్తువులతో వీరితో నాడుము లెమ్మనాయనా! నేఁడేల నిష్ఠురుఁడవైతివి. చాల సేపయినది. నిద్రించుటకును హద్దున్నది, నీకు చాల ఆకలి వేసియుండును. నీ భోజనసమయము దాటిపోయినది, ఇప్పటికి నీవు రెండుసార్లు తినెడువాఁడవు, రెండుసారులు నా స్తనములపాలు ద్రాగెడువాఁడవు. లేరా నా తండ్రీ! నా పాలు త్రావుము. పగము దహించుకొని పోవుచున్న నన్ను వదలి పోకుము. నీవు పోఁదలచినచో నన్నుఁగూడ నీవెంటఁ దీసికొనిపొమ్ము.

శ్రీశుకుఁడిట్లనెను:- "రాజా! శోకసంతప్తయగు నారాజమహిషి పిచ్చిదై పోయెను. అత్యంత శోకకారణమున నామె బుద్ధి నశించిపోయెను. ఆమెకు జడచైతన్య వివేకములేకుండెను. ఆమె మృతపుత్రుని మాటిమాటికిని జీవితునివలెఁ బిలుచుచుండెను మాటిమాటికిఁ బిలుచుచున్నను బిడ్డవానిదగ్గఱనుండి యే ప్రత్యుత్తరమును లభింపకపోగా నామె యింకను నధిక వ్యాకులతను జెంది, యేడ్చుచు నిరాశాస్వరమున నిట్లనెను:- "నాయనా! ఈ శరీరమును వదలిపోయి మరలరాని లోకమునకుఁ బోయి నట్లు తోచుచున్నది. అయ్యో! అందుకనియే నీ సుమధుర మనోహర

ముఖము మ్లానమైనది. అందుకనియే నీ ముద్దుముద్దు చిలుకపలుకులు వినఁబడుటలేదు. ఈ నిర్దయుఁడగు యమధర్మరాజు నిన్నుఁబట్టుకొని చాలదూరము తీసికొనిపోయినాఁడు. అచ్చటికి నా మాటలు వినఁబడవు. అందుకనియే నా మాటలకు నీవుకొంచెమైనఁ బ్రత్యుత్తరమీయవు."

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! రాణి మాటిమాటికి కరుణస్వరమున విలాపమొనర్చుచుండెను. ఆమె లేచి మరలఁ గ్రిందఁ దూలిపడుచుండెను. అసంబద్ధ ప్రలాపము లాడుచుండెను. ఆమె యీ విధముగా విలాప మొనర్చుటను గాంచి రాజును బిగ్గఱగఁ గేకవైచి ముక్తకంఠముతో రోదనము చేయుచుండెను. రాజేర్వుఁగా సమస్త మంత్రులును, పురోహితులును, పురవాసులును, నగరవాసులును, క్రూరహృదయులగు నితర రాజ్ఞులును నేడ్వసాగిరి. అందఱరోదనముచే నాయంతఃపురము నిండి పోయి వాయుమండలమంతయును క్షుబ్ధమైపోయెను. దశదిశలను శోకము వ్యాపించెను.



# శోకసంతప్తుఁడగు నృపునికడ అంగిరో నారదులు

(౹౮౹)

శ్లో॥ ఏవం కశ్మలమాపన్నం నష్ట సంజ్ఞ మనాయకమ్‌।
జ్ఞాత్వాంగిరానామ మునిరాజగామ సనారదః॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౫ అ. ౧౭ శ్లో.

వ. అని తల మొల యెఱుంగక పలవించుచు భృత్యామాత్య బంధుజనంబులంగూడి యడలుచు నున్న యారాజు దుఃఖంబెఱింగి యంగిరసుండు నారదునితోడం గూడి చన్నుదెంచి మృతుండైన పుత్రుని పదతలంబున మృతుండునుంబోలెఁ బడియున్న యారాజుంగనుగొని యిట్లనియె.

శ్రీమదాంధ్రభాగవతము.

ప్రపంచములోఁ బరహితనిరతులును బరోపకార పారీణులునగు సాధుపులుండవిచో నీజగత్తంతయును రౌరవ నరకము కాఁగలదు. ఈ జగత్తులో నాధి. వ్యాధి, చింతా, శోక, భయ, మత్సర, ఈర్ష్యా, ద్వేష, క్లేశాది విపత్తులుకాక యుఖేమున్నవి? జిహ్వోపస్థల క్షణికసుఖము కలదు. అది పరిణామమున దుఃఖదమేయగుచున్నది. అధిక జిహ్వా చాపల్యముచే నరుచి, మందాగ్ని, సంగ్రహణి మొదలగు రోగములు కలుగును. అధిక కామసేవనముచేఁ బ్రమేహ, దౌర్బల్య, నిర్వీర్యతా, క్షయాది నానారోగము లుత్పన్నములగును. జగత్తులో నెచ్చటఁ జూచినను దుఃఖమే. ఈ దుఃఖమునుండి బయటఁబడవేయువారు సాధువులే. శోక సాగరమున మునుఁగువారలకుఁ జేయినందించి రక్షించువారు పరోప కారులగు సాధువులే. సాధువులే అశాంతిని శాంతింపఁ జేయుదురు. ఏడ్చువారిని నవ్వింపఁగలరు. దుఃఖులను సుఖులుగ నొనరించెదరు. మృతులకు జీవన ప్రదానమొనరించెదరు, నష్టటియందు, సంసార సాగరమందు మునుఁగు వారలను దాటించెదరు. ఎవరిమీఁద సాధు కృపకలదో అతడు తరించినట్లే అని తెలిసికొనుము.

శ్రీశుకదేవుఁ డిట్లనెను:- "రాజా! సర్వత్ర విచరించు వాఁడును, సంకల్పముచేతనే యెచ్చటికైనను బోగలవాఁడును, అందఱి హృదయములను దెలిసినవాఁడునగు నంగిరసుఁడు జ్ఞానదృష్టిచేఁ జిత్రకేతు మహారాజు దుఃఖితుఁడగుటను గాంచఁగానే దయకలిగెను. ఆతనిదగ్గఱనే నారదుఁడు కూర్చుండియుండెను. తన సోదరుఁడగు నారదునితో నంగిరోముని యిట్లనెను:- "ఋషివరా! పద. మేము నీకొక మోహగ్రస్త జంతువును జూపించెదము"

నారదుఁడిట్లనెను:- "మహారాజా! సంసారులందఱును మోహగ్రస్తులే."

అంత నంగిరోముని యిట్లనెను:- "కాదు నారదా! వాస్తవమున మోక్షమున కధకారియై వాసనానివృత్తి కొఱకు నేనెఱిఁగి యెఱింగి మోహములోఁ బడవైచితిని. అట్టివాని కడకు నిన్ను గొనిపోయెదము. ములు తీయునప్పుడు నొప్పిగానుండి, తీసిన తరువాత నెట్లు హాయిగా నుండునో ఆదేవిధముగ నాతని మోహమును బోగొట్టుటకై నేనాతనికి సాంసారిక స్థితిని దిగ్దర్శనము కావించితిని."

నారదుఁడిట్టివానికొఱకై కనిపెట్టుకొనియుండును. ఆతఁడిట్లనెను:- "మంచిది, స్వామీ! పదండి మనకెప్పుడును దిరుగు తావమున్నదిలే."

నారదుని యంగీకారమును బొంది అంగిరోముని ఆతనిని వెంటఁ బెట్టుకొని చిత్రకేతు అంతఃపురమునకు వచ్చెను. భవనమంతయును నేడ్పులు పెడబొబ్బలతోఁ బ్రతిధ్వనించుచుండెను. రాజు తన మృత

పుత్రుని సమీపమున సంజ్ఞాహీనుఁడై పడియుండెను. శరీరమంతటను ధూళిచేనిండి క్రిందఁబడియుండెను. హా పుత్రా! హా వత్సా! అని పలుకుచు నాతఁడు ముక్తకంఠముతో వేడ్చుచుండెను. అతని సమీపము ననే చచ్చిన బాలుని ఒడిలోఁ బెట్టుకొని రాణి విలపించుచుండెను. ఆమె మాటిమాటికిని గట్టిగఁ గౌఁగిలించుకొని యేడ్చుచుండెను. రాణిని రాజును జుట్టుకొని వేలకొలఁది లక్షలకొలఁది స్త్రీ పురుషులు నిలుచుండిరి. మంత్రి పురోహితులు రాజును జుట్టుకొనియుండిరి. అందఱి కన్నుల నుండి అ విరళముగ నశ్రువులు ప్రవహించు చుండెను. అందఱును రాజు దుఃఖమున కనుతాపమును జెందుచుండిరి. ఎవనికి నేమియును బలుకుటకు సాహసము లేదు. ఇంతలోనే సర్వజ్ఞులును జ్ఞానులునగు నీమునులు విచ్చేసిరి. మంత్రి పురోహితులు సాష్టాంగ(?)వయవములతో వారికి యథోచిత సమయానుకూల స్వాగత సత్కారములను గావించిరి. మును లిద్దరును మంత్రి యొసంగిన ఆసనముపై రాజునకు సమీపముననే సుఖ ముగఁ గూర్చుండిరి. రాజు మాటిమాటికి- బిల్లవానినిఁ గాంచి, విలవిల లాడుచు నేడ్చుచు నిట్లనుచుండెను:- "అయ్యో! నా తండ్రీ! నా జీవ నాధారమా! నీవు మమ్ములను మధ్యలోనే వదలిపెట్టి యెచ్చటికిఁబోయితివి నీవు నన్నుఁ బ్రాణములకంటె యధికముగఁ బ్రేమించుచుంటివికదా!"

రాజీవిధముగ శోకగ్రస్తుడుఁను, మృతునివలె సంజ్ఞాహీనుఁడై యుండుటనుగాంచి- పిచ్చివానివలెఁ బ్రలాపించుటనుగాంచి అంగిరో మహాముని అతనితో నిట్లనెను:- "రాజా! నీవేజీవికొఱకింతగా శోకించు చున్నావో అతఁడీజన్మలోను, వెనుకటి జన్మలలోను నీకెవరు? రాఁబోవు

జన్మములలో నీకేమగును. నీవాతని కేమయ్యెదవు! అతఁడు నీకేమగును?"

రాజేమియును బ్రత్యుత్తర మీయకుండుటను గాంచి పురోహితుఁ డిట్లనెను:– "స్వామీ! పూర్వజన్మ సంస్కారముల వలననే యీ జన్మ మందు జీవులతో సంబంధము కలుగును. ఈ కుమారుఁడు పూర్వజన్మ మున మహారాజునకేదో ఘనిష్ఠ సంబంధము కలిగియుండవలెను. అందు వలననే యీ జన్మమున నాతఁడు పుత్త్రుఁడయ్యెను. ఆకాలమున నీతనికి మృత్యువు సంభవించినది. మహారాజునకీతఁడేకైక పుత్త్రుఁడు; కావున నింతటి యధిక దుఃఖము కలుగుట స్వాభావికమే.

అంత నంగిరోముని యిట్లనెను:– "విప్రవరా! రాజునకిది భ్రమ. ఈఁతడు నా పుత్త్రుఁడు. అప్పుడు పుట్టినాఁడు, ఇప్పుడు చచ్చి నాఁడనుటయును భ్రమయే. బ్రాహ్మణోత్తమా! ఈ జగత్ప్రవాహము నాదియైనది. ఇందులో నెవరివిఁ దల్లియును దండ్రియు నెవడును లేఁడుఁ గంగాప్రవాహమునఁ జాలగ వాలు కాకణములొక స్థానమునుండి వేఱొక స్థానమునకెట్లుపోవునో, మరల నొక ప్రవాహము వచ్చెనా కొన్ని కణములు ముందుకుఁ బోవును. ఒక్కొక్కప్పుడు హరిద్వారములోని వాలుకాకణములు ప్రయాగకుకొట్టుకొనిపోయి గంగాసాగరమును జేరును. ఈ నిత్య ప్రవాహ మవిచ్ఛిన్నముగఁ బ్రవహించుచునేయుండును. ఇది స్వాభావికము. దీనికొఱకై రాజు దుఃఖించుట వ్యర్థము. కాలక్రమమున జీవులప్పుడప్పుడు బ్రోగగుచుందురు. సమయము రాఁగానే వారు వియోగమును జెందుచుందురు. ఎవరికి వారే యగుచుందురు. ఇందులో

నొకరికొకరు, శత్రువులనుగారు, మిత్రులనుగారు. అంతయును మోహమే."

అంతఁ బురోహితుఁ డిట్లనెను:- "స్వామీ! సంస్కారములు లేక సంయోగవియోగములుండవు. సంస్కారవశముచే సంబంధముండిన వారిని గలిసికొనిన హర్షమును, వియోగము కలిగిన శోకమును గలుగును."

తన మాటను బలముగఁ జెప్పుచు వంగిరోముని ఇట్లనెను:- "శోకము కలిగిన నజ్ఞానముచేఁ గలుగును. వ్యర్థముగఁ గలుగును. అట్లుండరాదు. సంస్కారము ప్రవాహమందు కారణమగును. ప్రతి పూర్ణిమకును గంగా స్నానోత్సవము జరుగును. వేలకొలది, లక్షలకొలఁది స్త్రీలును బురుషులును దమతమ మూటలను జంకఁబెట్టుకొని, చేతఁ జెంబునుబట్టుకొని గంగకుఁబోవుచుందురు. దారిలోఁ దోడుదొఱకుదురు. కొందఱతో దట్టమైన స్నేహమేర్పడును, వారు కలిసి వెడలుచుందురు, ఆగినను గలిసియే ఆగుచుందురు. చిన్నపిల్లలా క్రొత్తవారిని "అమ్మా" అనుచుందురు వయసుకల పురుషులను "అన్నా" యనుచుందురు. ముసలి వారిని "తాతా" యనుచుందురు. యువకులు పిల్లలతో నిట్లందురు:- "నాయనా! మీ వదినె నడిగి ఫలాని వస్తువును దీసికొనిరా" వాఁడునుఁ బోయి యిట్లనును:- "వదినా! అన్నయ్య ఫలాని వస్తువును దెమ్మని వాఁడు" ఆమెయును ముసుగులో నుండి ముద్దుగ నిట్లనును: "అబ్బాయీ! తీసికొనిపొమ్ము. దీనిని మీ అన్నయ్య కీయవలయును. ఇదిగో! ఈ లడ్డును నీవు తినవలయును"

క్షణములో తల్లి, సోదరుడు, వదినె, తాత అందఱునైరి యాత్రా పరులలో నింకొకరు వీరియెడల నన్యాయ మొనరించినప్పుడును, సమూహములోని ఒకానొక స్త్రీ యెడల వ్యంగ్య వచనములను బలికినను వారికి దగ్గఱనే నిద్రించినను అందఱును గలిసి పోట్లాడుదురు. మా స్థానమున మీరేలఁ గూర్చున్నారు? మా మనుష్యులను మీరీమాటలేల పలికినారు? నిమిషములోఁ దమవారైనారు. పూర్ణిమకు గంగాస్నాన మొనర్చిరి ఉత్సవము చిందరవందరై పోయెను? ఎవరెవరికన్న? ఎవరెవరికి వదినె? మీరు మీ యింటికి మేము మా యింటికి. ఇఁక మరల వారు జ్ఞాపకము కూడ ఉండరు. చలివేంద్ర కెందతో వచ్చుచుందురు. నీరును త్రాగి ఎవరి త్రోవనువారు పోవుదురు. గంగను దాటుట కనేకులు చేరుచుందురు. దాటఁగానే వారివారి యిండ్లకు వారు పోవుచుందురు. ఇందులో శత్రుత్వమునులేదు. మిత్రత్వమునులేదు. మిథ్యాకల్పనయే. అజ్ఞానజనిత మోహము. మాయాచక్రము. జ్ఞానియగువాఁడు పొరపాటుననైన నీ మాయాజాలమునఁ బడరాదు. అట్టివాఁడు నిత్య, శుద్ధ,బుద్ధ, ముక్త, అవినాశియగు శ్రీహరిపైపున సదా సర్వదా ధ్యానముంచవలయును. వారు చావను జావరు, పుట్టను బుట్టరు. వారికి వృద్ధిక్షయములుగాని, ప్రకాశ వికాసములుగాని లేవు. వారు త్రికాలములందును సమభావమున నుందురు.

పురోహితుఁడిట్లనెను:- "అయితే స్వామీ! జన్య జనక సంబంధము వ్యర్థమైనది కదా!"

ఉపేక్షాస్వరమున ముని యిట్లనెను:- "విప్రవరా! జన్యుఁడెవఁడు? జనకుఁడెవఁడు? ఇవన్నియును మిథ్యాకల్పనలే. ఒక బీజమునుండి అనేక బీజములుత్పన్నములగును. ఆయనేక బీజములందును వేఱువేఱుగా ననేకములనుత్పన్నమొనర్చు శక్తి కలదు. చాల బీజములు మొలచును. కొన్ని మొలవవు. ఇది గుణప్రవాహము. ఇందులో జన్యజనకమేమియును లేదు. ఇదేవిధముగ భగవంతుఁడు మాయ వీరిద్దరి ప్రేరణముచేఁ ప్రాణుల నుండి యితర ప్రాణులుత్పన్నములగును. వానివలననే మరలనశించును. ఇదియంతయును లేనిపోని చిక్కుగామండును. కాని ఆత్మకు వీనితో సంబంధములేదు.

ఇట్లు పలికి ముని రాజును సంబోధించుచు నిట్లనెను:- "రాజా! నీవింత బుద్ధిమంతుఁడవయ్యు నెవరికొఱకింతగా శోకించుచున్నావు? ఓయీ, నేను, నీవు, ఈ చరాచర ప్రాణులన్నియును నిప్పుడున్నవి యిదివఱకు లేవు. ఇప్పుడులేవు, ముందుండవు. ఇదంతయును మిథ్యా కల్పనమే. గంధర్వనగరమువంటిది. ముత్యపు చిప్పలోని రజితము వంటిది (శుక్తిరజితము) రజ్జు సర్పభ్రాంతివలె మిథ్యాస్వరూపమైనది. శ్రీహరియే సత్యమైనవాడు. అతడే త్రికాలాబాధితుడు. నీవు సత్యము నాశ్రయింపుము. మిథ్యాకల్పనములోఁ బడవలదు.

అంతఁ బురోహితుఁడిట్లనెను:- "స్వామీ! ఇదంతయును లేనిదేయగుచోఁ ప్రాణులుపుట్టుటయును జచ్చుటయును, సృష్టియగుటయు, పాలింపబడుటయు ప్రళయమగుటయు నివియన్నియుననేమి?"

సప్తర్షి సంగిరసముని యిట్లనెను:- "బ్రాహ్మణోత్తమా!

ఇదంతయును నా సర్వఘాతపతియు, సజస్మకును, సచ్చిదానంద పరమేశ్వరుని క్రీడామాత్రమే. అతనికేమియును గోరికలేక సర్వదా నిరీహ, నిస్పృహుడై సప్పటికిని, బాలవల్లీలంచే యాట వస్తువుల రూపమగుఁ బరతంత్ర ప్రాణులచే సన్యప్రాణుల సృష్టికావించుచు వారిచేతనే పాలింపఁజేయును, కాలరూపమున సంహారము కావించును. వాస్తవమున వీనివలనఁ బ్రయోజన మేమియునులేదు. వినోదము తప్ప యిందులో సత్యమేమియును లేదు. పరస్పరము చదరంగములో నొకపావు నింకొకపావు వచ్చి చంపును. ఇంకొకటి తప్పించుకొని రక్షింపబడును. నిజమునకీ పావులకు శక్తియెక్కడిది? ఏదో బుద్ధిగల జీవి తన చేతులతో నెత్తిపెట్టిన సరిపోయినదికాని. ఈ విధముగ నొక దేహమునకుమ నింకొక దేహమునకును సంయోగమును గావింపజేసి రజోవీర్యములను గలిపి-మూఁడవ దేహము నుత్పన్నము కావించును. ఈ విధముగనే యీ చక్రము నడుచుచుండును. ఇందులో నుత్పన్నము కావించువాడే నిత్యము, సత్యము ఉత్పన్నమగునవి మిథ్యలు.

పురోహితుడిట్లనెను:- "స్వామీ! యీ విషయము బాగుగాఁ దెలియలేదు" అంగిరోముని ఇట్లనెను:- "కుండ, మూఁకుడు, ప్రమిద ఇవన్నియును మృత్తికతోడనే చేయబడినవి. ఎన్ని భిన్న, భిన్న ఆకృతులున్నను, భిన్న, భిన్న నామములున్నను నన్నియును మిథ్యలే. అన్నియును నశ్వరములే. మృత్తికయొక్కటియే సత్యము. అదియే త్రికాలములలోనుండును. కుండగుటకు ముందును మృత్తికయేకలదు. ఆ మట్టికుండ యాకారమును బొందినప్పుడా మృత్తికాత్వము పోలేదు.

అది యెప్పటియట్ల మృత్తికగనే యుండును. ఘటాకారము నశించును. అప్పుడును మృత్తికయే కలదు. ఘటమునకుఁబూర్వమును మృత్తిక కలదు, చివరను మట్టియే కలదు. అది ఘటోపాధిని ధరించి నామ రూపములేర్పడి ఘటమను ప్రసిద్ధినిఁ జెందినపుడును మృత్తికాత్వము పోలేదు. ఏలయనఁగానదినిత్యము. నామరూపములు మిథ్యలు. జాతియు, వ్యక్తియును వేఱువేఱుకాదు. కేవలము కల్పనచేతనే మనము వీనియందు పృథక్త్వమును స్థాపించితిమి. ఘటత్వాది జాతియును, ఘటాది వ్యక్తి విభాగమును వ్యవహారమందెట్లు కల్పితమో ఆదేవిధముగ నీ దేహము, దేహియను నీ విభాగ మవిద్యా కల్పితమైనది, కాని ఇది అనాదియైనది. వివేకము ద్వారముననే ఈ యవిద్యాజనిత కల్పన నాశమునకానగును."

శుకదేవుడిట్లనెను:- "రాజా! చిత్రకేతుమహారాజు అంగిరోమునియొక్క యీ గూఢ జ్ఞానమయ వచనములను వినఁగానే అతనికిఁ గొంచెముగజ్ఞానము కలిగెను. రాజు వివేకి. సత్సంగమొనర్చిన వాఁడు. అతఁడు మహాత్ముపురుషులను జిరకాలము శ్రద్ధతో సేవించి యుండెను. ఇప్పుడేదో ఒక నిమిత్త విశేషముచే నాతనికి మోహము కలిగెను. ముని ఖండింపఁబడని యుక్తులద్వారా యీ దృశ్యప్రపంచమున కజ్ఞాన జనితమోహమును గారణముఁగా జెప్పగా నప్పుడు రాజునకుఁ గొంచెముజ్ఞానము కలిగెను. ఆతనికి సంభవించిన నసహ్యమానసిక వేదనకొంచెము తగ్గినది. ఇంతవరకాతఁడు భూమిపై సంజ్ఞాహీనుడై పడియుండెను. ఇప్పుడాతడు లేచి కూర్చుండెను. ఆతని ముఖము మలినమయ్యెను. నేత్రములనుండి నిరంతరమశ్రు ప్రవాహము ప్రవహించుచుండెను. రాజు తన చేతులతోఁదన యెఱ్ఱని నేత్రములను

నలుపుకొని ప్రవహించు నశ్రువులను దుడుచుకొనెను. ఎదుటనున్న యిద్దరకుఁ బ్రణామము గావించి, వారిని సంబోధించుచు శోకకారణమును శుద్ధమైన వాక్కులచే వారి నేదో యడుగుటకు నుద్యుక్తుఁడయ్యెను.



## మహాముని అంగిరుఁడు రాజునకు జ్ఞానోపదేశ మొసంగుట

(౪౨౬)

శ్లో॥ సర్వేఽపి శూరసేనేమే శోక మోహభయార్తిదాః।
గంధర్వ నగర ప్రఖ్యాః స్వప్న మాయా మనోరథాః॥
దృశ్యమానా వినార్థేన న దృశ్యంతే మనోభవాః।
కర్మభిర్ధ్యాయతో నానా కర్మాణి మనసోఽభవన్ ॥

శ్రీ భాగ. ౬ స్కం. ౧౫ అ. ౨౩, ౨౪ శ్లో.

"వ......రాజ్యంబును భూమియును బలంబును ధనంబును భృత్యామాత్య సుహృజ్జనంబులును మొదలైనవి శోకమోహభయ పీడలం జేయుచుండుఁగాని సుఖంబుల నీ నేరవు. గంధర్వనగరంబునుంబోలె స్వప్నలబ్ధ మనోరథంబునుంబోని యర్థంబుఁబాసి కానంబడుచు మనోభవంబులైన యర్థంబులం గూడి స్వార్థంబులై కానంబడనేరవు. కర్మంబుల

చేత ధ్యానంబులు సేయుచుండు మనంబులు నా నా క ర్మ ం బు లగుచుండు"-

శ్రీమదాంధ్ర భాగవతము.

ఎవనికేది సహజ స్వభావముగ నుండునో అదియేదైన విశేష కారణముచే విపరీతమైనయెడల నవి యల్పకాలముననే పూర్వ ప్రకృతిలో వచ్చును. జలము యొక్క సహజస్వభావము శీతలము. అది అగ్ని వలనఁగాని వై శాఖ జ్యేష్ఠములోని తాపముచేతను నా జలముష్ణమైనచో నవి అల్పకాలముననే మరల శీతలమగును. ఎవఁడు సదా సాధుసేవలోను, సత్సంగములోను సంలగ్నుఁడై యుండునో అట్టివాడేదైన ఘోర విప త్కారణమున స్వభావ విరుద్ధమగు నా చరణమును గావించినచో జ్ఞానము కలిగిన మీఁదట నాతఁడుమరలఁ గుణమును పడును. సాధుసేవ, సాధు సంగము, సాధు శిక్షణమెన్నటికిని వ్యర్థముకాదు. భేదమేమనఁగా పాత్ర భేదముచే నది ఒక్కొక్కచోట వెంటనే ఫలించును. కొన్ని చోట్లనది కాలాంతరమునఁ బరిణామమును జూపించును. కొన్ని బీజములు భూమిలో బడఁగానే కొలది దినములలోనే మొక్కలై ఫలపుష్ప సమన్విత ములగును. కొన్ని బీజములు చాలాకాలము వఱకును నేలలోబడి అట్లే యుండును. అవి సమయము రాఁగానే మొలకలెత్తును. చిత్రకేతు మహారాజు పుత్రశోకముచేఁ దన సాధు స్వభావమును గూడ మఱచి పోవునట్లుగ సంతప్తుఁడయ్యెను. అంగిరస మహాముని జ్ఞానోప దేశ మొసర్పఁగా నప్పుడాతఁడు కొంచెముగఁ బ్రకృతిస్థుఁడయ్యెను.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! అంగిరసముని యొక్క తత్వజ్ఞాన పరిపూర్ణములగుఁ బునీత వచనములను" విని చిత్రకేతు మహారాజాతనితో నిట్లనెను:- "మహాభాగా! మీరిద్దరెవరు! ఎచ్చటినుండి వచ్చినారు? ఈ సమయమున నీదీనహీన మలినమతియగు నీ పామరుని యెడల నీ యహైతుకకృప యెట్టిది? మీ యీగూఢజ్ఞాన మయవాక్కులను వినుటచే మీరెవరో మహాజ్ఞానులును, పరమ భగవద్భక్తులును, రాగద్వేష మోహమమతా రహితులగుఁ బరమ తత్వజ్ఞానులనియు, మహా ఋషుల నియును దోచుచున్నది. వాస్తవమున మీరు సిద్ధులే!"

అంత నవ్వి అంగిరసమహాముని యిట్లనెను:- "నీవు మాలో ఋషి చిహ్నములను నేవినిఁ గాంచితివి!"

రాజిట్లనెను:- "ప్రభూ! చిహ్నము లేమియును లేకున్నను మీరు మాత్రము సాధారణ వ్యక్తులు కారు. మీరు మీ యథార్థ స్వరూపమును దాచితిరి. చాలమంది ఏకనిష్ఠులగు భగవద్భక్తులు, జ్ఞానులు, బ్రాహ్మణులు తమ స్వరూపమును దాచుకొని ఛద్మవేషమున నీ భూమిపైఁ బర్యటించు చుందురు. ఒక్కొక్కప్పుడు వారవధూత వేషమును ధరించు చుందురు ఒక్కొక్కప్పుడు వారు పిచ్చివారివలె నటనము బ్రదర్శించు చుందురు. ఇంకొకయెడ వారున్మత్తుల వలెను' పిశాచములవలెను నుందురు. దయావశమున నావంటి మూఢ మతులను దమయహైతుక కృపద్వారా సంసారమును దాటించుటయే వారు పనిగాఁ బెట్టుకొను

చుందురు. చాలామంది నిత్యసిద్ధుల పేర్లను నేను వినియుంటిని. వారు సృష్ట్యంతము వఱకును జీవితులై లోకములో స్వచ్ఛందతా పూర్వకముగ విహరించుచుందురు. వారిలో సనక, సనందన, సనత్కుమార, సనాతన, నారద, అంగిర, ఋభు, దేవల, అసిత వేదవ్యాస, మార్కండేయ, గౌతమ, వశిష్ఠ, పరశురామ, కపిల, శ్రీశుక దూర్వాస, యాజ్ఞవల్క్య, జాతుకర్ణ్య, ఆరుణి, లోమశ, చ్యవన, దత్తాత్రేయ, ఆసురీముని, పతంజలి, వేదశిర, బోధ్యముని పంచశిర, హిరణ్యనాభ, కౌసల్య, శ్రుతదేవ, ఋతధ్వజాలను వారి పేర్లను మాత్రము నేను వినియున్నాను. కర్మ బంధనములు లేక స్వేచ్ఛానుసారముగ శరీరమును ధరించి తిరుగు వారు వీరుగాక ఇంకననేకులు మహాపురుషులు కలరు. మీరు వీరిలో నెవరోయై యుందురని నాకుఁ దోచుచున్నది. గ్రామ్య విషయములందా సక్తినిఁ జెంది మూఢమతినగు నాకు తత్వజ్ఞానోపదేశమును గావింపఁ గృపావశమున దయ చేసితిరి. అజ్ఞానాంధకారమునఁ బడియున్న పశు తుల్యుండనగు నాకు జ్ఞానాలోకమును జూపింప వచ్చితిరి. సంసార సాగరమందు. మోహరూపమగు మకరినోటఁ బడబోవు నభాగ్యుఁడనగు నన్నుఁ జేయిపట్టుకొని బయటఁ బడవేయుటకుఁ బిలువకయే విచ్చేసితిరి. నాకు మీరు మీ పరిచయము నొసంగుఁడు. ఈ విపరీతసాగరమునుండి యుద్ధరింపుడు. నేను మీ యుద్ధరను శరణువేడితిని."

రాజుయొక్క యీ విపరీత వాక్యములను విని అంగిరోముని మహాముని ఇట్లనెను:- "రాజా! నీవు నన్ను మఱచితివాయేమి?"

రాజిట్లనెను:- "స్వామీ! ఈ సమయమున పుత్రశోక కారణమైన నా బుద్ధి భ్రష్టమైనది. కావున నో ప్రభూ! మీరన్యథా తలంపకుడు. నా ధృష్టతను క్షమింపుఁడు. నాకుఁ గొంచెముగ స్మరణమునకు వచ్చు చున్నది."

అంగిరోముని నవ్వి ఇట్లనెను:- "రాజా! నీవు పుత్రుండు కావలె యునని మిక్కిలి పట్టుఁ బట్టఁగా నీ బలవంతమునుగాంచి నీకు బుత్ర ప్రదానము గావింప వచ్చిన అంగిరో మహాముని నేనే. నేనే యీ పుత్రునిఁ బ్రసాదించితిని."

ఇదివిని రాజా సంభ్రమముతో నిట్లనెను:- "గురుదేవా! ఇప్పుడు తెలిసినది. మూఢుఁడనగు నేను సంసార మోహమందుఁబడి మఱచితిని. కాని మీరు నన్ను మఱవకుండుట మిక్కిలి కల్యాణ ప్రదమైన విషయము. సాంసారిక జీవులకు మఱపు అనునది స్వాభావికము, కాని మీరెట్లు మఱవగలరు. మాబోటి సంసార మాయా మోహ రూపమగు పంకమున మునింగిన వారికి మీబోటి సాధువులే గతి. ఈ రెండవ మహాపురుష డెవరు?"

అంగిరోముని ఇట్లనెను:- "ఈతనిని మఱచితివా? ఈతఁడు నా సోదరుడగు బ్రహ్మ పుత్రుఁడు దేవర్షి యునగు నారదుఁడు."

ఇదివినఁగానే రాజా లేచి మునులిద్దరి చరణములమీఁదఁబడి వెక్కి-వెక్కి యేడ్చుచు నిట్లనెను:- "అకారణ కృపామయులగు మునులారా! మూఢమతినగు నన్ను శోకసాగరము నుండి బయటఁ బడవేయుఁడు."

రాజు పలికిన యీ వినీత వచనములు విని అత్యంత స్నేహముతో నంగిరోమహాముని ఇట్లనెను:- "రాజా! ఈ యధీరత నీకనురూపముగ లేదు. ఎటువంటి విపత్తులు వచ్చిపడినను భగవద్భక్తుఁడెన్నటికిని విచలితుఁడు కాడు. అతఁడు దుఃఖమందధీరుఁడు కాడు. నీవు పుత్రశోక రూపమగు దుస్తర అజ్ఞానాంధకారమందు మునిఁగితివి. అందువలన దానినుండి ఉద్ధరించుటకై మేమిద్దరమిచ్చటకు వచ్చితిమి. నీవు మా వాక్యములను శ్రద్ధా పూర్వకముగ శ్రవణము కావింపుము. నీవు భగవద్భక్తుఁడవు. ప్రభు ప్రియుఁడవు. నీ వీవిధముగ నేడ్చుటయును, నిన్ను నీవు మఱచుటయును నుచితముకాదు. నీవు పరమార్థ తత్వమున కధికారివి. ఉత్తమ ముముక్షుడవు. నేను నీకు జ్ఞానప్రదానము కావింపవచ్చితిని."

ఇదివిని రాజిట్లనెను:- "ప్రభూ! ఆసమయముననే మీరు నాకు జ్ఞానోపదేశమేల చేయలేదు. అప్పుడే జ్ఞానము లభించినచో నీ దుఃఖ దినములుచూడఁబడెడివి కావుకదా! ఈ విపత్సాగరమున నీవిధముగ నేల నిమగ్నము కావలసివచ్చును?"

అంత నంగిరో మహాముని యిట్లనెను:- "రాజా! నేనప్పుడు జ్ఞానోపదేశమును జేయుటకే వచ్చితిని; కాని అప్పుడు నీచిత్తవృత్తి పుత్ర ప్రాప్తియందు లగ్నమైయున్నది. ఆ సమయమున నీకు బుత్రుని యందు ఉత్కటాభిలాష యుండుటచే నేను నీకుఁబుత్రునొసంగితిని. ఆ సమయమున నేను నీకు జ్ఞానోపదేశమును జేసియుండినచో వ్యర్థమయ్యెడిదే. అప్పుడు నీవు దానిని గ్రహించుటకసమర్థుఁడవైయున్నావు

అందువలననే నేను నీకు జ్ఞానోపదేశము నొసంగకయే వెడలి పోయితిని. ఇప్పుడు నీవు పుత్రజనిత దుఃఖము ననుభవించు చున్నావు. ఈ పుత్రాదుల వలన నీకు బరిణామమున దుఃఖము కలుగునని యిప్పుడు గ్రహించితివి. ఇప్పుడు నీవు జ్ఞానోపదేశమును బొందుట కధికారివైతివి. అందువలననే నేను నారదునిఁదీసికొని నీకడకు వచ్చితిని. పుత్రులవలన నెన్ని కష్టముల ననుభవింపవలయునో యిప్పుడు నీవు కాంచితివా? పర్వతము దూరమునకు బాగుగానే కనఁబడును. కాని దగ్గఱకుఁబోయి దాని నెక్కినచో నది కంటకాకీర్ణమై యెగుడు దిగుడుగను దుర్గమముగను నున్నదని యెట్లు తెలియునో అట్లే దూరమున నుండి పుత్రునిఁజూచుటకు సుఖకరముగనే యుండును. కాని అనుభవమునఁ బుత్ర జన్మవలన మృత్యు పర్యంతమును గష్టమే. పుట్టునపుడు తల్లికి మహాకష్టము. పోషించునపుడు ప్రతిక్షణమును గష్టమే. పెద్దవాఁడైన తరువాత విద్యాబుద్ధులు చెప్పించుటలోను, వివాహ మొనర్చుటలోను గష్టమే. అయోగ్యుఁడుగాఁ దయారయ్యెనా వాని దుర్మార్గమువలన సదా హృదయము మండిపోవు చుండును. సుయోగ్యుఁడగుచో నిరంతరము వానికి శరీరచింత కలుగును. సారాంశమేమనఁగా వీనివలన నిరంతరము కష్టమేకష్టము. అకాలమున మృత్యువు సంభవించినచో నేకష్టము కలుగునో దానిని ననుభవించు చునేయున్నావు. ఇట్లు పుత్రుని విషయమెట్లో శరీరము విషయములోను నీకు సంబంధించిన స్త్రీ, ధన, సంపద్వృద్ధి, రూప, రస, గంధ, స్పర్శలు కలిగిన భోగ్యపదార్థముల విషయమందును, రాజ్యవైభవ, పృథివీ, రాజ్య, సేనా, కోశ, దాసదాసీ, మంత్రి, అమాత్య, బాంధవ,

సుహృద్గణ, స్నేహ సంబంధములందును చెలిసికొనవలయును. ఇవన్ని యును జలాయమానములు అశాశ్వతములు, నశ్వరములు."

రాజిట్లనెను:- "స్వామీ! మాకు సంబంధించిన నృత్య, గీతము లొనర్చు గాయకులు, సుందర రూపవంతములగు పదార్థములు, లడ్డు, జిలేబి, మీగడ, పూరీ, హల్వా, గారె, అరిసె మొదలగు రుచిగల ఖాద్యపదార్థములు. దుగ్ధ, దధి, ఘృత, రసాది పేయ పదార్థములు, పచ్చళ్ళు మొదలగు లేహ్య పదార్థములు, మామిడి మొదలగు చోష్య పదార్థములు, వివిధములగు పుష్ప, సుగంధ తైలాదులు, పరుపు దిండు, పడక, సుఖకరములగు వస్త్రాదులు ఇవన్నియును ప్రత్యక్షముగఁ గనఁ బడుచు వీనిలో సుఖానుభూతి కలుగుచున్న దేల?"

ఇదివిని అంగిరో మహాముని యిట్లనెను:- "రాజా! ఇది భ్రమ. నీ వేపదార్థములను ప్రత్యక్షముగఁ జెప్పుచున్నావో అవి వాస్తవమున నేమియునుగావు. వీని కస్తిత్వమేలేదు."

రాజిట్లనెను:- "స్వామీ! అదెట్లుకాఁగలదు. వేనిని మనము ప్రత్యక్షముగఁ జూచుచున్నామో, నిత్యవ్యవహారమొనర్చుచున్నామో వీని వ్యవహారముచే సుఖ దుఃఖానుభవమును గలుగును. అట్టియెడల మీరు వీని అస్తిత్వమువేల యెగురఁగొట్టుచున్నారు. అన్నిటికంటెఁ బ్రత్యక్ష ప్రమాణము గొప్పది."

అంగిరోమహామునియిట్లనెను:- "మహారాజా! నీవు ప్రత్యక్షమని యెట్లనుచున్నావు. నీవు ప్రత్యక్షమని చెప్పునది చక్షురాదీంద్రియముల

వలన ననీ నా చక్షురాదులను నసత్తులే. ఇఁక గనఁబడు విషయమందు మా గంధర్వ నగరమును గనఁబడును. అది సత్యమా? ఇంద్ర ధనుస్సును పలు రంగులతోఁ గనఁబడుచుండును. ఇట్టి రంగులు కలిగిన దేదైనను ధనురాకారమున నాకాశమున వ్రేలాడుచున్నదా? ఆకాశ మును నీల నీలముగఁ బ్రత్యక్షముగఁ గనఁబడుచుండును. ఆకాశమున నేదైన నీలిరంగు నద్దిన చాందినీ కట్టఁబడినదా? ఇట్టి ప్రత్యక్షానుభవ మందుమా? స్వప్నములోని వస్తువులన్నియును బ్రత్యక్షములుగనే యున్నవి. స్వప్నములో సుఖదుఃఖములు నేనుఁగులుఁ బ్రత్యక్షములుగ గోచ రించుచుండును. అవి మనకు లభించినచో సుఖముగనే యుండును. మనలనెవరైనఁ దలఁదెగఁగొట్టి కష్టపెట్టిన దుఃఖము కలుగును. విషయ సుఖ సంబంధమగు వస్తువు లభించినచో దాని ననుభోగించునప్పుడు ప్రత్యక్షముగ సుఖానుభవము కలుగుచున్నది. మనమ్నతో మన మనేక కోరికలను గోరుకొనుచుందుము. తన్మయులమై గొప్ప సుఖదకల్పనలు చేయుచుందుము. అప్పుడు మనకు సుఖము కలుగుచుండును. గంధర్వ నగరములోని వస్తువులును, స్వప్న మనోరథములును లేకున్నను వాని వలన స్వప్నాదులలో నస్తిత్వ, అనిత్య వస్తువులచే సుఖదుఃఖానుభవము కలుగుచునేయున్నది. ఇవన్నియును మనఃకల్పితములగు. మిథ్యాపదార్థ ములు. ఇవి నశ్వరములును బరివర్తనశీలములునై యున్నవి. ఏలయనగా నివి వాస్తవికములు కాకున్నను గనఁబడుచున్నవి. అందుకనియే నేడు కొన్ని కనఁబడుచుండిన రేపు కొన్ని కనబడుచున్నవి.

అంత రాజిట్లడిగెను:- "స్వామీ! ఈ సుఖదుఃఖము లందఱకును

గలుగును. అందఱి సంచిత కర్మలును వృద్ధి పొందును."

అంత సంగిరోమహాముని(ఇట్లనెను:- "రాజా! అట్లుకాదు, జ్ఞానికి ద్వైతభావమునశించును. అత(డేది చేసినను వాసనా రహితు(డై చేయును. ఇంద్రియము లింద్రియార్థములందు) బ్రవృత్తిని( జెందుచున్నవి. నాకేమి సంబంధము) యాత(డనుకొనును. అందువలన నాత(డేకర్మ యందును లిప్తుడుకాడు. అతడు చేసిన సంచితకర్మలన్నియును నశించును. కాని వాసనా ప్రేరితములై విషయచింతన మొనర్చుచుండువాని మనస్సులో నానా విధకర్మలుత్పన్నములగును. కావున నీ నశత్పదార్థములమండి సద్బుద్ధిని( ద్యాగమూ కావింపవలయును. ఈ యనిత్య పదార్థములను బొరపాటునవైన నిత్యములుగ నెంచరాదు. పరిణామమున దుఃఖమును గలిగించువానిపై నెన్నటికిని సుఖబుద్ధిని( జేయరాదు."

అంతనాశ్చర్యమున(బడి చిత్రకేతు మహారాజిట్లనెను:- ప్రభూ! జీవాత్మ సుఖదుఃఖరహితు(డైనచో నీత(డేకారణమున సుఖదుఃఖము లందు బడుచున్నా(డు?"

అంతసంగిరోముని యిట్లనెను:- "రాజా! మనస్సుతో( గూడి పదునొకండింద్రియములు గలిగిన పంచభూతాత్మకమగు నీ సూక్ష్మ దేహము జీవాత్మను వివిధ విధములగు క్లేశములను, సంతాపములను గలుగ(జేయుచున్నది. కావున నీవు స్వస్థు(డవై శాంతచిత్తములో విచారించుము. ఈ సాంసారిక పదార్థము లందలి ఆసక్తిని దీసివేయుము. స్వప్నములోని పదార్థము లన్నియును నెట్లు మిథ్యలో, ఈకన(బడు పదార్థ

ములన్నియును మిథ్యలే. రాత్రి వచ్చిన స్వప్నము ప్రాతఃకాలమున మిథ్యయగును; కాని యీ జాగృత స్వప్నము జ్ఞానములేకున్న సదా సత్యముగనే కనఁబడు చుండును. జనులీ స్వప్నమునఁబడి యెనుబదినాలుగు లక్షల యోనులతోఁ దిరుగుచుందురు. కావున నిప్పుడు నీవు లిక్షిప్తమైన నీ వృత్తులను నిరోధించుము. ఈ శరీరమును నేను, ఈ శరీరమునకు సంబంధించిన స్త్రీ, పుత్ర, పరివార రాజ్య, ధన గృహాదులన్నియు నావను బుద్ధివిఁద్యజింపుము. ఆత్మయొక్క యథార్థ స్వరూపమును జ్ఞానవైరాగ్యపూర్వకముగ విచారించి,యీ ద్వైతభ్రమయందుగల నిత్యత్వ బుద్ధిని వీడుము. ఈ విధముగ నీ వాత్మచింతన మొనర్చుచో సమస్త శోక మోహములను మఱచి పరమశాంతి లాభమును బొందఁగలవు."

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఈ విధముగ నంగిరో మహాముని చిత్రకేతు మహారాజునకు నాత్మయొక్కయు, అనాత్మ పదార్థముల యొక్కయు భేదమును జెప్పి యూరకుండెను. అతని సంకేతమున నిప్పుడు నారదుఁడు రాజుతో నేదియో చెప్పఁ బ్రారంభించెను:-



## నారదుఁడు నరపతి కుపదేశించుట.

(౨౨)

శ్లో॥ ఏతాం మంత్రోప నిషదం ప్రతీచ్ఛ ప్రయతో మమ।
యాం ధారయన్సప్త రాత్రాద్ద్రష్టా సంకర్షణం ప్రభుమ్॥
శ్రీభాగ. షష్ఠ. ౧౫ అ. ౨౭ శ్లో.

"వ.........ఉపనిషద్గోప్యంబగు నేనిచ్చు మంత్రంబెవ్వండేని సప్త
రాత్రంబులు పఠియించు నతండు సంకర్షణుండైన భగవంతునింజూచు"

శ్రీమదాంధ్ర భాగవతము.

జీవుఁడు కర్మాధీనుఁడై సంసారమున భ్రమించుచుండును. ఆ భ్రమణములో సంయోగ వశమునఁ జాల మందితో సంబంధము కలుగును. కాలాంతరమున వారిని మఱతురు. అతఁడు కర్మ ఫలములను భోగింప వలయును. వానవల ననుసరించుచు బోవలయును. ఒకానొక శ్రేష్ఠి కలఁడు. అతఁడు ధన సంపాదనమునకు నానా దేశములకుఁ బోవును. నానా విధములగు మనుష్యులతో సంపర్కమును గలిగియుండు. కొందరి కమ్మును, కొందరికడఁ గొనును. ఎవరితోనైనను గలిసి మార్గమునఁ బోవును. ఒక్కొక్కరి యింట నిలుచును. కొందఱచేఁ బనిఁ జేయించును. అట్లు చేయించునప్పుడెంతో స్నేహమును బ్రదర్శించును. ఎంతో కలిసి మెలసి మధుర వాక్యములను బలుకును; కాని అతని కెవనితోడను స్నేహములేదు. అతని మైత్రి స్వార్థమైనది. అట్లే యీ జీవరూపుడగు వ్యాపారి కెవరితోడను స్నేహములేదు. శరీరము పోఁగానే సంబంధ మంతయును బోవును. అయ్యో, రెండవ జన్మములోని విషయములను బోనిండు. చాల సంవత్సరములు కలిసి మెలసి చదువుము. నొక్కచోటఁ దినుచు నాడుచుండి, మిక్కిలి ఘనిష్ఠ సంబంధము కలిగియుండి పది పదునైదు సంవత్సరములైన తరువాత గడ్డమును మీసములను బెంచుకొని వచ్చినచో గుర్తింపనే గుర్తింపఁజాలఁడు. అట్టియెడల మరునాటి జన్మమున శరీరమే బొత్తిగా మారినప్పుడు గుర్తించుటెట్లు? శరీరమును వదలఁగానే సంబంధ

మంతయును వదలిపోవును. తండ్రి పుత్రుఁడు కావచ్చును; భార్య తల్లి కావచ్చును. సోదరి భార్య కావచ్చును. మానవుఁడు పశువు గావచ్చును. ఒక్కొక్కప్పుడు దేవతయగును. దీనినిఁబట్టి సాంసారిక సంబంధమునిలుక డైనది కాదని సిద్ధాంతమగుచున్నది. ఆత్మతో వీరికెవరికిని సంబంధము లేదు. శరీరముతోడనే వీరికి సంబంధము. శరీరము పోఁగానే గోవిందాయ నమోనమః అయిపోయినట్లే.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:-"రాజా! అంగిరోముని ఉపదేశమొసంగి మెదలక యూరకుండఁగానే రాజాతని ముఖము వైపునఁ జూచుచుండెను అప్పుడిట్లనెను:- "అయితే స్వామీ! నేనేమి చేయవలెను?"

అంత నంగిరోముని యిట్లనెను;— "రాజా! గురువులేక ఉద్ధారము లేదు. నీ యదృష్టమున నాచార్యుండును బ్రహ్మపుత్రుఁడునగు నారదుఁడిచ్చటనే యున్నాడు. నీవాతని నాశ్రయింపుము. ఈతనిచే మంత్రదీక్షను గొనుము. మంత్రదీక్షనొసంగిన తర్వాత నీకు శుభశిక్షణ నొసంగఁగలఁడు. ఈతని యుపదేశమును శిరసావహించి నీవు తదనుసారముగ నాచరింపుము. దానివలన నీకు శాంతి కలుగును. నీవు ముక్తుఁడ వయ్యెదవు."

అంగిరోముని యాజ్ఞచేఁ చిత్రకేతు మహారాజు నారదు నాశ్రయించి మంత్రదీక్ష నొసంగఁ బ్రార్థించెను. ఎవరడిగిన వారికిఁ జెవులో మంత్రమును జెప్పివేయుటకు నారదుఁడు సాధారణ గురువుకాఁడు. శిష్యునిచెవిలో నిట్లు చెప్పెను:— "రహస్యమును వినుము, నీవు శిష్యుడవు

వేమ గురువుమ" నారదుడు శిష్యపరీక్షనొనర్చి, అతని యధికారము సమపరించి యుపదేశించు గురువుకాని వేఱుకాడు. అతండిట్లనుకొనెను:- "ఈతనికి యథార్థ వైరాగ్యము కలుగలేదు. అత్యంత శోకకారణమునఁ గలిగిన వైరాగ్యమిది. అదియును దమోగుణ కారణముననే. కావున నీతనికి మహాతమోగుణముగల దేవతను గూర్చిన యుపాసనను జెప్ప వలయును. ముక్తి పరాకాష్ఠతను జెందిన సత్వగుణము వలనఁగాని పరాకాష్ఠతన జెందిన ఘోరతమమందుఁగాని కలుగును. పరాకాష్ఠతను జెందిన సత్వగుణమువ సత్యమూర్తియగు శ్రీ లక్ష్మీనారాయణు నుపాసించి అసంఖ్యాకులు శాంతస్వభావముగల భగవద్భక్తులీ సంసార కర్మబంధమునుండి ముక్తులైరి. పరకాష్ఠను జెందిన ఘోర తపస్సు వందు మధు, కైటభ, రావణ, హిరణ్య కశిపు, హిరణ్యాక్షాది గొప్ప గొప్ప బలవంతులగు నసురులును, రాక్షసులును ముక్తులైరి. అందువలన నీతనికి ఘోరతమోమయుడగు సంకర్షణుని ఉపాసనము జెప్పవలయును. అతఁడీతనికి భక్తిముక్తుల నొసంగఁగలఁడు" ఇవన్నియును నాలోచించి నారదమహర్షి రాజుతో నిట్లనెను:- "రాజా! నీకు నేను సంకర్షణ భగ వానునికి సంబంధించిన మంత్రోపనిషత్తు నుపదేశించెదను. దీనిని ధారణచేసి విచ్ఛిందింపక యేడు దివములవఱకు నీవు నిరంతరము జపమొన రించినచో నీకతిశీఘ్రముగ నొకవారములోనే సంకర్షణుని దర్శనము కలుగఁగలదు.

రాజిట్లడిగెను:- "స్వామీ! ఈ మంత్రోపనిషత్తునకు ఫలమేమి?"

నారదుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "మహారాజా! దీనిఫలము మోఘము. నాచేఁ బ్రసాదింపఁబడిన నిది యెన్నటికిని వ్యర్థముకాదు. దీనిచే నీకు బరమానంద ప్రాప్తికలుగును."

రాజిట్లడిగెను:- "స్వామీ! దీనివలన నెవరికైనఁ బరమానంద ప్రాప్తి కలిగినదా?" అంత దృఢవ్రతమున దేవర్షి నారదుఁడిట్లనెను:- "రాజేంద్రా! పూర్వకాలమున నా సంకర్షణునాశ్రయించి తమోగుణ మూర్తియగు శంకరాదులును, గొప్పగొప్ప యితర యోగులును, సిద్ధులును భేదభ్రమను త్యజించి శీఘ్రముగనే అతని సామ్యాతిశయహీన మహా మహిమమును బ్రాప్తించిరి. అందువలననే నేను నీకీ మంత్రోపనిషదము నుపదేశించుచున్నాను. నీవును దీని ప్రభావముచే సమస్తశోక, మోహ జనిత కర్మబంధనములను త్యజించి ప్రేమపూర్వకముగఁ బరమపదమును బొందఁగలవు. నీవీయజ్ఞాన జనితద్వైత భ్రమను సర్వాసుఖవ్వరూపుఁడగు శ్రీహరియందు బ్రతిష్ఠితుఁడవయ్యెదవు."

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఈ విధముగ ముందుగా మంత్ర మహిమమును, దాని ప్రభావమునుజెప్పి నారదుఁడు రాజునకు సంకర్షణ మంత్రోపనిషత్తు నుపదేశింప నాశ్వాసనమొసంగి, ప్రత్యక్షముగ జీవుని బిలిచి భ్రమనివారణోపదేశము నొసంగెను."

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! రాజునకు నారదుఁడే మంత్రోపనిషద దీక్షనొసంగెనో దానిని మాకుఁ జెప్పవలయును."

అంత సూతుఁడిట్లనెను:- "స్వామీ ! మంత్రవిషయము చాల రహస్యమయమైనది. అధికారి, అనధికారి వీరలందఱ ముందది చెప్పఁ బడదు. సంస్కారియగు నధికారియే దీనిని గ్రహింపగలడు. అనధికారి బుద్ధిలో నిదినిలువదు. రహస్య వస్తువును నీ విధముగఁ జెప్పకూడదు. చెప్పినచో దానిని మొదలకుండ విడిచి తీరును, కావున మీరు దానినిం తటితో వదలివేయుడు. నేనీకథా ప్రసంగమున దానిని చెప్పఁదలపలేదు. వేఱుగా మంత్రోపాసనా ప్రకరణ ప్రసంగము వచ్చినప్పుడు దానిని యథాస్థానమున నమయాను సారముగఁ జెప్పెదను. తరువాత మీ యాజ్ఞ."

అంత శౌనకుఁడిట్లనెను:- "లేదు సూతా! నీవనినట్లే జరుగఁ గలదు. దీక్షా విషయము రహస్య మయమైనది. నారదుఁడు రాజునకేమి యుపదేశించినాఁడో చెప్పుము."

అంతసూతుఁడిట్లనెను:- "స్వామీ! శోకాతురుఁడగు నర్జునునకు భగవానుఁ డభిమన్యునిచే నేశిక్షణ నొసంగెనో నారదుఁడదే విధముగ జీవుని ప్రత్యక్షము కావించి రాజునకు శిక్షణ నిప్పించెను."

అంతశౌనకుడిట్లడిగెను:- "సూతా!, భగవానుఁడర్జును నకెట్లు శిక్షణనిప్పించెను. ముందుగా నీ ప్రసంగమును మాకుఁజెప్పి, ఆమీఁదట నారదోక్తమగు నుపదేశమును వర్ణింపుము. మాకుఁ సరళముగను, సుగ మముగను దెలియునట్లు చెప్పవలయును."

ఇదివిని సూతుడు మిక్కలి ప్రసన్నుఁడై యిట్లనెను: "స్వామీ ! మీరందఱును గొప్ప కథాపేక్షకలవారును, రసికులునై యున్నారు. మీకు

కథావిధానమంతయును విదితమే. ఏ విషయము నేవిధముగఁ జెప్పిన సరళముగను, హృదయ గ్రాహకముగను నుండునో ఆ విషయములో మీకనుభవము బాగుగాఁగలదు. మంచిది ముందుగా నేను మీకా ప్రసంగ మును జెప్పెదను."

సూతుఁడిట్లనెను:— " మునులారా! అర్జునునకభిమన్యుఁడనిన నందఱ కంటెను ప్రేమ. అతఁడు కృష్ణుని చెల్లెలగు సుభద్రకు కుమారుఁడు. మంచి సుందరుఁడు, సుశీలుడు, మాతృ పితృ భక్తుఁడు. అతఁడర్జుననకుఁ బ్రతిరూపుఁడే. సౌందర్యమందును, గుణమందును, శీలసదాచారములందును, అస్త్రశస్త్ర విద్యయందును వాతఁడు కొన్ని యంశములలో నర్జుననకు మిగులును. అర్జుననకాతఁడు బాహ్య ప్రాణము. వానినిఁ జూచిన నాతనికి హృదయముప్పొంగును. ఆతనికి వివాహమైనను, యువకుఁడైనను నర్జునుడాతని నత్యంత ప్రేమతో బాలకునివలె ఒడిలో గూర్చుండఁ బెట్టుకొని ముద్దాడును. అతఁడును లజ్జా సంకోచములచే శిరస్సును వంచుకొని సంకోచించు శిశువువలె మెదలకుండ తండ్రివడిలోఁ గూర్చుండును. ఆ సమయమున నెవడైన వానిని జూచినచో నీతఁడు త్రైలోక్య విజయుఁడగు శూరవీరుఁడని తెలిసికొనఁజాలరు. అతఁడు ధర్మరాజు నెట్లాదరించునో అట్లే సోదరుల నందఱ నాదరించును. పంచపాండవులలో నాతని కెవరేమి మాటచెప్పినను నాతఁడు తిరుగు చెప్పకయే వెంటనే చేయును. అందఱకును నాతనిపై సమాన ప్రేమ; కాని అర్జుననకాతఁడాత్మయే.

మహాభారత యుద్ధమందు శత్రువులాతని నన్యాయముగ రణ నియమములకు విరుద్ధముగఁ జుట్టుముట్టి చంపిరి. దీనిచేఁ బంచపాండవులకే కాదు సమస్త సేనకును మహాదుఃఖము కలిగెను. అర్జునుని స్థితి మహాశోచనీయముగ నయ్యెను. ఆతఁడు తన ధనుస్సును క్రిందఁబడవైచెను. తూణీరములను శరీరమునుండి లాగివైచెను శ్రీకృష్ణునిముందు మోఁకాళ్ళపైనఁ గూర్చుండి, నేత్రముల నశ్రువులను రాల్చుచునిట్లనెను: "ప్రభూ! ఇఁకనైపోయినది. ఇఁక నేను యుద్ధము నొనర్పను. ఇప్పుడు యుద్ధ మొనర్చినను నెవరికొఱకు? పుత్రునిఁ జంపుకొని, వాని రక్తముచే రంజితమైన రాజ్యమును గొనుటకు నాకిచ్ఛలేదు."

అర్జునుని వచనములలో దృఢతకలదు. ఇది యుద్ధారంభమున శంకించిన శంకవంటిది కాదు. అప్పుడు భగవానుఁడు గీతోపదేశ మొనర్చి శాంతింపఁజేసినాఁడు. ఈ నిశ్చయము చలించనిది. భగవానుఁడనేకవిధముల నాతనినోదార్చెను. అనేక దృష్టాంతములొసంగెను. మృత్యువనివార్యమైనదనెను. కర్మయొక్క గహనగతిని బోధించెను. ప్రారబ్ధము తప్పదని చెప్పెను. అన్ని ప్రయత్నములొనర్చెను. తన శక్తి నంతను వెచ్చించి బోధింపనెంచెను, కాని అర్జునుఁడు తన నిశ్చయమును మార్చుకొనలేదు. ఆతఁడు యుద్ధముచేయ నంగీకరింపలేదు."

అప్పుడు సర్వాంతర్యామియగు భగవానుఁడిట్లనెను:- "మంచిది, నీవు కోరునదేమి? ఏ విధముగను యుద్ధమును జేయక పోయితివి."

అర్జునుడు దృఢ స్వరమున నిట్లనెను:- "మా అభిమన్యుఁడు

నాకు మరల లభించుచో యుద్ధము చేయఁగలను. యుద్ధమేమి ? నీ వేమి యాజ్ఞాపించిన దానినిఁ జేయుదును."

అప్పుడు భగవానుఁడిట్లనెను - "సరియే, పద. నిన్నభిమన్యువి యొద్దకుఁ దీసికొని పోయెదను. ఇప్పుడు వానినిఁ దెచ్చుటయును, దేకుండుటయును నీయధికారమున నున్నది."

అదరిపడి అర్జునుఁడిట్లనెను:- "స్వామీ ! ఒక్కసారి నన్ను వానితో సమావేశ మొనర్పుడు. ఆ తరువాత వానినిఁ దెచ్చుటయుఁ దేకుండుటయును నా యిష్టము మీఁదనుండును. ఇంక నీవేమియును జేయవలసిన పనిలేదు. నీవు వానితో నొక్కశబ్దమైనఁ బలుకరాదు. వానిని నాకుఁజూపించినఁ జాలును. సాక్షాత్తుగఁ గనబఱచుము."

భగవానుఁడిట్లనెను :- "మంచిది, పోదము పద." అని పలికి శ్రీ కృష్ణుడు తన దివ్యరథమును సిద్ధమొనర్పించెను. అర్జునునందుఁ గూర్చుండఁబెట్టెను. నేఁడారథము నేలపై నడుచుటలేదు. వాయు వేగమునకంటె పెక్కువేలరెట్లుగ నతివేగముననది యెగురుచుండెను. అల్ప క్షణములలోనే అది సప్తసముద్రములను సప్త ద్వీపములను దాటుచు లోకాలోక పర్వతమును దాటెను. అచ్చట నీపృథివియునులేదు. ప్రకాశ మునులేదు. ఒక దివ్య సువర్ణమయ ఘోరాంధకారముచే నాకృతమైన భూమి కలదు. భగవానుని సుదర్శనచక్రమాతమస్సు చెండివైచెను. అచ్చటనొక గొప్ప చక్రము మిక్కిలి వేగముతోఁ దిరుగుచుండుట నర్జునుఁడు కాంచెను. ఆ చక్రము దగ్గఱ మంచి మంచి సుందర బాల

కులు ఆటపాటలలోఁ బరువిడుచట్లు బరువిడుచుండిరి. భగవానుఁడిట్లనెను:- "అర్జునా! ఈ బాలకులలో నీవు మీ అభిమన్యుని గుర్తింపుము." అని పలికి భగవానుడా తిరుగుచుండిన చక్రసమీపమునఁ గూర్చుండెను.

ఆ చక్రమునకు నలువైపులను దిరుగుచుండిన బాలకులొకనికంటె మతియొకఁడు సుందరుడు. వారందఱును జిలిపిగనుండిరి. హంస ముఖుల వస్త్రాదిభూషణములచే సుసజ్జితులు. ఎవ్వరు నెవ్వరివైపునకును జూచుటలేదు. వారిగోలలో వారు పరువిడి పోవుచుండిరి. వారు పరుగెత్తుటచే నలయుటయునులేదు, తొప్పటయునులేదు. అర్జునుఁడు వారినందఱను మిక్కిలి శ్రద్ధతోఁజూచెను. కొంచెము సేపటికి అచ్చట వారిలో నభిమన్యుఁడును బాగుగా నలంకరించుకొని నవ్వుచు వచ్చుచుండుట నర్జునుఁడు గాంచెను. కాని ఆతఁడును నర్జునుని గాంచెనుగాని పలుకరింపకయే తుఱ్ఱునఁబోయెను. అర్జునుఁడు వెంటఁబడెను; కాని యాతఁడెట్లు చిక్కును?"

భగవానుఁడిట్లనెను:— "బావా! నీ పిల్లవాని ప్రేమను గాంచితివా?" అర్జునుఁడు తన మాటను నిలఁద్రొక్కికొనుచు నిట్లనెను :— కృష్ణా! ఆతఁడు నన్ను సరిగాఁ జూడలేదు. చూచియుండినఁ దప్పక నిలిచెడువాఁడే."

భగవానుఁడిట్లనెను ;- "మంచిది, ఆతఁడటు నిటుఁ దిరిగి మరల వచ్చునులే. ఈ సారి చూచునేమో చూతము."

కొంచెము సేపటికి మరల నభిమన్యుఁడు వచ్చెను. ఈ సారి అర్జునుఁడు సన్నద్ధుఁడై యుండెను. పరుగెత్తుకొనిపోయి ఆతడభిమన్యునిఁ బట్టుకొని మిక్కిలి ప్రేమతో "వత్సా"యనెను.

అభిమన్యుఁడు ప్రతీకారమొనర్చుట అట్లుంచి అర్జునునివైపు చూడనైనఁ జూడలేదు. బలవంతముగఁ దన వస్త్రమును వదలించుకొని పారిపోయెను.

శ్రీకృష్ణుఁడిట్లనెను:- "ఇంకను సందేహమేమైనను గలదా?" అర్జునుని ముఖము వాడిపోయెను. ఆతనికి శ్రీకృష్ణుని యెదుట చాల సిగ్గయ్యెను. సిగ్గుతో నాతఁడిట్లనెను:- "స్వామీ! ఇంకొక్కసారి చూడనిమ్ము."

శ్రీకృష్ణుఁడిట్లనెను:- "ఒక్కమారుకాదు, పది తడవలు చూడుము. ఆతఁడీదిక్కునకే రాఁగలఁడు."

కొంచెము సేపటికి అభిమన్యుఁడు మరలఁజూచెను. ఈ సారి అర్జునుఁడాతనిని గట్టిగాఁ బట్టుకొని యేడ్చుచు నిట్లనెను:- "ఓరీ వత్సా! నీ వింత నిష్ఠురుఁడవైతి వేమిరా? ఇదివరకు నీవు నన్నెంతో ప్రేమించెడువాఁడవే. నన్నెంతో ఆదరించెడువాఁడవే, నావైపు చూడనైనఁ జూడవేమి? నాయనా! ఇంతనిష్ఠురుఁడ వైతివేలరా! నేను నీ రాకలో పోఁజాలను. నీవే నాకు జీవనాధారము. అంధుఁడనై తిరుగు నాకు నీవే యూతకఱ్ఱ. నీవిప్పుడీ యాటనుమాని నా వెంటరమ్ము.

చూడుము. నీ తల్లి మిక్కిలి దుఃఖించుచున్నది. ఆమె యేమియును దినుటలేదు. నీ నాయనమ్మ, పిన తండ్రులు, పెదతండ్రులు, మామలు, తాతలందఱును వికలులై యున్నారు. నీ యీ నల్లమామయ్య తప్ప.

ఇదివిని అభిమన్యుఁడు అర్జును నదలించుచుఁ గసరుచుఁ నిట్లనెను. "పోపో! వచ్చినావు బావయ్యవఁట. ఎన్నిసారులు నీవు నాకు కొడుకవైతివో నీకు నెన్నిసారులు తండ్రినైతినో నీ వెఱుఁగుదువా? పిచ్చివాఁడా! ఇది గుణప్రవాహము. వీరిలో నెవరెవరికి తండ్రి? ఎవరెవరికి పుత్రుఁడు? శరీరమున్నంత వఱకే సంబంధముండును. గుండ్రగా నుండి ముద్రలున్నంత వఱకే రూపాయ యగును. కరగి కడ్డీగాఁ బోసిన దానినెవరును రూపాయయనరుఁ దానినేదైన నాకారముగ నొనర్చినచో నాయాకారము పేరేయగును. ఈ సంసార చక్రములో నిట్టి క్షణిక సంబంధమే కలదు. నాయాటకు విఘ్నమాపాదించెద వేల? వెడలిపొమ్మ."

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఇట్లు పలికి అభిమన్యుఁడు త్వర త్వరగాఁదన శరీరమును వదలించుకొని పోయెను. అర్జునుని మోహము భంగమయ్యెను. వచ్చి మరల యుద్ధమును బ్రారంభించెను. కావున మునులారా! ఈ ప్రకారముగ నారదుఁడును జచ్చిపోయిన చిత్ర కేతు మహారాజు కుమారుని జీవాత్మను దనయోగశక్తిచేఁ బ్రత్యక్షముగఁ బిలిచెను. పిల్లవాడు బ్రదికినట్లు లేచి కూర్చుండెను. అప్పుడందఱును వినునట్లుగ నారదుఁడు వానితో నిట్లనెను :- "ఓ జీవాత్మా! చూడుము. ఈతఁడు నీ తండ్రి. ఈమె నిన్నుఁ బ్రేమించు తల్లి. వీరు నీ సవతి

తల్లులు వీరందఱును నీ స్వజనులు. బంధు బాంధవులు. నీ కొఱకై వీరందఱును మిక్కిలి శోకాకులులై యున్నారు. అందఱును నీ వియోగ మునే నత్యంత దుఃఖితులై యున్నారు. అందఱు నేడ్చుచు మొత్తుకొను చున్నారు. నాయనా ! నీవు వీరియందు దయయుంచుము. నీ శరీరమందు నీవు ప్రవేశించి మిగిలిన నీ యాయుష్కాలమున వీరినందరిని సుఖ పెట్టుము. ఈ చిత్రకేతు మహారాజిప్పుడు వృద్ధుడైనాఁడు. ఈతఁడతి శీఘ్రముగ నీకు రాజ్య సింహాసనమును సమర్పింపఁగలఁడు. పృథివికేక చ్ఛత్ర సమ్రాట్టుగ నొనర్పఁగలఁడు. నీపై శ్వేతచ్ఛత్రము విరాజిల్లును. చామరము వీవఁబడును. నీ వందఱను శాసింపవలసి యుండును. అంద ఱును నీకాజ్ఞాబద్ధులై యుండెదరు. దీనిచే నీ తల్లిందండ్రులకును నాంత రంగిక సుఖము కలుగఁగలదు. నీ యాశ్రయముననున్న నీ మంత్రి, పురోహిత, భృత్యవర్గమంతయును నానందించెదరు. ఇఁక మీఁదట నీవు తండ్రి యొసంగిన నీ భోగములను భోగించి వీరినందఱను ప్రముదితుల నొనర్పుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! నారదుఁడిట్లు పలుకఁగా విని ఆ జీవాత్మ బిగ్గఱగఁ బకపకనవ్వెను. నవ్వుచు నందఱును వినుచుండ నారదుని ప్రేరణచే నేదోపలుక నుద్యుక్తుడఁయ్యెను.



# మృతపుత్రుని జీవాత్మయొక్క ఉపదేశము

( ౪౨౮ )

శ్లో॥ యథా వస్తూని పణ్యాని హేమాదీని తత స్తతః।
పర్యటంతి నరేష్వేవం జీవో యోనిషు కర్తృషు॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౬ అ. ౬ శ్లో॥

తే॥ రత్నములు హేమములు నమరాగలీల
నలరు నమ్మక పీనల నావలనగు
భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁడగుచు
నెలమిఁ దిరుగుచునుండుఁ దానెందుఁ జెడఁడు॥

శ్రీమదాంధ్ర భాగవతము.

మనమెవరినిఁ ప్రేమించుచుందుమో వారు మరల మనలను ప్రేమింపవలయునని ఆశించుచుందుము. వారు మన ప్రేమను గాలఁదన్ని మనల నుపేక్షించుచో సాధారణముగ నిట్టి సమయమున నాధ్యాత్మిక సంస్కారము లోన గలవానికి వైరాగ్యము జనించును. మాయామోహముచే నత్యంతము గ్రసింపఁబడినవానికి, మాటిమాటికిని తిరస్కృతుఁడైనను, నవమానింపఁబడినను వైరాగ్యము కలుగదు. ఆతనికసత్తునందు సద్బుద్ధికలిగియుండును. ఇట్టి జీవి మాయామోహమందుఁబడియుంటచే దానినుండి బయటపడుట మిక్కిలి కష్టమగును. శ్రీహరి కృపఁజూచి సాధురూపమున స్వయముగవచ్చి దయావశమున మార్గమును జెప్పిననే

యీ సంసారచక్రము నుండి యీ ప్రాణి బయటఁబడును. కాకున్నఁ జాలకష్టమగును. ఇది కాలచక్రము.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! నారదుఁడు రాజకుమారుని ప్రేతాత్మను మరలఁబిలిచి వానిని జీవింపు మనియుఁ దల్లిదండ్రుల కానందమును గావించుమనియుఁ గోరఁగా నాతఁడునవ్వి యిట్లనెను - "స్వామీ! వీరిని నా తల్లి దండ్రులని యేకారణమున ననుచున్నారు?"

నారదుఁడిట్లనెను :- "ఓరీ ! నిన్ను వారుత్పన్నము కావించిరి. ఈతఁడు నీ జనకుఁడు. ఆమె నీతల్లి."

జీవాత్మ యిట్లనెను:- "స్వామీ! ఉత్పన్నము కావించుటచేతనే తల్లిదండ్రులగుచో నాకీనమయమున వేయిజన్మల స్మృతి కలదు. వేల కొలఁది యోనులలో నేను పలుసాఁరులు జన్మించితిని. ఆ జన్మలలోను నాకు దల్లిదండ్రులుండిరి. ఏయే జన్మలలోని యేయే జన్మలకు సంబంధించిన వారలను నేను తల్లి దండ్రులని పిలుతును. నే ననేక జన్మలలో ననేక సంతానములను గంటిని. వీరును పలుసారులు నాకుఁ బుత్రులును, బుత్రికలునైరి. అట్లయిన నేమను వారికిఁదండ్రినైతిని. అన్ని జన్మల లోను జీవికొక్కడే తల్లి, తండ్రి, సోదరుఁడు భృత్యుడు నగునను నియమములేదు. ఒక్కొక్కప్పుడు తండ్రియే కొడుకగును. సోదరుఁడు బావమఱఁదియగును. తల్లి భార్యకాఁగలదు. తనజాతివారు విజాతియందు జన్మించుచుందురు. శత్రువులు మిత్రులగుదురు. సారాంశమేమనఁగా

జ్ఞాతి, శత్రువు, మిత్రుడు, ఉదాసీనుఁడు, బంధు బాంధవులు మారు చుందురు.

వారదుఁడిట్లనెను:- "మారవిమ్మ. వీరీ జన్మమున నీకుఁ దల్లి దండ్రులుగా నున్నారుకదా!"

జీవాత్మ యిట్లనెను:- "స్వామీ! ఉన్నారననుఁడు, ఉండి రనుఁడు. ఎవరి కెవరితో నెంత సంబంధముండునో వారికి వారితో నంతటి మమత్వముండును. ఈ సంబంధము లన్నియును శరీరముతో నుండును. శరీర సంబంధ విచ్ఛేదము కలుగఁగానే మమత్వమును బోవును. రూపాయలును, పైసలును, మొహరీలును, విష్కాదులును, రజత సువర్ణముద్రలును మనకడ నున్నంతవఱకు మన వందురు. వానిని బ్రాహ్మణులకంటె నెక్కుడుగ రక్షించుకొందురు. సాధ్యమైనంత వఱకు ఖర్చుచేయరు. అవి మనకడనుండి పోఁగానే మమత్వమును బోవును. ఇప్పుడితరులకడకుఁ బోయిన తరువాత నవిపోయినను, నశించి నను, నష్టమైనను మనకేమియును జింతయుండదు. మనకొక గృహ మున్నదనుకొనుఁడు, అది మన పేరిట నున్నంతవఱకు మనకు దాని యందు మమత్వముండును. అంతవఱకు అది విఱిగినను, పడినను, జీర్ణమైనను జింతకల్గును. అది యితరుల అధికారములోనికిఁ బోయి, మనది యనుకొననప్పుడు అదిపడిపోయినది యని దిగులుపడము. అట్లే శరీరముపోఁగానే పూర్వపు సంబంధమును బోవును. ఇప్పుడు నాకు వారికి నేమియును సంబంధము లేదు.

వాస్తవముగఁజూచినచో జీవుఁడు నిత్య, శుద్ధ, బుద్ధ, జనన మరణాది రహితుఁడు. స్వయం ప్రకాశకుఁడగుటచేనన్నిటికి నధిష్ఠానమే. ఈతఁడు సర్వసమర్థుఁడు. మాయిక గుణములచే స్వయముగ నీదృశ్య ప్రపంచమును రచించి దీనిలోఁదాను బ్రవేశించును. ఆతఁడు నాలెఖురుగు తన శరీరమందలి దారముచే వలసల్లుకొని దానిలోనే తిరుగునట్లు తిరుగు చుండును. ఆత్మ స్వరూపముచే నకర్త కేవలము బుద్ధికి సాక్షిమాత్రుఁడు. దీనిలో స్వపరభేదములేదు. ఈతఁడు ప్రియాప్రియములను, మిత్రత్వ శత్రుత్వములను లేనివాఁడు. ఆత్మ దేనికిని సంబంధించదు. బంధింపఁ బడదు. కార్య కారణములకు సాక్షి మాత్రము. కర్తయెవఁడగునో ఆతఁడే క్రియాఫలములను గ్రహించును. ఇది శుద్ధబద్ధమైనదగుటచే గుణ దోష క్రియాఫల శూన్యమైనది. కేవల ముదాసీన భావముతో నుండును. నాకును వీరికిని నిన్న దినముననే సంబంధము సమాప్తమైనది. ఇప్పుడు వీరెంతగా నేడ్చినను, నెంతగా మొత్తుకొన్నను నేను తిరిగిరాను. కాల గతి దుర్నివారమైనది. విధి విధానమవిచ్ఛిన్నమైనది. దానికొక్క లిప్త యైననుదగ్గదు. నువ్వుగింజంతయైనను బెరుగదు. మీరు సర్వసమర్థులు. మీ యోగశక్తిచే నన్నుఁ బిలిచితిరి. ఇఁక నేను వెడలుట కాజ్ఞ నొసంగుఁడు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఇట్లు పలికి యా జీవాత్మ వెడలిపోయెను. రాజపుత్రుని శరీరము మరలఁ జచ్చినట్లు పడియుండెను. ఇప్పుడారాజునకు జ్ఞానము కలిగెను. "అయ్యో! నేనెవరి కొరకింతగా శోకించుచున్నానో, ఎవని నిమిత్తమై యింతగా నధీరుఁడనైతినో అతఁడు

నా యెడల నుదాసీనుఁడుగ నున్నాడు. ఛీ! ఛీ! నా మోహము తగులఁబడి పోను. నేనీ శోక మోహ దుఃఖములకు మూలమగు మమత్వమును త్యజించెదను. నేను నా చిత్తము నిమమత్వమందు స్థాపించి, యీ మహర్షి చెప్పెడు మార్గమునను సరించెదను." ఈ విధముగ నిశ్చయించుకొని, కారుచున్న కంటినీటిని దుడుచుకొని, శరీరముపై ధూళిని దులుపుకొని, తల ముడివైచుకొని బాలకుని యెడఁగల స్నేహబంధమును దెగఁగోసి, శోకరహితుఁడై నారదుని చరణములపైఁబడెను.

రాజు మునితో నిట్లనెను:- "మహర్షులారా! ఇప్పుడు నేనేమి చేయవలయును?"

అంత నంగిరోముని యిట్లనెను:- "రాజా! ముందీ మృతబాలకుని శరీరమునకు ఔర్ధ్వదైహిక సంస్కారములు కావలయును."

ముని యాజ్ఞనుబొంది రాజును, అతని సగోత్రులును నా మృత బాలకుని దేహమున కావనయమున నెట్లు చేయవలయునో అట్లు శాస్త్రీయ విధిచే నౌర్ధ్వదైహిక సంస్కారముల నొనర్చిరి. కుల పురోహితులు చెప్పినరీతిని ధర్మాత్ముఁడగు నా రాజు చేయవలసిన కృత్యముల నొనర్చెను."

పిల్లవానికి సంస్కారము కాఁగానే విషమొసంగిన రాణులకును మిక్కిలి పశ్చాత్తాపము కలిగెను. బాలకుఁడు మృతకళేబరమునఁ బ్రవేశించి చెప్పిన గూఢజ్ఞానముయొక్క ప్రభావమంచరణమీఁదను బడెను,

కాని ఆ రాణుల కత్యధికముగ నాత్మగ్లానికలిగెను. వారికి హృదయమున జెడుతలంపులేదు. అందఱును పశ్చాత్తాపోత్పన్నలై. పరిస్థితి వారి బుద్ధులను విపరీతము కావించెను. ఈర్ష్యయు, సవతి మత్సరమును వారినిఁ గ్రూరనిష్ఠుర ప్రకృతికలవారిగ నొనర్చెను. ఇప్పుడు వైరకారణము సమాప్తము కాఁగానే వారి హృదయములను జక్కఁబడెను.



వారందఱును బోయి మునుల పాదములమీఁదఁబడి యేడ్చుచు నిట్లనిరి:- "ప్రభూ! అభాగినులమగు మా పాపమునకుఁ బ్రాయశ్చిత్తమేమైన నుండునా?"



శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! మునులు సర్వజ్ఞులు. అన్నియును దెలిసినవారు. అయినను బాపమును వెల్లడించుటచేఁ బాపముతగ్గును. చాలవఱకు పాపము నిందించువారలకుఁ బోవును. కావున వారి పాపమును దగ్గించుటకై అంగిరోముని యిట్లడిగెను:- "మీరింతగా లజ్జించుటకును. దుఃఖించుటకు నేపాపమును మీరొనర్చితిరి?"



ఇదివిని వారిలో వాచాలగానున్న యామె యిట్లనెను:- "ప్రభూ! మీకంతయును దెలిసియుండియు మమ్ముల నడుగుచున్నారు. కావున మేము చెప్పుచున్నాము. ఈర్ష్యా వశమున మే మీపిల్లవానికి విషమొసంగి చంపితిమి. మా అందఱ యిష్టము ప్రకారమే పిల్లవానికి విషమొసంగఁ బడినది. కావున మే మందఱమును సమానముగఁ బాప భాగినులము. మీరు దీనికేదైనఁ బ్రాయశ్చిత్తమును జెప్పుచో దయయుంచి చెప్పుఁడు. మీ రెట్లాజ్ఞాపించిన నట్లుచేయుటకు మేము సిద్ధముగనున్నాము.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! ఆ రాజుల వాక్యములనువిని మునివరుఁడు వారి పాపమునకుఁ బ్రాయశ్చిత్తమును బోధించుచుండెను."



# విషమొసంగిన రాణికి ప్రాయశ్చిత్తము

( ౪౨౫ )

శ్లో॥ బాలఘ్న్యో (వ్రీడితాస్తత్ర) బాలహత్యాహత ప్రభాః ।
బాలహత్యావ్రతం చేరుః బ్రాహ్మణైర్యన్నిరూపితమ్ ॥
యమునాయాం మహారాజ స్మరన్త్యో ద్విజ భాషితమ్ ॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౬. అ - ౧౪ శ్లో॥

వ. విషము నొసంగిన రాణులు బాలహత్యచే హతప్రభలై, లజ్జితలై వారు అంగిరో మహాముని భాషణములను స్మరించి, బ్రాహ్మణులు చెప్పిన విధముగా యమునాతీరమున బాల హత్యకుఁ బ్రాయశ్చిత్తము కావించుకొనిరి.

సంకల్ప పూర్వకముగఁగాని, ఇచ్ఛచేఁగాని, అనిచ్ఛచేఁగాని చేసిన పాపమును అనుభవించి తీరవలసినదే. కావునఁ బొరపాటు నైనను బాపమును జేయరాదు. పొరపాటుననైనఁ బాపమును జేయఁ గూడదని సదా ప్రయత్నించు చుండవలయును. దీనికి తోడుగాఁ బాపిని

నిందింపనురాదు. మనమే భావనను జేయుచుందుమో అట్టి యాలోచన ములందే నిమగ్నులమయ్యెదము. అట్లే అగుచుందుము. అందఱును స్వకర్మ సూత్రమున బంధింపఁబడి వివశులమై కార్యములొనర్చు చున్నామని తెలియవలెను. మంచిపనులుగానిండు, చెడ్డపనులుగానిండు పూర్వజన్మ సంస్కారముల వలనఁ బ్రారబ్ధమునఁ బ్రేరితులమై జీవి చేయుచుండును. మనము వారిని నిందించి వారిపాపముల నేల పంచు కొనవలెను. మనస్సు వాని యందేల లగ్నము కావింపవలయును. ఇదంతయును భగవంతుని క్రీడయని యేల తలఁపరాదు. ?

శుకదేవుఁడిట్లనెను :- " రాజా ! విషమొసంగిన రాణులు తమ కర్మకత్యంత లజ్జితలుకాఁగా అంగిరో మహాముని వారి పాపమునకు బ్రాయశ్చిత్తమును జెప్పెను. చేయవలసిన పనిని బ్రాహ్మణులకుఁ జెప్పెను. అందఱు నంతఃపురములను వీడి కలకలనినాదినియు, యమ భగినియు, కృష్ణ ప్రియయునగుఁ గాళిందీతటమునకుఁబోయి వ్రతో పాసనములొనర్చి, బ్రాహ్మణులు చెప్పిన రీతినిఁ బ్రాయశ్చిత్త కర్మల నవ్యగ్రభావముతోఁ జేయుచుండిరి."

సూతుఁడిట్లనెను:- "మునులారా! పాపము సంభవించినపుడు హార్దిక పశ్చాత్తాపమును జెందుచో దానికి శాస్త్రీయ రీతిని బ్రాయశ్చిత్త మొనరించుకొనుచో నా పాప మల్పకాలముననే వదలిపోవును."

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- మహాభాగా! సూతా! మాకొక్క విషయ మాశ్చర్య మగుచున్నది. రాణి యెంతో జాగ్రత్తగా నుండెనే

ఆమెయెదుటఁ గుమారునకు విషప్రయోగమెట్లు చేయఁబడినది. పైగా నొకరు విద్దరునుగాదు, లక్షలకొలది రాణులు కలరు. వారందరును పతుక్కులోత్పన్న రాజకుమారికలు. వారిలో నొక్కరైనను నీ నిందిత కార్యమునకు విరోధింపలేదేల? ఈ విషయ మిందఱ చెవులలోఁబడినను రాజభవనమున నీ విషయమెట్లు దాగినది? ఇది రాణీ వఱకేల ప్రాకలేదు?"

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! మీరడిగిన అన్ని విషయములకును నే నొక్కమాటలోనే సమాధానమును జెప్పెదను. ఏదెట్లు జరుగవలసి యుండునో అది అట్లే జరుగును. ఎట్లు జరుగ వలసియున్నదో అట్టి బుద్ధులే పుట్టును. దానికిఁ దగిన వాతావరణ మేర్పడును. భగవంతుఁడట్టి లీలను రచించును. ఒకానొక రాక్షసుఁ డుండెను. అతఁడు ఘోరతపస్సును జేసెను. బ్రహ్మ ప్రసన్నుఁడై వరమును గోరుకొమ్మనెను. అతఁడు బ్రహ్మలోకమునఁదప్ప నెచ్చటను దనకు మృత్యువురాఁగూడదనికోరుకొనెను. బ్రహ్మతథాస్తనెను. ఇప్పుడా రాక్షసుఁడు చావకుండెను. చచ్చుటకు బ్రహ్మలోకమునకుఁ బోవలెను. భూమిపై నాతఁడు చావఁడు. చావెవరికినిఁదప్పదు. అందువలన భగ వంతుఁడొక చక్కని హంసరూపమును ధరించి ఆతని సమ్ముఖమున నెగురుచుండెను. ఆ చిత్రవిచిత్రమగు హంసనుగాంచి యసురుఁడు దానిని బట్టుకొని, ఆటగా దానిపై నెక్కెను. హంసయెగిరి పరిగా బ్రహ్మలోకమునకుఁ గొనిపోయెను. అచ్చటకుఁబోగాని వానిశరీరము పడిపోయెను.

ఇంకొక యసురుఁడుండెను. ఆతఁడు జలభయము తప్ప వింకే భయమును నుండరాదని వరమడిగెను. ఆతనికీవరము లభింపఁగానే ఆతఁడు జలమునుండి రక్షింపఁ బడుచుండెను. ఆతఁడు పొరపాటున నైనను జలమునఁ బ్రవేశింపడు. అతనికి మృత్యువావన్నమగువప్పటికి మృత్యువునుండి తప్పించుకొనుటకై అతఁడొక పర్వతశిఖరమునెక్కెను. ఆ సమయమున సముద్రము పొంగి పర్వతశిఖరమువఱకునువచ్చి దానిని ముంచఁబోవుచున్నట్లుండెను. నలువైపులను నీరుక్రమ్ముటచే వాతఁడు మిక్కిలి భయపడెను. ప్రాణమును కాపాడుకొనుటకువచ్చినఁ బ్రాణముల మీఁదకు వచ్చిపడినది. ఆ సమయమున నాతనికొక పెద్ద ద్వీపమువంటి తాఁబేలు కనఁబడెను. ఆసురుఁడు ప్రాణరక్షణము కొఱకు దానిమీఁది కెక్కెను. ఆ తాఁబేలు మఱెవ్వరుమగారు. కాలస్వరూపుఁడగు కృష్ణుఁడే కచ్ఛప రూపమును ధరించి వచ్చెను. అసురుఁడు దానిపైఁ గూర్చుండ గానే ఆ తాబేలొక మునుఁగు మునిగెను. గోవిందాయనమోనమః అయినది. అసురుఁడు చచ్చెను. స్వామీ! హిరణ్యకశిపుఁడు తన మృత్యువునకెన్నో మినహాయింపులను గోరుకొనెను అస్త్రశస్త్రములచేఁ జావఁగూడదు. పగలు చావఁగూడదు. రాత్రి చావఁగూడదు. పృథివి యందుఁజావరాదు. స్వర్గమునఁ జావరాదు. మానవులచేఁ జావరాదు. పక్షులచేఁ జావరాదు. భగవంతుఁడు వీనిమినహాయింపులను దప్పించి వానిని నృసింహ రూపమున చంపివైచెను. కావునఁ బ్రభూ! ఈ పిల్ల వానికి నష్టిమృత్యువు వ్రాయఁబడినది. అందువలన నిది బయటఁబడలేదు. రాణియును నజాగ్రత్తగ నుండెను.

ఈ క్రూరకర్మము గాదనినవారెవరును లేకపోవుటయేలయను విషయముకలదు. మృత్యువుముఖమున బ్రాయఁబడినవప్పుడన్నియును వచ్చుచుండును. కొందఱు దేశదేశాంతరములనుండియును వచ్చి ఒకా నొకనౌకలో మునిఁగి చచ్చుచుందురు. దీనికంతకును గారణముండి తీరును అకారణముగనే సంఘటనయును జరుగదు. పూర్వజన్మములో మనమెవరి కపకార మొనర్చియుంటిమో యీ జన్మమున వారు వచ్చి మనకపకారమొనర్తురు. పూర్వజన్మమున మనమెవరినిఁ జంపితిమో యీ జన్మమున వారువచ్చి మనలను జంపఁగలరు. పూర్వజన్మమున నీ పిల్లవాఁడీ రాణులనందఱను జంపినాఁడు. ఈతనికి మృత్యువందువలన వీరివలనఁ గలిగినది. ప్రారబ్ధానుసారముగ వేఱువేఱు స్థానములలో నుద్భవించిరి. దైవవశమున నందఱును పుత్రవిహీనుఁడగు రాజునకు భార్యలై ఒక్కచోటఁ జేరిరి."

అంత శౌనకుడిట్లనెను - "సూతా! వెనుకటి జన్మములో నీ స్త్రీలెవరు? ఈ కుమారుఁడు వీరినేల చంపియుండెను?"

అంతసూతుఁడిట్లనెను— "మహానుభాగా! ఈ స్త్రీ లందఱును బూర్వజన్మమునఁ జీమలుఁ లక్షలు, కోట్లుగ నొక్కపుట్టలో నివసించు చుండిరి. ఒకదినమున భగవన్నివేదితమగు పన్నమునుగొని యివి పుట్టలోనికిఁ బ్రవేశించుచుండెను. ఈ కుమారుఁడును బూర్వము రాజ కుమారుఁడే. ఈతఁడు కుడిచి కూర్చుండి చూచుచు నీ చీమలనొక్క పారిగాఁ జూచునప్పటికాక కుకర్మతోఁచెను. ఎదుట నీరు కాగుచుండెను.

నీరుతుకతుక ఉడుకుచుండెను. అతఁడు వినోదము కొరకై ఆ తుక తుకలాడు వేడినీటినిఁ జీమలపుట్టలోనికిఁ గుమ్మరించెను. అందువలన నా వేడిచే నన్నియును జచ్చిపోయెను.

అవి భగవన్నివేదనమును స్పృశించుటచే నన్నియును రాణులై ప్రతీకార మొనర్చుటకై విషమొసంగిరి. ఈ రాజకుమారుఁడును జ్ఞానియే. పొరపాటున నాతనికి పాపము సంభవించెను. దాని సంస్కారము ఈతని హృదయమున మిగిలిపోయినది. దీని ననుభవించుటకై యీతఁడు మరల రాజకులమునఁ బుట్టవలసి వచ్చెను. వారాతనికి విష మీయఁగానే అతని కకాల మృత్యువు సంభవించెను. అయినను జ్ఞాని యగుటచే ముక్తుఁడయ్యెను."

సూతుఁడిట్లనెను:- "మునులారా ! ఇదేవిధముగఁ గార్యములన్నియును నేదో కారణముచే జరుగుచుండును. జీవులందఱును బ్రారబ్ధమునకు వశీభూతులై కార్యమునొనర్చు చుందురు. అన్నియును జతకూడుట నిశ్చయము. కావున సంఘటనములను గాంచి విచారింపవలసిన పని యునులేదు, విస్మయమును జెందవలసిన పనియునులేదు. జరుగునదంతయును సరిగానే జరుగును. ఇది లీలాధారిలీల. వినోదియొక్క వినోదము. నేను రాణుల వృత్తాంతమును గుఱించి చెప్పితిని. ఇప్పుడిఁక మీరేమి వినఁగోరుచున్నారు? "

అంత శౌనకుడిట్లనెను:- "సూతా ! రాణుల విషయమును మేము వింటిమి. ఇప్పుడు రాజు విషయమును వినఁగోరుచున్నాము. ఆతని

సంగతి యేమైనది ? అతఁడు సంకర్షణు నుపాసించి సిద్ధినిఁబొందెనా లేదా ? ఈ వృత్తాంతమును మాకు నీవు చెప్పవలయును. దీనిని వినుటకు మేము మిక్కిలి కుతూహలమును జెందుచున్నాము ”

ఋషుల యీ యుత్సాహమును గాంచి సూతుఁడిట్లనెను:- “మునులారా ! ఇప్పుడు నేను చిత్రకేతు మహారాజుయొక్క ఉత్తర చరిత్రమును వినిపించెదను. మీరిప్పుడు దానిని సావధానులరై వినవలయును.”



## చిత్రకేతువునకు విద్యాధరాధిపత్య ప్రాప్తి

(౪౩౦)

శ్లో॥ చిత్రకేతుస్తు విద్యాంతాం యథానారద భాషితామ్॥
ధారయామాస సప్తాహ మబ్భక్షః సుసమాహితః।
తతశ్చ సప్తరాత్రాంతే విద్యయా ధార్యమాణయా।
విద్యాధరాధిపత్యం సలేభేఽ ప్రతిహతం నృపః॥

శ్రీభాగ. ౬స్కం ౧౬ అ. ౧౩, ౧౪శ్లో॥

వ. చిత్రకేతుండును నారదోపదేశ మార్గంబున నిరాహారుండై
సమాధినియతుండై నారాయణ రూపంబయినయా
విద్య నారాధించి సప్తరాత్రాంతమున నప్రతి హతంబయిన

విద్యాధరాధిపత్యంబును భాస్వద్రత్న దివ్యవిమానంబునుం
బడసి నారాయణాను గ్రహంబునుం బొందె."

శ్రీ మదాంధ్రి భాగవతము.

శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుండగు సిద్ధగురువొసంగిన విద్య యెన్నటి కిని వ్యర్థముకాదు. అతఁడు చెప్పిన ప్రకారము సావధానముగఁజేసిన అనుష్ఠానము సఫలమైతీరును. పాత్రభేదముచే దానిఫలములోఁ గొంచెము భేదముండవచ్చును. అది వేఱువిషయము. కాని విద్య అమోఘముగనే యుండును. కావున సమిత్పాణియై శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుఁడగు గురువు నాశ్రయింపవలెను. ఈ సంసారమును దాటింపఁగల సమర్థుఁడు శ్రీ గురుదేవుఁడే, ఇంకెవరికిని ఆస్థితిలేదు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! రాజా తన మృతపుత్రునకు సమస్త పారలౌకిక సంస్కారములొనర్చిన తరువాత, ఆతని రాణులు తమ బాలహత్యారూపమగు పాపము నకుఁ బ్రాయశ్చిత్తమొనర్చుకొనిన తరువాతఁజిత్రకేతు మహారాజును రాజ్య, ధన, పరివార, స్వజన బంధు, బాంధవులందరిపై మోహమును త్యజించి బురదలో దిగఁబడిన కరి దయా శువగు పురుషుని కృపచే బయటపడినట్లు గృహమును వీడిపోయెను

మహారాజు మునుముందుగా సర్వపాతక నాశినియగు యమునలో స్నానమాడి, తర్పణములొనర్చి, మౌనమును వహించి, ముందుగా నంగిరోమహాముని కిని నారదమహర్షికిని నమస్కరించెను. రాజునకు మంత్రదీక్ష నొసంగవలసినదిగ అంగిరసుఁడు నారదున కనుమతి

నొపంగెను. అప్పుడు నారదుఁడెనిమిది మంత్రములుగల గూఢవిద్య నుపదేశించెను, రాజు మంత్రదీక్షనుబొంది తన గురుదేవుఁడగు నారదుని పాదారవిందములకు మరలఁగృతజ్ఞతా పూర్వకముగఁ బ్రమాణము కావించెను."

నారదుఁడిట్లనెను:- "రాజా! నీవు మిక్కిలి సావధానముగ నీ మంత్రోపనిషత్తు ననుష్ఠానము కావింపుము. ఇప్పుడిఁక నేను వెడలెదను."

ఇట్లుపలికి అంగిరోమునిని వెంటఁబెట్టుకొని నారదమహర్షి తన ధామమగు బ్రహ్మలోకమునకుఁ బోయెను.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- రాజా! అంగిరో నారదమునులు వెడలి పోయిన మీఁదటఁజిత్రకేతువు నారదుఁడు చెప్పిన రీతిగా నా మంత్రా నుష్ఠానమును విధ్యుక్తముగ నేకాగ్ర చిత్తుఁడై మిక్కిలి జాగ్రత్తగఁ దత్పరతతో ననుష్ఠానము గావించెను. ఆతఁడేడు దినములవఱకు దిాసు లేదు నిద్రించనులేదు. కేవలము కాళిందీ నిర్మల జలములను ద్రావి యేడుదినములు నేడు రాత్రులు నదేవిధముగ మంత్రోపనిషత్తును జరిపించుచుండెను.

ఏడు దినములైన తరువాత నొకవిచిత్రము జరిగెను. ఆతఁడు చావకయే యీ శరీరమే దివ్యమయ్యెను. ఆతఁడు మనుష్యుడుగనుండి దేవతయయ్యెను. దేవతలలో విద్యాధరులను నొకయుపజాతికలదు.

విద్యాధరులు మిక్కిలి రూపవంతులుగనుందురు. ఆకాశచారులును, స్వచ్ఛంద విహారులునగు వారేపగణములో నందఱును మన్మథునివలె సుందరులుగను, సదా దివ్యవస్త్రాభరణములు గలవారలుగను నుందురు. చిత్రకేతు మహారాజు సాధారణ విద్యాధరుఁడుకాలేదు. అతఁడు విద్యాధరాధిపతియయ్యెను. ఆతని కంతట నప్రతి హతమగు గతికలదు. విద్యాధరాదిగణముల కాతఁడధిపతి యయ్యెను. నారదునివిద్య అమోఘమైనది. అందువలన నాతఁడు విద్యాధరుఁడయ్యును నసుష్ఠానమును జేయుచుండెను. దాని ప్రభావముచే నాతఁడు శ్వయముగ పాజౌత్తమోగుణ సంకర్షణ శేషనాగుని చరణారవింద సమీపమునకుఁ జేరుకొనెను. అతనికిఁ బ్రత్యక్షముగ ధరణీధరుని దర్శనమయ్యెను.

సహస్రఫణమండితుడైన చిత్రకేతుమహారాజు నొక్క ఫణము మీఁద నావగింజవలె నీ పృథివియుండెను. అతనికి నలువైపులను సిద్ధేశ్వరులంజలులను బంధించుకొని నిలువఁబడియుండిరి. ఆతని సహస్రఫణములందు సహస్రమకుటములు శోభించుచుండెను, కిరీటములలో నానా విధములును బహుమూల్యములనగు మణులు మెఱయుచుండెను మణుల చాకచక్యముచే నా పాతాళవివరము పరమ ప్రకాశమానమగుచుండెను. భగవానుని శరీరము కమలనాళమువలె శుభ్రముగను దేజోమయముగను నుండెను. దానిమీఁద దివ్యనీలాంబరము వెలయుచుండెను కిరీటకేయూర, కటిసూత్ర, కంకణాది భూషణములశోభచే శోభితమగు నాతని యంగము మిల మిల మెఱయుచుండెను. మధుర సుధారసపానమొనర్చుటచే నాతని కమల నయనములు కొంచెమరుణముగ నుండెను.

ముఖము మందహాసముతో మనోహరముగ, నత్యంతాకర్షణముగ నుండెను. భగవానుని ఓష్ఠము లన్నియును గదలుచుండెను అవి సుమధుర భగవన్నామమును నిరంతరము జపించుచుండెను.

విద్యాధరుఁడైన చిత్రకేతువు స్నేహభరిత హృదయముతోఁదన యిష్టదేవుని దర్శించెను. సంకర్షణుని దర్శనము చేయఁగానే అతని పాపసంతాపములన్నియును నశించెను. అతని అంతఃకరణమున మిగిలిన మలము తత్క్షణమే నశించెను. దీనిచే నాతని యంతఃకరణము శుద్ధమును నిర్మలమునయ్యెను. ఆఁకలిగొన్నవానికి సుస్వాదు భోజనము లభించినను, చిరకాల వియోగినికిఁ దన ప్రియతముఁడు లభించినను. అత్యంత దైన్యదుఃఖియగు దరిద్రునకు సంపత్తి లభించినను నెట్టి సంతోషము కలుగునో అంతకంటె వేయిరెట్లు సంతోషము రాజర్షియగు చిత్రకేతువునకు భగవద్దర్శనమునఁ గలిగెను. ఆతని దేహము భక్తిభావముతోఁ దనప్రేమ పిపాసిత నేత్రములందు ప్రేమాశ్రువులునిండ రోమాంచితమయ్యెను. అతఁడు భూమిపైఁబడి దేవాది దేవుఁడగు సంకర్షణ భగవానుని దివ్యచరణారవిందములకు సాష్టాంగ ప్రణామములు గావించెను.

ప్రథమమున నర్ఘ్య పాద్యాచమనీయాదుల నొసంగి భగవానుని పాదపీఠమునకుఁ బూజింపవలెను. అందువలన నాతఁడు ప్రేమాశ్రువులచే నాతని పాదపీఠమును గడిగి. ఆ ప్రేమాశ్రువులతోడనే పాద్యాది కృత్యములొనర్చెను. పవిత్రకీర్తిశాలియు నాదిదేవుఁడునగు సంకర్షణుని చరణముల నాతఁడు ప్రేమవారిచేఁగడిగెను. ప్రేమోద్వేగముచే నాతని

కంఠము రుద్ధమయ్యెను. అందువలన సత్యుత్కంఠయున్నను నాతఁడు భగవంతుని స్తుతింపఁజాలకుండెను.

ప్రేమోద్వేగము కొంచెము తగ్గగానే అతఁడు తన్నుఁదాను గుదుటపరుచుకొని, మాట్లాడుటకు కొంచెముశక్తిరాఁగానే బుద్ధిపూర్వక ముగ మనస్సును సమాహిత మొనర్చుకొని, విడివడిన చిత్తవృత్తులను నిరోధించి, బాహ్యాంతఃకరణ వృత్తులను సంయమన మొనర్చి జగద్గురువగు శేషభగవానుని స్తుతింప సుద్యుక్తుడయ్యెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాజర్షియగు చిత్రకేతువు సంకర్షణుని స్తుతించిన దివ్యాతిదివ్య మధురాతి మధురస్తుతిని నేను స్తుతిప్రకరణమునఁ జెప్పెదను. ఆస్తుతి అతి భావపూర్ణమైనది.

చిత్రకేతుని స్తుతికి సంకర్షణుఁడత్యంత ప్రసన్నతనుజెంది అతనికుపదేశించినదానిని మీరు సావధానులరై శ్రవణ మొనర్పుడు."



## చిత్రకేతునకు సంకర్షణుని ఉపదేశము

(౪౩౧)

శ్లో॥ లబ్ధ్వేహ మానుషీం యోనిం జ్ఞాన విజ్ఞాన సంభవామ్।
ఆత్మానం యో నబుద్ధ్యేత న క్వచిచ్ఛమ మాప్నుయాత్॥
శ్రీభాగ. ౬ స్కం. ౧౬ అ. ౫౮ శ్లో॥

సీ॥ "అరయంగ నెవ్వని కలవిగానట్టి యీ
వలలిత మానుష జాతిఁ బుట్టి
యాత్మతత్త్వజ్ఞాన హతుఁడైన వానికిఁ
గలుగునె యెందు సుఖంబొకింత"

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఇష్టదేవుఁడు గురుదేవుఁడొసంగిన జ్ఞానమును సమర్థించును. గురుమంత్రజపమునకు ఫలము ఇష్టదేవుని దర్శనము. ఇష్టవస్తు ప్రాప్తికలిగినఁ గృతార్థుఁడైనట్లే. వానికింకఁ జేయవలసినదియుండదు. అతనికిఁ గర్తృత్వబుద్ధిచే భగవత్సేవతప్ప కర్మబంధనముండదు. ఇష్టదేవుఁడేది యుపదేశించినను అతఁడు సాధన మహత్త్వమును జెప్పుటకును, సాధకుని సంతోషము కొఱకును జెప్పును. సేవకునకు స్వామి శ్రీముఖమున నుపదేశాది శ్రవణమొనర్ప కోరికయుండును. ఆ కోరికను బూర్తిచేయుటకే ప్రభువు ఉపదేశమొసంగును. అతఁడన్య సాధకులకు పథప్రదర్శకుఁడగును. వాని సాహాయ్యమున ససంఖ్యాకులగు సాధకులు సాధ్యమును జేర సమర్థులగుదురు.

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! విద్యాధరాధిపతియగు చిత్రకేతువు సంకర్షణునిఁ బ్రత్యక్షముగ దర్శించి, ప్రేమోన్మత్తుఁడుకాఁగా నాతని దీర్ఘస్తుతులకుఁ బ్రసన్నుఁడై భగవానుఁడు తన భక్తునితో నవ్వుచు నిట్లనెను;— "రాజా! ఇప్పుడు స్తుతింపనేల? నీవిప్పుడు సిద్ధుఁడవైతివి. ఇష్టవస్తు ప్రాప్తికానంతవఱకే సాధనము. ఇష్టవస్తు ప్రప్తి కాఁగానే శుధసాదన మాగిపోయినను ఫరివాలేదు. అతఁడు శరీరముండగానే యేదోరూపమున నుండును. భేదమేమనఁగా నాతనిలో నిఁకఁ గర్తృత్వ బుద్ధి

యుండను. శ్వాసప్రశ్వాసలె ట్లప్రయత్నముగనే జరుగుచుండునో ఆట్లే సిద్ధుల సాధనమును నుండును. అంగిరో నారదులెప్పుడు నా విషయము నుపదేశించిరో అప్పుడే నీవు సిద్ధుఁడవైతివి. ఇఁక మిగిలినది నాదర్శనమునఁ బూర్తియైనది. సమస్తభూతములను బాలించునది నేనేయని యిప్పుడు నీవు తెలిసికొనుము. అందఱకు నంతరాత్మమనేనే. అందఱ హృదయములలోనుండి సమస్త ప్రేరణములను జేయుచుందును. నాకు రెండురూపములు.

రాజిట్లనెను:— "స్వామీ! మీ యా రెండు మూర్తులేవి? మొదట వచ్చినదేది, రెండవమూర్తియేది?"

ఇదివిని యనంతుఁడిట్లనెను:- "రాజా! ఉండుటేమిటి? అవి నిత్యములు, సనాతనములు. నా మూర్తి యొకటి శబ్దబ్రహ్మ. రెండవ మూర్తి పరబ్రహ్మ. ఈ రెంటికిని భేదభావముగాని, పృథగ్భావముగాని లేదు. ఈ రెండును నా సనాతన మూర్తులు."

చిత్రకేతువిట్లడిగెను:- "స్వామీ! మాకీ కనఁబడు నీప్రపంచమునకును జీవాత్మకును సంబంధమేమి?"

అంత సంకర్షణభగవానుఁ డిట్లనెను:— "రాజా! ఈ ప్రపంచము జీవాత్మలో వ్యాపించినది. ప్రపంచము లేక జీవాత్మకుఁ బ్రయోజనమేమి కలదు? అదేవిధముగ జీవాత్మయందు ప్రపంచము వ్యాపించియున్నది. ఇద్దరకును నన్యోన్యాశ్రయ సంబంధము కలదు. వీరిద్దరిలోను గారణ

రూపముగ నేను వ్యాపించియున్నాను. వాస్తవమున నన్నిటికిని నేకైక కారణము నేనే."

రాజిట్లనెను:- "స్వామీ! ఇది నాకర్థముకాలేదు. జీవాత్మ ప్రపంచములకు పరస్పరము అన్యోన్యాశ్రయ సంబంధము కలదంటిరి. అన్నిటికి నేకైక కారణము మీరేయగుచో మీరు సత్యస్వరూపులు; సుఖస్వరూపులు; ఏకరసము, ఇవన్నియును ఈ దృశ్య ప్రపంచములో నుండవలెను."

భగవానుఁడిట్లనెను:- "రాజా! ఇవి సత్యములుకావు. నాలో మాయద్వారా కల్పితమైనవి. ఒకానొకఁడు నిద్రపోవుచుఁ దన్ను నన్నిటిలోఁజూచును. అనఁగా నంతయును దానేయనుకొనును. తర్వాత నింకొక స్వప్నమందు జగత్తు తనకన్యమైనదిగ నింకొక ప్రదేశమున నున్నట్లుగఁజూచును. స్వప్నమును జూచువాఁడొక్కఁడే. ఒక స్వప్నములో నంతను దనలోఁజూచును. స్వప్నాంతరమునఁ దన్ను నొకదెశమున నున్నట్లుగాఁచును. వాస్తవమున రెండును స్వప్నములే. వానిలో సత్యత లేదు. అదేవిధముగ జీవుని జాగ్రత్స్వప్నాద్యవస్థలు వాస్తవములుకావు. ఇవి పరమేశ్వరుని మాయామంత్రములు. ఏ కార్యములకైనను నేకైక కారణమునేనే. అందుసాక్షియును, మాయాతీతుఁడునగు మహేశ్వరుఁడను నేనే. కావున సదాసర్వదా మాయాప్రపంచమును మఱచి నన్నే స్మరించుచుండవలయును. నాస్మరణయే సమస్త సాధనములకును సారము."

రాజిట్లడిగెను:— "జాగ్రత్స్వప్న సుషుప్తులు మూఁటికి సభిమానులు విశ్వ, తైజస, ప్రాజ్ఞులని చెప్పఁబడినది. వీనిలో మనము దేనినాత్మగా

నెన్నవలయును?"

అంత భగవానుఁడిట్లనెను:- "ఈ మూఁటికిని సాక్షిగా నున్నదియే ఆత్మ. నాయనా! ఇట్లు తెలిసికొనుము. స్వప్నమున మనము నిద్రించెదము. ఒక్కయెడ నిద్రాసుఖము ననుభవింతుము. ఆ సమయమున విషయములను గ్రహించు దృశ్య ప్రపంచముండదు. అయింద్రియములును నచేతనములుగఁ బడియుండును. అయినను మనము నేడు బాగుగా నిద్రించితిమనుకొనుచుందుము. ఇప్పుడు రెండు విషయములు కలవు. ఒకటి నిద్రాజనిత సుఖమును, రెండవది అంతీంద్రియ సుఖమును. ఈ రెంటిని ననుభవించు నాత్మస్వరూపుఁడనగు బ్రహ్మమ నేనే."

రాజిట్లడిగెను:- "అయితే స్వామీ! నిద్ర యెట్లు వచ్చును? ఆత్మకా? దేహమునకా?"

అంత భగవానుఁడిట్లనెను:- "ఆత్మకు నిద్రతో నేమిసంబంధము. నిద్రించువాడు మేల్కొనును. ఆత్మ నిత్యజాగృతి చెందినది. కావున నిద్రా జాగృతులు కల్పితావస్థలు మాత్రమే. ఈ రెంటియందును సమానరూపముగ సాక్షి మాత్రముగ ననుగతమైనదియును, వీనికి సర్వథా వేఱుగానుండియును నెన్నటికిని వికృతిని జెందనిదియునగు కేవల శుద్ధజ్ఞాన స్వరూపమగునది పరబ్రహ్మ."

అంత రాజిట్లడిగెను :- "ప్రభూ! జీవుఁడు బంధ మోక్షములను చక్రములో నేలపడినాడు, ఈతఁడు నానా యోనులలో మరల మరలఁ బుట్టనేల."

సంకర్షణ భగవానుఁ డుపేక్షస్వరమున నిట్లనెను :- "పుట్టుచెచ్చు టవయ్యా! బంధమునులేదు. మోక్షమునులేదు. వ్యర్థముగ మిథ్యాకల్పన ములోఁబడి జీవిఅకారణముగ భ్రమించుచున్నాడు. కంఠమున మాలనుబెట్టు కొని మాలయెక్కడ మాలయెక్కడనని బయటను వెదకుచున్నాఁడు. ఒకానొ కఁడు మితిమీఱించి మాదక పదార్థమును సేవించి, ఆమత్తులోఁ బిల్లవానిని చంకలో నిరికించుకొని యింటికి వచ్చెను. ఇంటికి రాఁగానే పిల్లవాని సంగతి జ్ఞప్తికివచ్చెను. ఇప్పుడటునిటు నన్వేషింప నారంభించెను. ఎంతో దుఃఖించి చింతించుచుండెను. ఎచ్చటను సుఖశాంతులు లభింపలేదు. దయామయుడగు నొకానొకఁడు మిక్కిలి వ్యగ్రతతో నతఁడుండుటను గాంచి యిట్లడిగెను :- "ఏమయ్యా, నీవేమి వెదకుచున్నావు? ఇంతగాఁ జింతితుఁడవై దుఃఖించెదవేల ?"

అతఁడిట్లనెను :- అయ్యా ! ఏమని చెప్పుదును. ఇంటి నుండి వచ్చునప్పుడు వెంటఁ బిల్లవానినిఁ దెచ్చితిని. అతని నెచ్చటనో పోఁగొ ట్టుకొన్నాను. వానిని వెదకుచున్నాను."

అతడు నవ్వి యిట్లనెను :- పిల్లవాడు నీచంకలోనే కలఁడు. అటునిటు వ్యర్థముగ నీవు వెదకెదవేల?"

అప్పుడాతఁడు కాంచి సంతోషముతో నిట్లనెను :- "మంచిది, పిల్లవాఁడు చంకలోనే యున్నాఁడే. ఊరంత వెదకుచుంటినేల? కావున రాజా ! జీవి నాయీ పరబ్రహ్మ స్వరూపమును మఱచినప్పుడు తన యాత్మను విడిపోయినట్లుగ భావించును. తాను సాంసారిక కర్మలలో

బంధింపఁబడినట్లుగ భావించి సంసారియై నానా యోనులలో సుఖదుఃఖ జననమరణములు తనకున్నవనుకొని సంసారియగును." కావున నెవనికి అందఱకును నాత్మస్వరూపుఁడగు పరమేశ్వరుని జ్ఞానముకలిగినదో ఆతఁడు సాంసారిక దుఃఖముల నుండి సర్వదా ముక్తుఁడైనట్లే. ఈ జ్ఞానమునకు వంచితుఁడైనవాఁడు — "పునరపిజననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనమ్" ఈ మాయలోఁబడి బంతివలె నెక్కడికి తన్నిన నచ్చటఁబడును. ఈజ్ఞానమునకు మనుష్యదేహమే వీలు. కావున మానవ దేహమును బొంది యీ జ్ఞానమును సంపాదించిరా మానవ దేహము సార్థకమైనట్లే. దీనికి వంచితుఁడైనవాఁడు గోవిందాయ నమో నమః అయినట్లే."

విద్యాధరాధిపతియగు చిత్రకేతు డిట్లనెను:- స్వామి ! ఈప్రాణి సదా సుఖముకొఱకే ప్రయత్నము చేయుచుండును. అట్టియెడ దుఃఖ ప్రాప్తి యేల కలుగుచున్నది?"

అంత ననంతుఁడిట్లనెను :- "మహారాజా ! దుఃఖమునకుఁ గారణము ఫలేచ్ఛ. ఈ సంసారులు విషయసుఖప్రాప్తికై రాత్రింబవళ్లొ కటే చేసెదరు. అహర్నిశలు వ్యగ్రులై యుందురు. కాని వారనిత్య వస్తువులను గోరుచుఁ బ్రయత్నమొనర్చు చుండుటచే సుఖము లభించుట లేదు. నీవు తుమ్మచెట్టును వైచి దానిని శ్రమతోఁబోషించుచుండిన దాని శ్రమకు తగిన ఫలముండదు కాని యేమి లాభము. నిష్ప్రయోజనము. దానికి మధుర సుస్వాదుఫలములుండక పెద్దపెద్ద ముండ్లుండును. సాంసా

రిక వృత్తులలోఁబడక. విషయనివృత్తుఁడై ఆత్మస్వరూపుఁడగు శ్రీహరిని శరణువేఁడుచు, కామనానివృత్తుఁడై ధనకాంక్ష లేక వర్తించువాని కెప్పటను నెప్పుడును భయములేదు. అట్టివారు నిత్యనిర్భయపదమును బొందుదురు."

స్త్రీ పురుషులందఱును సుఖప్రాప్తి కొఱకును, దుఃఖనివృత్తి కొఱకును సమస్తకార్యము లొనర్చుచుండుట, నిజమేకాని వారిగతి తలక్రిందులు. వారుపోవలసినది ఉత్తరమునకు, పోవుచున్నది దక్షిణమునకు. అట్టియెడల గంతవ్యస్థానమునకెట్లు చేరఁగలరు? విపరీతపథము, విపరీతభావన కలుగుటచే వారికి దుఃఖనివృత్తియునుగాదు, శాశ్వత సుఖమును లభింపదు.

చిత్రకేతు డిట్లడిగెను :- "అయితే స్వామీ! కనఁబడునదీ దృశ్యజగత్తేగదా! దీనియందాసక్తినిఁ జెందకుండినచో నింక మానవుఁ డేమిచేయును. ప్రేమింపక యే ప్రాణియును నిలువఁజాలడుగదా!"

అంత భగవాను(ఁ)డిట్లనెను :- "నన్నుఁ బ్రేమించుము. నా భక్తుఁడవగుము. ఇదిచేసినఁ జాలును."

రాజిట్లడిగెను:- "భక్తుఁడెట్లు కావలెను స్వామీ! అప్పుడీ సంసారమును వదలవలదా?"

భగవానుఁడు శీఘ్రముగ నిట్లనెను: "వదలవలసిన పనిలేదు. ఈ మానవుఁ డభిమానగ్రస్తుఁడై సర్వమును దానేయనుకొని యిట్టి విపరీత ఫలములను బొందును. ఆత్మగతి సూక్ష్మాతి సూక్ష్మమైనది.

జాగ్రత్స్వప్న సుషుప్తులకు విలక్షణమైనది. ఈ లోకమున వైషయిక పదార్థములందును, పరలోకములోని దివ్యపదార్థము లందును విరాగము జనింపనంతవఱకు నా భక్తి దుర్లభము. విషయభక్తుఁ డెన్నటికిని నా భక్తుఁడు కాఁజాలఁడు. బాహ్యేంద్రియములగు జ్ఞాన కర్మేంద్రియములను, మనోబుద్ధి చిత్తాహంకారములను నీ యంతరింద్రి యములను సంసారమున సంలగ్నమగునంత వఱకును, నివి సత్య ములను కొన్నంత వఱకును యోగమార్గమునఁ గుశలత్వము ప్రాప్తిం చదు. సమస్త - అంతరింద్రియములు బాహ్యేంద్రియములద్వారా ఏక మాత్రుఁడును, సచ్చిదానంద పరబ్రహ్మ సుఖస్వరూపుఁడునగు శ్రీహరిని దర్శించినపుడే మోక్షమున కధికారియగుచున్నాడు. అట్టివాడేఁ నిజమగు భగవద్భక్తుఁడు. మానవునకిదియే సర్వశ్రేష్ఠమగు కర్తవ్యము. దీనినే పరమపురుషార్థమందురు. నీవును నాయీ యుపదేశము ననుసరించి నీ కాలమును గడుపుచో నీవు జ్ఞాన విజ్ఞాన పరితృప్తుఁడవును, నిత్య ముక్తుఁడవును, భగవద్భక్తుఁడవు నయ్యెదవు."

శ్రీ శుకదేవుఁడిట్లనెను - "రాజా! ఈ విధముగ ననేక విధములగు నుపదేశముల నొసంగి అనంత ప్రభువచ్చటనే అంతర్ధానమయ్యెను. రాజాతని దర్శనముచేఁ బ్రముదితుఁడై అట్లే నిలిచియుండెను. కలగనిన వాఁడు నిర్భ్రాంతపోయి విస్మిత భావముతో నటునిటు నాశ్చర్యముతోఁ జూచునట్లు రాజును నటునిటుఁ జకితభావముతోఁ గన్నులను నులుపు కొనుచుఁ జూచుచుండెను. భగవానుఁ డంతర్హితుఁడైన దిశకుఁ బ్రణామము కావించి ఆకాశమార్గమున స్వచ్ఛందముగ విహరింపసాగెను."

# ఇంద్రసభలోఁ జిత్రకేతువు శివునాక్షేపించుట

(౪౩౨)

శ్లో॥ ఏకదా స విమానేన విష్ణుదత్తేన భాస్వతా।
గిరిశం దదృశే గచ్ఛన్పరీతం సిద్ధచారణైః
ఆలింగ్యాంగీకృతాం దేవీం బాహునా మునిసంసది।
ఉవాచ దేవ్యాః శృణ్వత్యా జహాసోచ్చైస్తదన్తికే॥
శ్రీభాగ॥ ౬ స్కం. ౧౭ అ. ౪.౫ శ్లో॥

క॥ ఆరజత భూధరంబున
నీరేజభవామరాది నికరము గొల్వం
బేరోలగమున నుండిన
గౌరీయుతుఁడైన హరునిఁ గనియె నరేంద్రా॥

వ. ఇట్లు బ్రహ్మాదిసురనికర సేవితుండై యూరుపీఠంబుననున్న భవానిం గౌఁగిటం జేర్చికొని యొడ్డోలగంబుననున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగియె."

ఆర్యధర్మ శాస్త్రములలో నన్ని పదార్థములు జీవముకలవిగఁ జెప్పఁబడినవి. అండజ, పిండజ, స్వేదజ, జరాయుజములు మర్త్యలోక ప్రాణులు. దేవ, దానవ, ఋషి, గంధర్వాదులు పైలోకములోని జాతులు. ధర్మాధర్మములు వ్యక్తివిశేషములే. వీనివలన వంశము వృద్ధియగును. వీనికిని జాతులు కలవు. కామమెట్లుపుట్టినదియు, కామునిభార్య యెవరు,

ఆతని పిల్లలెవరు మొదలగు విషయములన్నియును బురాణములలోఁ గలవు. ఇచ్చట నేను మదోత్పత్తినిగుఱించి చెప్పవలసి యున్నది. మానవునకు కామక్రోధాదు లార్గురు శత్రువులున్నారని అందఱకును దెలియును. అందులో మదమనునది యొకటికలదు. మదోత్పత్తి విషయమున నొక పౌరాణిక కథ కలదు. ఈ కథ వృత్రాసురోత్పత్తికి దగ్గఱగనుండును. ఒక నాఁడు చ్యవనమహర్షి యింద్రుఁడొనర్చిన యొక తప్పునకుఁ గోపమును జెందెను. అతఁడు తన తపోబలముచే నింద్రునిఁ జంపుటకొక శత్రువును సృష్టించెను. ఈ సంగతి నింద్రుఁడువిని భయపడెను. ఇంకేయుపాయమును దోచకపోఁగా నాతఁడు పరువిడి చ్యవనమహర్షి కడకువచ్చి, తనమణిమయ కిరీటయుక్తమగు మస్తకము నాతని చరణములందుంచి, యత్యంత వినయభావముతో నాతనిని బ్రార్థించెను. బ్రాహ్మణుని హృదయము నవనీత కోమలముగనుండును. నిమిషములోఁ గరఁగిపోవును. ముని ప్రసన్నుఁడయ్యెను. అతనికి క్రోధముతగ్గి మిక్కిలి చింతతో నిట్లనెను:- "ఇంద్రా! నీవువచ్చి మంచి పనినిఁజేసితివి. కాకున్న నా చేసృజింపఁబడిన నీయసురుఁడు నిన్ను నిశ్చయముగఁ జంపెడువాఁడే. ఈతఁడు మహాబలవంతుఁడు. ఇప్పుడీతని నెచ్చట నుంచఁగలను. వీనిని ధరించుటకు శక్తి యెవ్వరికినిలేదు. నీ వెచ్చట నుంచుమనిన నచ్చటనుంచెదను."

ఇంద్రుడిట్లనెను:- "స్వామీ! ఈతఁడు త్రిలోకాధిపతినగు నన్నుఁ జంప సమర్థుఁడగుచో, నాకంటెను బలియగుచో వీనిని జాలస్థానములలోఁ బంచుఁడు."

మునియిట్లనెను:- "బాగున్నది. ఈతని నేనన్ని స్థానములలోఁ బంచెదను. ఈతఁడు స్త్రీలతో నెక్కుడుగ నుండఁగలఁడు. విశేషముగ యువతులలో. వారెల్లప్పుడును మదమత్తలగనుందురు. జూదములోను. సురయందును, మృగయా వినోదమందును సమస్త విద్యలందును, సమస్త శిల్పములందును, రూపవంతులందును, బలవంతులందును, ధనికులందును, ఐశ్వర్యశాలులయందును, ఎంతవఱకని చెప్పుదును, సామాన్య రూపముగ సమస్త ప్రాణులందునుండును. ఏనుఁగులందును, మద్యమందును, విశేషముగనుండును. ఎంతవఱకుఁ జెప్పుదును. త్యాగి దీనిని దప్పించుకొనఁజాలఁడు." అప్పటినుండి యీమదము ప్రాణులలో నుండి వారిని మదమత్తుల నొనరించుచుండును. విశేషించి యైశ్వర్య శాలురను, తపస్తేజఐశ్వర్యాభిమానము కలవారినిఁ జాల బాధించును. వారుమదమత్తులై పెద్దల నవమానమొనర్చుచుందురు. అందువలనవారు శాపముచే క్లేశముల ననుభవించెదరు.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! విద్యాధరాధిపతియగు చిత్రకేతువు సంకర్షణుని దర్శనముచేతను, నాతని యుపదేశమువలనను కృతార్థుఁడయ్యెను. ఆతని వైరాగ్యము అత్యంత శోకకారణమునఁ దామసభావమును గలిగియుండును. అందువలననే నారదుఁడు భగవంతుని తమోమయమూర్త్యుపాసనము జెప్పెను ఆజ్ఞానము నివృత్తియైనను నాతనికి ప్రారబ్ధ శేషమున్నట్లు తోచుచున్నది. జ్ఞానము కలిగినను జీవన్ముక్తునకుఁ బ్రారబ్ధశేషముండును. సంచిత కర్మములు నాశనమైనను శరీర ప్రారబ్ధ కర్మ ననుభవింపవలయును. వానియందాసక్తియుండదు. వానిననుభవింప

పలసి వచ్చినపుడు సుఖదుఃఖానుభవముండదనుట వేఱు విషయము.

చిత్రకేతువునకును గొంతభోగ మవశేషముగనుండెను. వానిని భోగించుచు నాతఁడాకాశ మార్గమున దివ్యలోకములందు విహరించు చుండెను. భగవానుఁడత్యంత తేజోమయమును సంపద్యుక్తము నగు సుఖకర దివ్యవిమానము నొసంగెను. మిక్కిలి యందకత్తెలగు విద్యాధర స్త్రీలు సదా ఆతని సేవలో నుండిరి. అత్యంత సుందరులును. గాన, వాద్య, నృత్యములలోఁ బ్రవీణులగు వేలకొలఁది సురసుందరులగు నప్సరసలాతని నుపాసించుచుండిరి. తనగొప్ప యోగప్రభావముచే నాభోగములన్నిటిని నిష్కామభావముచే భోగించుచు నాతఁడు స్వచ్ఛంద ముగ విహరించుచుండెను. ఆతఁడొక్కొక్కప్పుడు ఇంద్రలోకమునకు బోవును. ఒక్కొక్కప్పుడు వరుణలోకములోని రమణీయ వనములందు సుఖముగ విహరించుచుండును. ఒక్కొక్కప్పుడు గంధర్వలోకమునకుఁ బోయి గానమును వినుచుండును. మఱొకప్పుడు సిద్ధలోకములందానందము ననుభవించును. ఒక్కొక్కప్పుడు సుమేరుపర్వత కందరములందు కిలకిలలాడుచుండును. ఒక్కొక్కప్పుడు గంధర్వులచే భగవల్లీలల ననుకరింపఁజేయును. ఇంకొక్కప్పుడు సుందరవిద్యాధర సుందరులచే శ్రీహరియొక్క సుయశగానమును జేయించి, తాను మిక్కిలి శ్రద్ధతో శ్రవణము కావించును.

ఈ విధముగ నాతఁడు సుఖపూర్వకముగఁ గాలయాపన మొనర్చు చుండెను. ఆతఁడు తనయోగమును, ఐశ్వర్యమును. అవ్యాహతగతినిఁ జూచుకొని కొంచెముగ మదమును జెందెను. భగవద్భక్తుల కెన్నటికిని

మదముండదు. ఒకవేళ నేకారణముచేనైన మదము సంభవించినచో మదహారియగు మధుసూదనుఁ డాతని మదమును వెంటనే నాశము గావించును.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఇప్పుడు విద్యాధరాధిపతియగు చిత్రకేతువుని సిద్ధగంధర్వచారణులవలనఁదన యశమునువినుచు వినువటుఁ దిరుగుచుండెను. ఒక దినమున నాతఁడుతిరుగుచుఁగైలాసము మీదుగాఁబోవుచుండెను. అచ్చట మునిజనగోష్ఠిలోఁ గూర్చుండిన శివుడుఁ కనఁబడెను. శివునకు మర్యాదను బ్రదర్శించుటకై అతడు విమానమును క్రిందకుదించి విమానముమీఁదఁ గూర్చుండియే శివుని దర్శించెను. అచ్చటినుండియే అతఁడు పరిహాసము కావించెను.

శివుఁడు కైలాసపర్వతమందు యొకరమణీయప్రాకృతిక సౌందర్యముతో విలసిల్లుచుండిన శిఖరమందుండెను. చాలమంది సనకాది ఊర్ధ్వ రేతస్కులగు బ్రహ్మచారులు చుట్టును గూర్చుండియుండిరి. తారా మండలమధ్యమున రోహిణి యుక్తుఁడగు రాకాశశాంకునివలె ముని మధ్యమున పార్వతితోఁగూడి కూర్చుండియుండెను. సిద్ధచారణ గంధర్వు లాతని స్తుతించుచుండిరి. భూత, ప్రేత, పిశాచ, డాకినీ, శాకినీ, యక్ష రాక్షస, గంధర్వ, బేతాళంగుహ్యకాది ఉపదేవతలాతని సేవలోనుండిరి. శుభ్రి చితాభస్మముచే నాతఁడు జాజ్వల్యమానముగ సూర్యునివలె వెలుగు చుండెను. జడలలో గంగాదేవి తరంగాయితమైయుండెను. తలమీఁద సన్న ద్వితీయనాఁటి చంద్రుఁడు తిలకముతోఁబాటుగ వెలుఁగుచుండెను.

అతని ఆకంఠము రుద్రాక్ష మాలలచే శోభించుచుండెను. బాజుబందులుండ వలసిన స్థలమునను రుద్రాక్షలుండెను. త్రైలోక్య సుందరియగు షోడశ శృంగారములొనర్చుకొని వస్త్రభూషణాదులచే నలంకరించుకొనియున్న పార్వతీదేవి ప్రక్కననుండెను. భగవానుడు తన యెడమచేతితో నాలింగనము చేసికొనియుండెను. కుడిచేతితో మునుల కుపదేశించుచుండెను. పార్వతి శివుని వక్షఃస్థలము నానుకొనియుండెను. ప్రేమనిమగ్నయై పార్వతి శరీరమును నలనతను జెందించుకొని శంకరుని యంకమందు బ్రహ్మానంద సుఖము ననుభవించుచుండెను. మునులకచ్చట ధ్యానము లేదు ఏలయనఁగా వారర్ధనారీ నటేశ్వరుని యుపాసకులు, వారికి పార్వతీ పరమేశ్వరులకు భేదమేలేదు. ఒకే శరీరములోని రెండంగములని వారి భావన.

శంకరుఁడిట్లుండుటనుగాంచి విద్యాధరుఁడు చిత్రకేతువు సంతోషింపలేదు. శివుఁడు సదాచారము నుల్లంఘించుచున్నాఁడని యాతని భావన. తనయర్ధాంగియగు పత్నినిఁ దనయంకమునఁ గూర్చుండఁబెట్టుకొనుట తప్పుకాదనుట యథార్థమేకాని అందఱముందిట్టి వ్యవహారము శోభింపదు. మహారాజిట్లనుకొని శివునకుఁ బ్రణామమొనర్చి వెడలి యుండిన బాగుండెడిది; కాని అతనికి సమయమున నైశ్వర్యయోగ మదములు చుట్టుముట్టినవి. అతఁడు దేవుని నిండుసభలో దూషింప సాగెను.

అతఁడర్ధనారీశ్వరుఁడగు శివునిఁగాంచి నవ్వుచు జగజ్జననియగు పార్వతి వినునట్లిట్లనెను. ఏ మానవునితోడనో కాదు. ఆకాశమందు

తనకుఁదానే అందఱును వినుచుండ నెవ్వరిని సంబోధింపకయే యిట్లనెను "భలే! చూడుఁడు. భగవన్మాయ యెంతవిచిత్రమైనదో. ఈ శివుని పేరు మహాదేవుఁడు, దేవాదిదేవుఁడు. అనఁగా నతఁడు పశు, పక్షి, నర, దేవతాదులలో సర్వశ్రేష్ఠుఁడుగ నెన్నఁబడుచున్నాఁడు. ఈతఁడు సర్వధర్మములకును నాచార్యుఁడుకూడ. అతని వాక్యములను ప్రమాణముగఁ గైకొనుచుందురు. ఈతఁడు ధర్మప్రవక్త, ఉపదేష్ట, శిక్షకుఁడు. ఈతని పేరు సదా శివసద్గురుడు. ఇంతటి వాఁడైనను నీతని యాచరణము సామాన్య మానవుని యాచరణముకంటె మిక్కిలి హీనముగ జిత్రముగనున్నది. వీండుసభలో నీతఁడు తన భార్యను అంకముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని ఆలింగనముచేసికొని కూర్చుండి యున్నాఁడు.

నేను శివుని నిందిచుటలేదు. ఈతఁడు మహాతపస్వి. తపోమూర్తి. మూర్తీభవించిన ధర్మము. బ్రహ్మవేత్తలలో నగ్రేసరుఁడు. నియమ, వ్రత, జప, తప, సమాధిస్వరూపుఁడు. ఈతని దీర్ఘములగు జడలును, శరీరభస్మమును తపస్యల చిహ్నములే. ఈతఁడు నిండుసభలో సిద్ధ, చారణ, గంధర్వ, దేవతా, ఋషి, మునులును. లోకపాలాదులునున్న సభలో నుచ్చాసనమునమండుటవలననే ఈతని తపస్తేజములు గొప్పవని ప్రత్యక్షముగఁ గనఁబడుచున్నవి. ఈ సభకతడు సమ్మాన నీయుఁడగు సభాపతి. ఇంతవాఁడయ్యు నేలకో ఈతఁడు నిండు సభయందు సాధారణ విషయాభిలాషి, కాముకునివలె నిర్లజ్జుడై భార్యను తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనినాఁడు.

తనకుఁదానే అందఱును వినుచుండ నెవ్వరిని సంబోధింపకయే ఇట్లనెను "భలే! చూడుఁడు. భగవన్మాయ యెంతవిచిత్రమైనదో. ఈ శివునిపేరు మహాదేవుఁడు, దేవాదిదేవుఁడు. అనఁగా నతఁడు పశు, పక్షి, నర, దేవతాదులలో సర్వశ్రేష్ఠుఁడుగ నెన్నఁబడుచున్నాఁడు. ఈతఁడు సర్వధర్మములకును నాచార్యుఁడుకూడ. అతని వాక్యములను ప్రమాణముగఁ గైకొనుచుందురు. ఈతఁడు ధర్మప్రవక్త, ఉపదేష్ట, శిక్షకుఁడు. ఈతనిపేరు సదా శివసద్గురుడు. ఇంతటి వాఁడైనను నీతని యాచరణము సామాన్య మానవుని యాచరణముకంటె మిక్కిలి హీనముగ క్షుద్రముగనున్నది. నిండుసభలో నీతఁడు తన భార్యను అంకముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని ఆలింగనముచేసికొని కూర్చుండి యున్నాఁడు.

నేను శివుని నిందిచుటలేదు. ఈతఁడు మహాతపస్వి. తపోమూర్తి. మూర్తీభవించిన ధర్మము. బ్రహ్మవేత్తలలో నగ్రేసరుఁడు. నియమ, వ్రత, జప, తప, సమాధిస్వరూపుఁడు. ఈతని దీర్ఘములగు జడలును, శరీరభస్మమును తపస్యల చిహ్నములే. ఈతఁడు నిండుసభలో సిద్ధ, చారణ, గంధర్వ, దేవతా, ఋషి, మునులను. లోకపాలాదులనున్న సభలో నుచ్చాసనమునసుండుటవలననే ఈతని తపస్తేజములు గొప్పవని ప్రత్యక్షముగఁ గనఁబడుచున్నవి. ఈ సభకతడు సమ్మాన నీయుఁడగు సభాపతి. ఇంతవాఁడయ్యు నేలకో ఈతఁడు నిండు సభయందు సాధారణ విషయాభిలాషి, కాముకునివలె నిర్లజ్జుడై భార్యను తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనినాఁడు.

మౌనమును వహించిరి. విషయమేమనఁగాఁ బెద్దవారిలో మిక్కిలి గంభీరతయుండును. నూతన సాధకులు నూతన వైరాగ్యము, నూతన రక్తము కలిగియుండుటచే మిక్కిలిగ నెగిరిపడుచుందురు. పెద్దవారి యాచరణమందల్ప విషయమందైనను దనబుద్ధికి కొంచెము విపరీతము కనబడినచో వారిని వ్యంగ్య వచనములఁ బలుకుచుందురు. అనరాని మాటలందురు. నిన్న మొన్నటివరకు వారియెదుట కట్టుగుడ్డలేక తిరిగిన యాతఁడు నేఁడు కొంచెమేదో సిద్ధినిఁబొందఁగానే, ప్రతిష్ఠనుబొంది శరీరము తెలియకుండును. ఆతనికిఁ బరిపక్వదశ రాఁగానే వాని యీ యదరిపాటు, అహంకారము నశించునని పెద్దవారికిఁ దెలియును. అందువలన వారు వ్యంగ్యవచనములకుఁ బ్రత్యుత్తర మొసంగరు నవ్వి వెళ్లబుచ్చెదరు. ఈ న్యాయముచేతనే శివుఁడు చిత్రకేతువు పలికిన పలుకుల కొక్కదానికైనను బ్రత్యుత్తర మీయలేదు. అతఁడసామయిక మగు నరణ్యరోదనము చేసినను ఆతని నుపేక్షించియుంచి నవ్వి యూరకుండెను.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! శివుడాఁతని యవినయ ధృష్టతాపూర్వకమగు ననుచిత వాక్యములను క్షమించెను. కాని పార్వతి యూరకుండునా? సతులగు స్త్రీలు సమస్తమును సహింపగలరు గాని వారిచరిత్రకు సంబంధించిన యనుచిత వాక్యములు పలుకఁబడినా వానిని సహింపఁజాలరు. అందువలనఁ బార్వతి ఆయుచ్ఛృంఖల బాలకునకుపదేశమొసంగ వివశురాలయ్యెను.



## చిత్రకేతువును పార్వతి శపించుట

(౪౩౩)

శ్లో॥ ఏషామనుధ్యేయ పదాబ్జ యుగ్మమ్
జగద్గురుం మంగళ మంగళం స్వయమ్।
యః క్షత్రబంధుః పరిభూయ సూరీన్
ప్రశాస్తి ధృష్టస్తదయం హిదండ్యః॥

శ్రీభాగ॥ ౬ స్కం, ౧౭ అ. ౧౩శ్లో.

సీ॥ ఎవ్వని పదపద్మమింద్రాది విబుధుల
చూడాగ్ర పంక్తుల నడరఁజూచు
నెవ్వని తత్త్వంబు దెలియంగ బ్రహ్మాది
యోగి మానసపంక్తి నోలలాడు

నెవ్వని రూపంబు నేర్పాటుగానక వేదంబు లందందవాదమడుచు
నెవ్వనికారుణ్య మీలోకముల నెల్లఁదనిపి యెంతయు ధన్యతములఁజేయు

గీ॥ నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు
శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గుపల్కిన పాపాత్ముఁ డెల్లభంగి
దండనార్హుండుగాకెట్లు దలఁగఁగలఁడు

శ్రీమదాంధ్ర భాగవతము.

పుత్రుని దండింపవలయునని మాతృదేవి కెన్నఁడు నుండదు. అతని బ్రేమింపవలయుననియు, వానిని దన యుత్సంగమున నిలుపుకొనవలయుననియు, నెల్లప్పుడు నాతని కమల ముఖమును ముద్దిడికొనవలయుననియు, సదా వానివానందమున నుంచవలయుననియు నుండును. తాని బాలకునకు గారాబము హెచ్చి, అతని ఉచ్ఛృంఖలిత పరాకాష్ఠను బొందగానే తల్లికిఁ గోపము వచ్చును. అప్పుడామె దండింపవలసివచ్చును కొరడాను దీసికొని బాది త్రాటితోఁ గట్టివేయుటకును నభినయించును. ఆ రోషమందును నామెకు అగాధప్రేమ నిండియుండును. పుత్రునకనిష్టము కలుగవలయునని ఆమెకు ఉండనేయుండదు. ఇప్పుడొనర్చిన యక్షమ్యాపరాధము నిఁకఁజేయ కుండుటకును, ఆయపరాధమునొనర్చు నలవాటుపడకుండుటకును; నామె కోపపడును అందువలన నామె కోపమును నటించి తాడింపనెంచును. పెద్దలతాడనమందఱకును జిక్కదు. అదృష్టశాలురకే ప్రాప్తించును.

శ్రీశుకుఁడిట్లనెను :- "రాజా ! చిత్రకేతువు సదాశివునిఁ బలికిన పలుకులకు శివుఁడు నవ్వి యుపేక్షించెనుగాని పార్వతి సహింపజాలకపోయెను. ఆమె యెగతాళిగా వ్యంగ్య వాక్యములతోఁ దనను నీచముగాఁ జెప్పుకొనుచు నాతనిఁ దిరస్కారపూర్వకముగ గొప్పవానిఁగజెప్పుచు నాతని వ్యాజ ప్రశంసచేయసాగెను. అంత మరలఁ బార్వతి యిట్లనెను:- "ధన్యాత్ముఁడవు,. నేఁటివఱకు శివునిపై నెవనికి నధికారము లేకపోవుటచే స్వేచ్ఛాచారమొనర్చు చున్నాడు. తనమనస్సునకు వచ్చినట్లు లోకవేదవిరుద్ధాచరణ మొనర్చుచున్నాఁడు. ఇప్పటికి మా

మీఁదఁ గ్రొత్తశాసకుఁడు పుట్టుకొనివచ్చినాఁడు. మాబోటి నిర్లజ్జ, సదాచారహీనుల కీఁతడు ప్రభువు, ఈఁతడు మాచర్యము బాగుచేయ దలఁచినాఁడు. ఈతఁడు శాసకుడు, సంస్కారి. ఉపదేశకుఁడు, ధర్మప్రవక్తకుఁడు, దండవిధాయకుఁడు, అజితేంద్రియులకు సదాచార పథమును బ్రదర్శించువాఁడు.

పార్వతీ సమీపముననే జయావిజయా యను సఖులు చామరములు వీచుచుండిరి. జయకొంచెము ప్రగల్భయగుటచే నామె పార్వతిని శాంతింపఁజేయుచు నిట్లనెను :- "అమ్మా! పోనిండు. భగవానుఁ డేమియు ననలేదు. ఈఁతడు లౌకిక ధర్మము ననుసరించి పలికినాడు."

రోషావేశమున శైలకుమారి యిట్లనెను :- "ఈ మాటలు ధర్మయుక్తములు కానిండు, అధర్మయుక్తములు కానిండు. ఈతఁడే గొప్ప ధర్మాత్ముఁడివలెనున్నాడు. ఈతఁడే సర్వ ధర్మముల నెఱిఁగినట్లను కొనుచున్నాడు. వేదప్రకటన కర్తయును, సృష్టి రచయితయును, అయోనిజుడును, ధర్మప్రవర్తకుండును' అందఱకును బితామహుఁడునునగు బ్రహ్మకు ధర్మమర్మములు తెలియవని శివుఁడాతనియెదుట నిట్టియాచరణ మొనర్చుటలేదా? కమలభవుఁడు శంకరుని యీ యాలోచనము విషయ మాలోచింపలేదా? ఈ నీచుఁడు భృగువుఁకు మించిన తేజస్వియుఁ దపస్వియు నైనాడా? సురాసురలచే నమస్కరింపఁబడుచు, సమస్త లోకములకును వందనీయుఁలై పూజనీయులై పరమయశస్వులై, తపోమూర్తులైన ప్రజాపతులే అంగీకరించిరే. వీరుగాక వశిష్ఠ, పులహ,

క్రతు, అంగిర. అత్రి, మరీచాది బ్రహ్మమానస పుత్రులును, ప్రజా పతులును నీయసవిషయమునెఱుఁగరా ?

ఎదుట బాలరూపమునఁ గూర్చుండిన సనక, సనందన, సనాత సనత్కుమారులు శివునకును నగ్రజులు, అందఱును బూజనీయులు, వందనీయులు ఈతని పూర్వజపూర్వులచేతను నర్చనీయులు. వీరు బాల బ్రహ్మచారులు వీరెన్నడును స్త్రీని స్పృశింపలేదు. శివుని యీ చెయ్దము అనుచితము. సదాచార విరుద్ధమగుచో నిచ్చటవీరు చేతులను జోడించుకొని సభలో వినీతభావముతో నేలఁ గూర్చుందురు ?

సమస్త విద్యల కాచార్యుఁడును, సదాచార ప్రవర్తకుడును, త్రైలోక్యవందితుఁడును బాల బ్రహ్మచారియును, తపోధనుఁడును నగు నారదుఁడు ప్రక్కనే కూర్చుండియున్నాడు. ఈతఁడు సంస్థాపకుడు, భగవదవతారము. సదాశివుని యీ యాచరణము నిషిద్ధమైనచో, మర్యాదా విహీనమైనదగుచో నీ విధముగవచ్చి శివుని నేలప్రశ్నించెదరు? వారు వచ్చి వీరినేల యుపాసించెదరు ?

యోగీశ్వరుడగు కపిలుఁడు జ్ఞానావతారము. కృతయుగావతార మని ప్రతీతి. ప్రపంచములో వీతనిమించిన జ్ఞాని యెచ్చట లభింపఁ గలడు ? ఈతని జ్ఞానములోతును కనుఁగొనిన వాఁడెవఁడు. కామేచ్ఛను, విషయభోగాభిలాషయును, వీతనిని స్పర్శింపవు. ఈతఁడు స్వయముగ వచ్చి శివుని చరణములందు దనమస్తకమునుంచును. ఈతఁడు భగ వానునియొద్ద నుపదేశమును గ్రహించును. ధర్మమర్మములనెఱుఁగును.

శివుఁడు సదాచార చ్యుతుఁడని యీతఁడనుకొనుచో నీతఁడు వచ్చి శివు నకు వందనమేలఁగావించును ? ఈ యోగీశ్వరుఁడు శివునికడకువచ్చి యేల శ్రద్ధాభక్తులతో నుపాసించును ? రాజవంశ ప్రవర్తకుఁడగు స్వాయంభువమను విచ్చటనే యున్నాడు. ఇంకను మన్వంతరాధిపతు లును, మనువులును నిచ్చట నెందరోకలరు. వీరందఱి తండ్రికినిఁ దండ్రియైన శివుని చర్యను వీరెన్నడుఁను ధర్మవిరుద్ధముగ నెంచలేదు. శివునిచర్య దోషపూర్ణమైనదని పలుకుటకొక పరమ సదాచారియు. ధర్మా త్ముఁడునగు క్షత్రియాధముఁడొకడు బయలిదేరి వచ్చినాడు.

మానవుఁడు తానెంతో లోకమంతయునంతే యను కొనుచుం డును. కంటికెట్టి యద్దమును బెట్టికొనిన లోకమంతయు నట్లే కనఁబ డును. ఈతఁడు క్రూరుడగుటచే సర్వత్ర, క్రూరత్వమునేకాంచుచున్నాడు.

జయ యిట్లనెను :- "మహారాణి ! నీ బిడ్డఁడేకదా, వీనిని క్షమించుమమ్మా" భగవతి రోషస్వరూపమున నిట్లనెను :- "క్షమించ దగిన యపరాధమును జేసియుండినచో వీనిని క్షమించియుందును. కాని యీతఁడక్షమ్యాపరాధము నొనర్చినాఁడు. మంగళము లన్నింటికిని మంగళకరమైనవాఁడును. మంగళములకు సజీవమూర్తియు, సమస్త లోక గురుఁడును నీశంకరుని నిశ్శంకుఁడై నిండుసభలో నందఱ సమ్ము ఖమున నవమానించినాఁడు. ఆతని నిందించి కసరినాఁడు. తనప్రభుత్వ మును సాగించినాఁడు. పాపములన్నిటికిని నిష్కృతి కలదుగాని గురు ద్రోహికి నిష్కృతి లేదు. వీనినిప్పుడు క్షమించినచోఁ జూచుచుండఁగనే ఁడవీందఱనవమానించును. ఇట్టియపరాధము నొనర్చినవానిని గోటి

కల్పములవఱకు నరకాగ్నిలోఁ బడవేయవలెను. కావున నీసమయమున వీనిని క్షమించుట హితకరముకాదు. లోకమునకును నహితకరమైనదే కాఁగలదు. వీనికివెంటనేదండములభించుచో నీతఁడును ఘోరపాపనివృత్తిని జెందఁగలఁడు. లోకులును శివనిందవలన నేవిధముగను గల్యాణము లేదని తెలిసికొని జాగ్రత్తగనుందురు. చూడఁగా నీతని శ్రేష్ఠతకెంతటి గర్వమో చూడుఁడు. ఎవని యరుణచరణ యుగళములనుధ్యానించి బ్రహ్మాది దేవతలు తాము కృతార్థుల మనుకొనుచున్నారో అట్టివానియెడల వీఁడు ద్వేషభావమును బెట్టుకొనుచున్నాఁడే. ఇట్టి యభిమాని యగువాఁడు భక్తభయహారియును, అకించనులకు ధనమును, అమానులకు సర్వస్వమునగు నారాయణుని చరణకమలముల సన్నిధినుండ యోగ్యుఁడు కాఁడు. కావున నేను వీనికి శాపమునవశ్య మొసంగెదను."

శుకదేవుఁడిట్లనెను:- "రాజా! పార్వతి యిట్లు పలుకఁగా సభాసదులందఱును నిర్ఘాంతపోయిరి. ఈయశిష్టుఁడును నవినయుఁడునగు విద్యాధరునకు జగదంబిక యేమిశాపము నొసంగునోయని అందఱును భయపడిరి. ఆ సమయమునఁ బార్వతీదేవి యిట్లనెను:- "మంచిది! వత్సా! ఓరీ నీకేమి శాపమొసంగుదునురా? నీవీమాటల నాసురీభావము పఁబలికితివి. అట్టి భావమువలననే నీ బుద్ధి విపరీతమైనది. కావునఁ గొన్నాళ్లు నీవసురుఁడవుగ నుండుము. నీవు మరల నాసురీయోనియందు జన్మింపఁగలవు. అప్పుడు నీవు నీ యిష్టమువచ్చినట్లు దేవతలను నిందింపవచ్చును, ఇష్టమువచ్చినట్లు ద్వేషింపవచ్చును. అసురజన్మ ననుభవించినమీఁదట నీవు శుద్ధుఁడ వయ్యెదవు. వత్సా! నీవిఁక మహాపురుష

లను నిందించు పాపమునకిఁక వడిగట్టుకొనకుండుటకై నేను నీకీ శాపము నొసంగితిని."

శ్రీ శుకదేవుఁడిట్లనెను:— "రాజా! పార్వతీ శాపమును విని సభాసదులందఱును సాధు సాధు అని పలికి దాని ననుమోదించిరి. ఈ శాపమునఁ చిత్రకేతు ముఖము కొంచెమైన మ్లానము కాలేదు. అట్లే ప్రసన్నముఖముతో నుండుట నందఱును గమనించిరి. శాపమును వినఁగానే అతఁడు గంభీరుఁడై తన విమానమునుండి దిగి, అత్యంత నమ్రతా పూర్వకముగఁ బార్వతినిఁ బ్రసన్నురాలుగా నొనర్చుటకై ఆమె పాదములపైఁ బడెను.



## చిత్రకేతువునకు సుఖదుఃఖ సమత్వము

(౪౩౪)

శ్లో॥ ప్రతిగృహ్ణామితే శాపమాత్మనోఽంజలినాంబికే।
దేవైర్మర్త్యాయ యత్ప్రోక్తం పూర్వదిష్టంహితస్యతత్
అథప్రసాదయే నత్వాం శాపమోక్షాయ భామిని।
యన్మన్యసే అసాధూక్తం మమ తత్క్షమ్యతాం సతి॥

శ్రీభాగ. ౬స్కం. ౧౭ అ. ౧౮-౨౪ శ్లో॥

వ. చిత్రకేతుండు విమానంబు డిగ్గివచ్చి యద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె. ఓజగన్మాతా!

భవచ్ఛాపవాక్యంబులట్లి కైకొంటిఁ బ్రాచీనకర్మంబులం బ్రాప్తంబైన సంసారచక్రముచేత నజ్ఞానమోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖ దుఃఖములు నైజంబులై ప్రవర్తిల్లుచుండును. నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము. శాపభయ శంకితుండంగాను జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించుచున్నవాఁడ."

శ్రీమదాంధ్ర భాగవతము.

భక్తుఁడు ప్రభువును మోక్షముకోరఁడు. జననమరణములను నాశనమొనర్చు ముక్తినిఁ గోరఁడు. అతఁడు కోరుకొనునది అచంచల మగు భక్తి ప్రభు పాదపద్మములందును, సుదృఢామరక్తి. అతఁడా ర్తుఁడై తనకిష్టదేవుఁడును, జీవనధనమునగు నాతని పాదపద్మములపైఁ బడి యేడ్చి యేడ్చి యిట్లు ప్రార్థించెను: "ప్రభూ! నాకు వేలకొలఁది లక్షలకొలఁది జన్మములు కలుగుఁగాక, శూకర, శ్వాన, శ్వపచ, చాండాలాది యోనులందు బుట్టుదునుగాక భూమిమీఁద స్వర్గమందు, పాతాళమందు, నరకమంచు నింక దీనికి మించిన దుఃఖములగు లోకముల నుండవలసివచ్చుఁగాక, వీనియన్నిటికిని నేనుసిద్ధము. నా ప్రారబ్ధ సంచి తకర్మలను నాశనమొనర్చుమని నేను నిన్నుఁగోరను. ఆశరణ శరణా! భక్తభయభంజనా! శరణాగత ప్రతిపాలకా! నీచరణారవిందములకడ నా ప్రార్థన మిదియే. నేనీభిక్షనే యాచించుచున్నాను. నేనేజన్మలోనున్నను భక్తుఁడనుగా వలయును. నాకచలమగు నచంచల సుదృఢభక్తి కావల యును. మరణసమయమున నీ చరణ స్మరణముండవలయును." ఈకార ణమున భక్తుఁడెచ్చటికిఁ బోయినను నచ్చటనే వైకుంఠమును సృజించు

కొనును. అతఁడు తాను ధరించుటయేగాక తన సంపద్గులనుగూడ తరింపఁజేయును. భక్తునకు ఘృణాస్పదమైనదేదియును లేదు. అతఁడన్నింటిలోఁ దనయిష్టమూర్తిని దర్శించును. ఇష్టప్రాప్తియే పరమసిద్ధి. అట్టియెడల అసుర, రాక్షస, భూత, ప్రేత, పిశాచ, పశుపక్ష్యాదులలో నేజన్మనైన ద్వేషింప వలసిన పనియేమి కలదు? ఆదియును మన యిష్టదేవుని గృహమే. మనమెచ్చటనున్నను నిష్టదేవుని గృహమందే యుందుము. మనస్సాతనిలోనే తల్లీనమగును. కావున భక్తుఁడు భక్తితప్ప ఇంక దేనినిఁ గోరఁడు. ఎవరైన ననుగ్రహించిరా ద్వేషము లేదు, శపించిరా విషాదములేదు. ఏలయనఁగా నివియన్నియును దైవగతిచేఁ గర్మానుసారముగఁ బ్రాప్తించును. దీనికి హర్షశోకములు చెందవలసిన పనియేమి కలదు?"

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! పార్వతీ శాపమును విని విద్యాధరాధిపతి చిత్రకేతువు వచ్చి ఆమె పాదములపై బడఁగానే అందఱును నాతఁడు భయపడి అట్లుపడినాఁడనుకొనిరి. ఈ భ్రమను బోఁగొట్టుటకై వినీత భావముతోఁ జిత్రకేతు విట్లనెను:- "జగజ్జననీ! అమ్మా! నీ శాపమును సహర్షముగ స్వీకరించితిని. నీవొసంగిన శాపము సఫలమగుఁగాక!"

ఇది వినఁగానే పార్వతి ఆశ్చర్యపడెను. దక్షుని శాపమును సహర్షముగ నారదుఁడొక్కఁడు మాత్రము స్వీకరించెనని ఆమె వినెను కాని యిప్పుడు ప్రత్యక్షముగఁ గనఁబడుచున్నది. అత్యంతాశ్చర్యముతోగిరి

రాజ కుమారి యిట్లడిగెను :- "వత్సా ! నీవు గొప్ప సాహసివే, వర ములను సహర్షముగ స్వీకరించుటను నేననేకము చూచితిని. కాని శాపము నింత సంతోషముతో స్వీకరించినవానిని నేఁటివఱకు చూడలేదు, నీవు నేనొసంగిన శాపమునట్లు గ్రహించితివేల ? నేను నీకు కష్టమే కావించితినిగదా !"

ఇదివిని వినీతభావముతోఁ జిత్రకేతువిట్లనెను:-"అమ్మా! కొడుకు కుపుత్రుఁడు కాఁగలఁడేమో కాని తల్లిమాత్రము కుమాత కాఁజాలదు. నీవు నీసంతానమున కనిష్టమొనర్పవు. నీవిషయము వేఱు. ఎవ్వరు నెవరికి ననిష్టమును గావింపరు. సుఖమును గావింపరు. ఎవ్వరికెవ్వరును బుద్ధిపూర్వకముగ వరముల నీయరు, శాపము నీయరు. పూర్వజన్మమున నెవఁడెట్టికర్మ నొనర్చినాఁడో ప్రారబ్ధానుసారముగ నాతఁడట్టి సుఖదుఃఖ ముల ననుభవించును. శాప, వరముల నొసంగువారు కేవలము నిమిత్త మాత్రులు. లభించునదేదో ప్రారబ్ధానుసారముగ లభించుచుండును. నా కేదో అట్టికర్మ శేషించియుండును. ఇందులో మీదోషమేమున్నది ? నేనెప్పుడే కర్మము జేసియుంటినో తదనుసారముగనే నేనట్టి ఫలమును భోగింపవలసియుండును. ఈజీవుఁడు జ్ఞానమోహితుఁడై సంసార చక్ర మందు, నానాయోనులలో స్వకృత కర్మానుసారముగ సుఖ దుఃఖముల ననుభవించుచుఁ బుట్టుచు గిట్టుచుండును. ఎవఁడెవరికి సుఖదుఃఖము లొసంగఁగలఁడు ? ఫలానివాఁడు దుఃఖపెట్టినాఁడు, ఫలానివాఁడు సుఖ పెట్టినాఁడని వివేకవిహీనుఁడగువాఁడే పలుకుచుండును. అందఱును స్వకర్మసూత్రమున బంధింపఁబడి వివశులై కర్మల నొనర్చుచుందురు."

పార్వతి యిట్లనెను :- "అయినను శాపము శాపమే, వరము వరమే. నీకు నాశాపముచే నిసుమంతైన దుఃఖము కలుగలేదా."

గంభీరుఁడై చిత్రకేతువిట్లనెను :— "అమ్మా ! నాకు దుఃఖమనునది కనఁబడనే కనఁబడుటలేదు. ఇది సంసారరూపమగునది. సత్వరజస్తమోగుణములు ప్రవాహములు. ప్రవాహములోఁ గంటకములు, పుష్పములు, ఫలములు అన్నియునుగొట్టుకొని వచ్చుచుండును. ఇదే విధముగ శాపానుగ్రహ, స్వర్గనరక, బంధమోక్ష, సుఖదుఃఖములు వచ్చుచుఁబోవుచుండును. జ్ఞాని వీనియందు సమభావమునుంచును. వారికి దీనియందు మమకారముండదు. దీని పరిణామమువలన క్షోభమును జెందరు."

పార్వతి యిట్లనెను :- "భగవానుఁడు సదా సర్వదా సత్స్వరూపుఁడు. చైతన్య స్వరూపుఁడు. ఆనంద స్వరూపుఁడు. ఆతనిలోనికి గుణప్రవాహమెట్లు వచ్చినది ?"

చిత్రకేతువిట్లనెను :- "అమ్మా ! భగవానుఁడు గుణముల కధీనుఁడుకాడు. భగవంతుఁడు క్షణక్షణమునకు రంగులను మార్చు మాయాదేవి ద్వారమున సమస్తభూతములను, బంధమోక్షములను, సుఖదుఃఖములను రచించును."

పార్వతియిట్లడిగెను:-"ఆతఁడు తనమాయాచక్రములోఁబడునా?"

దృఢతాత్పర్యమునఁ జిత్రకేతువిట్లనెను - "కాదమ్మా! ఆతనికి చక్ర గిక్రములతో నేమిప్రయోజనము? అతఁడీ బంధమోక్షములకును, సుఖదుఃఖాది ద్వంద్వములకును సదా సర్వదా వేఱుగానున్నాఁడు."

నవ్వి పార్వతి యిట్లనెను :- "అయితే జీవులలో నీవిషమత యేల కనఁబడుచున్నది? దీనినిఁబట్టి భగవంతునకుఁ బక్షపాతమున్నదని సిద్ధాంతమగుచున్నది. ఒకానొకడు సుఃఖము ననుభవించుచున్నాఁడు మఱియొకఁడు దుఃఖదావాగ్నిలోఁ గుమిలిపోవుచున్నాడు. ఒకఁడు ఏడ్చు చున్నాడు. దీనికిఁ గారణమేమి?"

అంతఁ చిత్రకేతు విట్లనెను :- "జగజ్జననీ! నీకన్నియును దెలి యును. అన్నిటికిని మూలకారణము నీవేకదా! భగవంతునిలో విషమతా దోషముండదు. ఆతఁడు సర్వథానిర్దోషుఁడు. ఆతఁడు సర్వత్ర సమాన ముగ వ్యాపించియున్నాఁడు. అతనికిఁ బ్రియులుగాని, అప్రియులుగాని లేరు. వారికి స్వపర భేదములు లేదు. ఆతనికి సజాతీయులుగాని, పరి వారమువారుగాని లేరు. ఆతఁడురాగద్వేషరహితుఁడు. ద్వంద్వాతీతుఁడు. ఈ సాంసారిక సుఖములందాతనికి రాగద్వేషములు లేవు ఒకవస్తువుపై రాగముండినచో నింకొకదాని మీఁద ద్వేషముండితీరును.ఆసక్తిసంగము వలన వృద్ధినిఁబొందును, ఆసక్తిచేతనే క్రోధము పెరుగును. ఇవియేమి యును నాతనిలోలేవు. ఈ జీవులు మాయాకారణమునఁ దమయందు బాపపుణ్యముల నారోపించుకొని సుఖదుఃఖముల ననుభవించుచుండుదురు. దీనిలో వారు హితముకలదు. దీనిలో నహితముకలదు, దీనినొనర్పుటచే

దుఃఖము కలుగును, అట్లుచేయకుండుటచే సుఖముకలుగును. ఇది బంధనము, ఇదిమోక్షము ఇది జన్మ, ఇది మరణము, అనునిట్టి ద్వంద్వ కల్పనమే సంసారమునకుఁ గారణము. ఇవియే సంసృతికి హేతువు"

పార్వతినవ్వి యిట్లనెను :- నీవు మంచిజ్ఞానివిగాఁ గనఁబడుచున్నావు. నీవు భగవన్మాయను జయించినట్లు తోచుచున్నది. అట్టియెడ నీవు నాసమ్ముఖమున దీనత్వమును జూపెదవేల ? నావలన నీకేమి కావలయును ?"

దృఢతాస్వరమునఁ జిత్రకేతువిట్లనెను:- "అమ్మా! నీవన్యథా తలంపకుము. నాకు శాపచింత కొంచమైనలేదు. ఈ సంసార ప్రవాహమందు ఏమిశాపము, ఏమివరము. ఇవి బాలవాక్యములు. దేవీ! నేను నీ సమ్ముఖమున వినయముగ నుండుట భయమువలనఁగాదు. నేను శాపవిముక్తినిఁ జెందుటకు నిన్ను బ్రార్థించుటలేదు. నా వినమును శాపమును దొలగించుమనికాదు. ఈ శాపమొక్కటియే కాదు, ఇట్టి శాపములు సహస్రములకొలఁది లభించినను నేను విచలితుఁడనుగాను. అసురీయోని చెడ్డదా? అసురులలో భగవద్భక్తులులేరా? యోని ఆవరణము మాత్రమే. హృదయమున భగవద్భక్తి యున్నచో నే యోనియైననేమి? నేను పలికిన సత్యవిషయమునకును మీకుఁజెడ్డగాఁ దోఁచినదేయని నేను వినయ వినమ్రుఁడగుచున్నాను. నేనొక శిష్టాచారము ననుసరించి నా బుద్ధికి వచ్చిన సత్యవిషయమును బలికితిని. దానివలన నీకు దుఃఖము కలిగినచో నేను నా వినయమునకు క్షమాపణమును వేడుచున్నాను.

నా మాటలు మీ కనుచితములుగఁ దోచినచో నన్ను క్షమింపుడు. శాప విషయమున నాకు లేశమాత్రమైన భయములేదు."

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఈ విధముగఁ బలికి చిత్ర కేతువు పార్వతీ పరమేశ్వరుల పాదపద్మములకుఁ బ్రణామము కావించి, వారి ప్రత్యుత్తరమునకై ప్రతీక్షింపకయే తమ విమానము నెక్కి వెడలెను. అతని నిస్పృహతను, సమత్వమునుగాంచి సభలోని సభా సదులందఱును జకితులైరి. అందఱును వారివారి మనస్సులలో నిట్లను కొనిరి:- "ఈ విద్యాధరున కెంతటి దృఢనిష్ఠకలదో చూడుఁడు. వీనిబుద్ధి సమత్వమున నుండినది. చూడఁగా నీతఁడు సంకర్షణ భగవానుని ఉపాసనా ప్రభావమున నీ దుష్కర మాయను దరించినట్లున్నది, ఈతఁడు మాయామోహరూపమగు నగాధసాగరమును దాటినట్లున్నాడు. అందు కనియే యింతటి శాపమును వినియు నీతని ముఖము మ్లానముకాలేదు. భ్రుకుటియందిసుమంతైన వికృతి లేదు."

పార్వతీదేవియును జకితయయ్యెను. ఆమెకిది యాశ్చర్యకరమగు విషయమయ్యెను. ఆమె శివుని శ్రీముఖమును రహస్యమయదృష్టితోఁ జూచుచు నట్లేయుండెను. సర్వాంతర్యామియగు శివుఁడామె మనోభావ మును గ్రహించి, నవ్వుచు నామెకు భగవద్భక్తుల మహత్వమును జెప్ప సాగెను.



# శివుఁడు భగవద్భక్తుల మహత్త్వమును జెప్పుట.

(౪౩౫)

శ్లో॥ దృష్టవత్యసి సుశ్రోణి హరేరద్భుత కర్మణః।
మాహాత్మ్యం భృత్యభృత్యానాం నిఃస్పృహాణాం మహాత్మనామ్।
నారాయణ పరాః సర్వే నకుతశ్చన బిభ్యతి।
స్వర్గాపవర్గ నరకేష్వపి తుల్యార్థదర్శినః॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౭ అ. ౨౭-౨౮ శ్లో॥.

వ॥ పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షి దైత్యదానవ ప్రమథ గణంబులు వినుచుండఁ బార్వతికిట్లనియె- "నీకు నిప్పుడు దృష్టంబయ్యెఁగదా నారాయణ దాసదాసానుచరుల నిస్స్పృహభావంబు హరి తుల్యార్థదర్శకులై నిస్స్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు.

శ్రీ మదాంధ్ర భాగవతము.

దేశ రాజ్యమునంతయును బొంది సమ్రాట్టైనవాఁడు సింహాసనమునఁ గూర్చుండినను, తన రాజ్యములోని నదీవాలుకమందు కూర్చున్నను సమ్రాట్టే. అతని కెచ్చటను దుఃఖములేదు. తన రాజ్యములో నెచ్చట నున్నను నాతని కవమానముండదు, తిరస్కారముండదు, అతనికిఁ దనరాజ్యమంతటను సమభావమే. తన రాజ్యములో రాజునకేబుద్ధి యుండునో అదియే రాజపుత్రునకుండును. అతఁడును రాజ్యాధికారియే. రాజ్యములోని ప్రతివస్తువును నాతఁడు తనదిగ భావించును. అతని రాజ్యములో బంగారుగని యుండిన దానిని తనదనును బొగ్గుగనియుండి

నపు ధావియందును నాతవి కంతటిమమత్వమేకలదు. తనవస్తువు చిన్నది కావిండు, పెద్దదికావిండు, మంచిదికానిండు చెడ్డదికానిండు తనదే. ఆదేవిధముగ భగవద్భక్తులీజగత్తును శ్రీహరి లీలాస్థలముగ భావించెదరు, స్వామియిచ్ఛకు విరుద్ధముగనే వస్తువుమండదని వారి నిశ్చయము. అన్నిం టికిని బతియగువాఁడు మనస్వామియే. మనమాతని కేకైక ఉత్తరాధి కారులము. ప్రధానదాయభాక్కులము. మనస్వామి వస్తువులన్నియును మనవే. మనస్వామి మనల నెచ్చటమంచినను ఆనందమే. అదియే మనగృహము. మనము మనస్వామిని మఱవకుండినచో. స్వామిని మఱచి మనమే సమస్తమని తలఁచుచు నిజత్వ పరత్వ భేదభావములను స్థాపించినచో మనము సుఖదుఃఖములను బొందవలసియుండును.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! విద్యాధరాధిపతియగు చిత్ర కేతువు విషయమును వినియుఁ బార్వతియెడలఁ గ్రోధమును జెందక, పైఁగా క్షమాపణమును గోరి, శాపవిముక్తినిఁగోరకయే శ్రద్ధాపూర్వక ముగఁ బ్రణామమునాచరించి నవ్వుచు వెళ్లఁగాఁ బార్వతి విస్మితయై యుండఁగాజూచి నవ్వుచు శంకరుడిట్లనెను:- "పార్వతీ! చూచితివా భగవద్భక్తుల మహాత్మ్యము? ఇప్పుడైనను నర్థమైనదా? ఇప్పుడు నీ క్రోధము శాంతించినదా?"

కొంచెముగ లజ్జించి హైమవతి యిట్లనెను:- "ఏమిచెప్పెదను స్వామీ! ఈశ్వరలీలల నెఱుఁగఁదరమే. ఈతఁడే దేవుని భక్తుఁడు?"

శంకరుఁడిట్లనెను:- "దేవీ! ఈతఁడు భగవద్భక్తుఁడే, కాని

భగవంతునికంటె నధికులగు భగవద్భక్తుల భక్తుఁడు, దాసానుదాసుఁడు. నారదాంగిరస మునులకు జరణసేవకుఁడు. భగవద్భక్తి బ్రాప్తించిన వానికి సాంసారికవస్తు స్పృహయుండదు. అతఁడు సర్వదా నిస్పృహుండుగనుండును. అతనికి స్వర్గ నరకములు రెండును సమానములు. అతడు ప్రపంచములోని యేదుఃఖమునకును, నేవ్యక్తికిని భయపడఁడు. పైఁగా భగవంతునైనను నిర్మొగమోటముగ ననును. భగవంతుఁడు ముక్తినిఁగైకొని అతని సమీపమునకుఁ బోయినచో నిర్భీతుఁడై యిట్లనును.- "మాకు ముక్తి అక్కఱలేదు. మాకు బంధనముకంటె ముక్తి పసందైనచో, మాకు బంధముక్తులందు భేదబుద్ధి యుండినచో బంధనమునువదలి ముక్తిని గ్రహింపవచ్చును. మాకట్లుకాదు. మాకు బంధముక్తులు రెండును నొక్కటే, జన్మలుండిన నుండనిండు. నరకమునకుఁ బోవలసి వచ్చినచోఁ బోవుదుము. భగవానుఁడు బలవంతముగ ముక్తినొసంగినను వారు గ్రహింపరు, అతఁడు భగవద్భక్తులను గాంచి భయపడుచుండును. భగవద్భక్తులయెడల నపరాధము సంభవింపకుండు నట్లు చూచును. అతఁడు సదావిష్ణుభృత్యులకు భృత్యుఁడగుచుండును. నీవు కుపితవై రాజర్షియగు నీ చిత్రకేతునకు శాపమొసంగితివి అతఁడు సామర్థ్యము కలవాఁడు. తలఁచుకొనిన మరల నిన్ను శపింపఁగలఁడు. కాని అతఁడట్లు చేయలేదు సరికదా నీకనునయ వినయములు కావించినాఁడు. ఏలయనఁగా నేను వైష్ణవుఁడను. నీవు నా సహధర్మచారిణివి. ఇతరుల దోషములను జూచుచయట్లుంచుఁడు వారి దోషములను జింతింపనైనఁ జింతింపరు. భగవద్భక్తులకు సంకోచమును గలిగించు నేపని

యును జేయరు. వారిదోషములు ప్రత్యక్షముగఁ గనఁబడుచున్నను నెవరికిని జెప్పరు. సరిగదా యింకను సమర్థించెదరు."

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా ! ఈ విషయము మాకర్థము కాలేదు. దోషములు లేకున్నను నీర్ష్యావశమున నారోపించి వారిని నిందించుట మహాపాతకము కాని దోషములు ప్రత్యక్షముగఁ గనఁబడుచుండఁ జెప్పినచో దోషమేమియుమండదే. పాపుల పాపములను ఖండింపక పైఁ భక్తులు వారిని సమర్థించుట యనునది బుద్ధికి అందుటలేదు. అట్టి యెడల విచ్చలవిడిగఁ బాపములొనర్చెదరుకదా ! సమాజములో దురాచారములు వ్యాపింపకుండుఁనట్లు పాపియొక్క పాపములను గూర్చి బాగుగా నాలోచింపవలసి యుండును. సమాజము బాగుపడవలెను సదాచారము కాపలెను."

అంతసూతుఁడిట్లనెను :- "స్వామీ ! అందఱి యధికారములు వేఱు వేఱుగ నున్నవి. అందఱు వందఱకార్యము లొనర్చుచో సమాజమందు సంకరత వ్యాపించును. రాజు ప్రజల దోషములను జూడవచ్చును వారికి దండనమును విధింపవచ్చును. శాసకునకుఁ బ్రజలను శాసించుటకును, వారి అపరాధములకు దండమును విధించుటకును నధికారము కలదు. ఆచార్యుఁడు శిష్యుల దోషములనుగాంచి ధర్మానుసారముగ వారికి బుద్ధినిఁ జెప్పవచ్చును. తండ్రి పుత్రుల దోషములనుగాంచి తాడన మొనర్పవచ్చును. చెడ్డ అలవాటుపడినవారి దోషములనుగాంచి మనము వెల్లడింపఁబూనుకొను నెడల నేమి ప్రయోజనము. వారు చాటుగఁ

చేయుదురు. చెప్పిన వినరు. పైఁగా నిందిచినచో వారి సంస్కారములు మన మీఁద బడును. వారి పాపములను జింతించుటచే మనభావము లందును ఆ పాప పరిమాణువులు ప్రవేశించును. భక్తుఁడు తానెన్న డుఁను సంఘసంస్కర్తయని యనుకొనఁడు. తన్నుఁదాను బాగుచేసి కొనినఁ జాలునని యాతఁడనుకొనును. అందఱు నిట్లనుకొని తమ్ముఁ దామువంస్కరించుకొనుచో సమాజ సంస్కరణము దానికదియేజరుగును. ప్రతివారు తమ్ముఁదాము సంస్కరించుకొనకయే, యితరులను సంస్క రింప బరువిడుచుందురు. ప్రతివారును దన హృదయముపైఁ జేయి వేచుకొని తనమనస్సును వశపఱచు కొన్నదియు లేనిదియు ఁజూచుకొన వలయును. అట్టివారెన్నడును బొరపాటునకైన వాసనకు వశీభూతులై సదాచార విరుద్ధమగు కార్యము నెన్నడును నేసనియును జేయరు. ఇట్లు చేయఁజాలనివారు ఇతరులను నిందించుటవలన నేమిలాభము? మనము ప్రత్యక్షముగ మన జీవితములో ననుభవించుచున్నాము. పర స్త్రీపై దృష్టిసారించుట ఘోరపాపమని మనకుఁ దెలియును. చేతనైనంతవఱకు తప్పించుకొనుటకుఁ బ్రయత్నింతుము, కాని సంయోగవశముచే నకస్మా త్తుగ మనకిష్టము లేకున్నను మన మనస్సు చంచల మగుచుండును. మనము మనమనస్సునే స్వాధీన పరచుకొనలేక, కుపథమునఁ బోవు టకును విరోధింపకున్నచో మనమితరుల వలన నెట్లాశింపగలము? ప్రతివారు నిందకు భయపడుదురు, కాని వాసనకు వశీభూతులరై చేయ రాని పనులను చేయుచుందురు. భక్తులు వారిని నిందించుట యనుచితమని వారు భావింపరు. భక్తునకు సంకోచముండకుండుటకై దానిని సమర్థించు

అతనికి సాధుసేవా వ్యసనముకలదు. ఎట్టి సాధువు వచ్చినను అతనికి బాగుగా సేవమొనర్చుచు ససంతుష్టులఁ గావింపకుండెడువాఁడు. ఒక దినమున సాధుసంతర్పణ జరుగుచుండెను. వారిలో నొక భంగుసుబీల్చు సాధువును గూర్చుండియుండెను భంగుమత్తులో నాతఁడధికముగఁ బ్రసాదమును గైకొనుచుండెను. భోజనమునకు పూర్వమే అతఁడు భంగుముద్రావి ఆ మత్తులోఁ దినుచుండును. వడ్డించువారందఱకును బరిమాణము ననుసరించి వడ్డించుచుండిరి. ఆప్పుడు వారు రెండాకులను వేఱువేఱుగ నుంచిరి. వడ్డించుసాధువు ఈతని ముందున్న విస్తరిపై వడ్డించెను కాని రెండవ విస్తరిపై వడ్డింపలేదు. దానిమీఁదఁగూడ వడ్డించుమని యీ భంగుత్రాగు సాధువనెను.

అతఁడిది యెవరివిస్తరని యడిగెను?

భంగుబాయి యిట్లనెను;- "భంగుయొక్క విస్తరి. ఇది నాకంటె నెక్కువగఁ దినును.

వడ్డించు సాధువునకుఁ గోపమువచ్చి యిట్లనెను:- "సాధువుల పంక్తిలో సాధువులకే విస్తళ్ళు వేయబడును. భంగుకు, లంగోటీలకు విస్తళ్ళుండవు." ఇట్లువలికి అతడు వడ్డించుచు వెడలిపోయెను.

ఆశ్రమాధిపతియగు సాధువు రాఁగానే భంగుమత్తులో నా సాధువె ఎంగిలివిస్తరిని దీసి ఆతని ముఖమునకు వైచికొట్టి యిట్లనెను:- "నీవు సాధుసేవ చేయునట్లేనా? నాకు బ్రసాదమొసంగి నాభంగున కుపవాస మొనర్చెదవా ?"

ఇట్లు జరిగినప్పటికిని సాధువు చేతులుజోడించుకొని, ఆ విస్తరి పై చిన ప్రసాద కణములను మెతుకుబొతుకు ఏరుకొని తన వస్త్రమున నుంచుకొని మిక్కిలి ప్రేమతో నిట్లనెను:- "నేఁడు నాభాగ్యమే భాగ్యము. సాధువులు కృపతోఁదమ యుచ్ఛిష్ట ప్రసాదమును బ్రసాదించినారు." ఆతఁడీ విరుద్ధపు వాక్యములను వినఁగానే వడ్డించువానినిఁ బిలిచి, ఆతనికి నీతులను గఱపి, అతనిచే క్షమాపణము వేడించి, వడ్డనకార్యము నుండి తొలగించెను. ఇదియేసాధుత్వముయొక్క ఆదర్శము. ఇప్పుడొక సాధువు పొరపాటున తప్పుచేసిన మనముకోపించి వేనకతప్పేల చేయవలెను? అతనితప్పు పెద్దదే యగుకాక కాలాంతరమున నాతఁడు తనపొరపాటును దెలిసికొనఁగలఁడు. సాధుత్వమువలనఁ బడిన ప్రభావము క్రోధమునఁ బడదు. భంగుమత్తు తెలిసినమీఁదట నీ సంగతిని దెలిసికొని, తర్వాత భంగుత్రాగుటను మా నివై చినట్లు వినుచున్నాము.

ఇట్టిదే యింకొక సంఘటనము జరిగినది. ఒకసారి ఒక మహోత్సవమున సాధు సంతర్పణము జరిగెను. దూరదూరములనుండి సాధువులు విచ్చేసిరి. అందఱును పూరియిండ్లలోఁ దమ యాసనములను పఱచుకొనిరి. మహంతు అందఱను దర్శింపఁబోయెను, ఒక ముసరి సాధువునకు ధూమపాన మొనర్చు వ్యసనముండెను. అతఁడు మంజి చిలుమును దెచ్చుకొని రెండుగ్రుక్కలు పీల్చునప్పటికి మహంతు వచ్చుటను గాంచెను. ఆతఁడు వెంటనే హుక్కాను దాచెను. ఆతఁడు వేగముగ నా సాధువులకడకువచ్చెను. అటునిటు రెండు మాటలు మాట్లాడి కడుపుపట్టుకొని యిట్లనెను:- "కడుపులో నొప్పిగానున్నది యేమిచేయ

మీరాసాధువునకట్టి యనుచిత కైంకర్యమును ఒక్పజెప్పితిరేల? అతఁడు స్వామియొక్క నీటిబిందెను నెత్తికిఁ బెట్టుకొని నిలుచుండియే లఘు శంకము గావించినాఁడు."

ఆ సాధువట్లు చేయఁజాలఁడని ఆచార్యుఁడనుకొని దీని కాశ్చర్యమును జెందెను అతఁడీ విషయమునే మాటిమాటికి నాలోచించుచుండెను. చాల ఆలోచించి ఆచార్యుఁడాతని నందఱ సమ్ముఖమునకుఁ బిలిపించి యిట్లనెను:- "నీవు భగవానుని సేవాజలమును గైకొని వచ్చుచు దానినిఁ దలమీఁదనుంచుకొనియే నిలుచుండియే లఘుశంకను గావించితివని యీ వైష్ణవుఁడు చెప్పుచున్నాఁడు నిజమేనా?"

చేతులు జోడించుకొని అందఱ సమ్ముఖమున నమ్రతా పూర్వకముగ లజ్జితుఁడై సాధువిట్లనెను:- "అవును" స్వామీ! ఈ మాట సత్యమే. నేనట్లుచేసితిని. వైష్ణవుఁడబద్ధమాడఁడు."

ఆచార్యుఁడాశ్చర్య చకితుఁడై యిట్లడిగెను:- "నీవిట్లు సదాచార విరుద్ధమగు నాచరణమేలఁ గావించితివి?"

తలవంచుకొని. కన్నులనీరునించుకొని సాధువిట్లనెను:- ప్రభూ! నేను పశువును. పశువొనర్చిన యనుచితమును స్వామి గమనింపఁడు. పశువునకు శౌచాశౌచ వివేకముండదు. భగవంతుని దివ్యదేశముయొక్క ఏఱుఁగుమీఁద భగవదభిషేకము కొఱకు జలము నిత్యము వచ్చుచుండును. జలమును గైకొని వచ్చునపుడు దానిలో లఘుశంకయును, దీర్ఘ

శంకయు నొనర్చెను. పశువగుటచే దాని యశౌచమువైపున కెవ్వరును జూడరు. నేనును ద్విపాత్పశువును. నరపశువును. అపరాధములొనర్చుట నా స్వభావము. మీరు గురుజనులు కావున క్షమించుట మీ స్వభావము. నాయపరాధమును క్షమింపుఁడు."

సూతుఁడిట్లనెను:- మునులారా! దీని పేరే సాధుత్వము. పిశునుఁడు, అపకారి వీరియొక్క దోషములను బ్రకటింపక తన దోషములనే చూచుకొనుట వైష్ణవత్వముయొక్క లక్షణము. తన విద్యా ప్రభుత్వ, భక్త్యభిమానములను జెందరాదు. ఇట్లు భావించి నేనందఱకు దాసుఁడనైనాను. రాజర్షియగుఁ జిత్రకేతుని మదము స్పర్శింపనే స్పర్శింప లేదు, అందువలననే లోకగురుఁడగు శివున లక్ష్యమొనర్చుకొని సత్యము లగుటచే నవరాని మాటలననెను శివుఁడాతని భావమును గ్రహించి నవ్వి యూరకుండెను కాని స్త్రీ స్వభావవశతచే నంబిక సహింపఁజాలక క్రోధో ద్రిక్తయై అతని శపించెను. మహాభాగవతుఁడును రాజర్షియునను చిత్ర కేతువు పార్వతికి శాపమునకు బదులు శాపమొనర్చుటకు సమర్థు లయ్యును. శక్తిగలిగియుండియు నాతఁడట్లు శపింపక సహర్షముగ శిరసావహించి పైఁగా శైలసుతను స్తుతించి క్షమింపవేఁడుకొనెను. ఇదియే సాధుతా లక్షణము. సాధువు తనకారణమున నెవరిని సంకో చమునఁ బడనీయఁడు. ఈ విషయమున నొకభక్తుని దృష్టాంతమును వినుఁడు."

ఒక గొప్ప సాధుసేవియును సదాచారియునగు సాధువుండెను. అతనికి ధూమ్రపానాది వ్యసనమును లేదు, సంసారేచ్ఛయును లేదు.

కొనుచుందురు. వారు భయభీతులు కాకుండుటకై వారట్లు చేయుదురు. ఈ విషయమున మీకు నేనెక పరమసుందరమగు వైష్ణవ భక్తుని మనోహర దృష్టాంతమును వినిపించెదను.

ఒక వైష్ణవాచార్యుఁడుండెను. అతనిదగ్గర అతనికి శరణాగతి యొనర్చిన భగవద్భక్తులుండిరి. చాలమంది అతనిచే దీక్షను స్వీకరించిరి. వారిలో గొప్ప సాధుసేవియుఁ, బరమ నిష్ఠ కలవాఁడునగు సాధువొకఁ డుండెను. ప్రతిదినము భగవత్సేవకొఱకు కావేరీ పుణ్యసలిలములను దేవలసినదని గురు వాజ్ఞాపించెను. అతఁడీ కైంకర్యమును మిక్కిలి శ్రద్ధాభక్తులతోఁ జేయుచు సాధువులందఱ యెడల నీశ్వరబుద్ధినుంచెడు వాఁడు. అతఁడెన్నడు నేవైష్ణవుని నిందించెడువాఁడు కాఁడు. వారి దోషములను గాంచ యత్నింపడు. వీరందఱును దనస్వామికి అనురూప స్వరూపులని భావించును. ఒకసారి యాతఁడు కావేరి నుండి జలకలశమునుగొని వచ్చుచుండెను. దారిలోఁదమకు సంబంధించిన యొక వైష్ణవుడు జలముగై కొనకయే ల ఘు శ ం క ను జరుపుటను గాంచెను. వైష్ణవులు లఘుశంకకు బోవుట గొప్ప దోషము. ఎన్ని మారులు శౌచమునకుగాని, లఘుశంకకుఁగాని బోయినన్నిసారులు స్నానముచేయవలయుననికలదు. స్నానము లనేకవిధములు. ధర్మ స్నానము, మంత్రస్నానము, పంచస్నానము, వస్త్రస్నానము. ప్రతిసారి శరీరమంతయును స్నాన మొనర్చుట కఠినము. కావున లఘుశంకకుఁబోయిన వీరు గై కొని పోవలయును. వచ్చి మూఁడుసార్లు చేతులను

గడుగుకొని పాత్రనుదోముకొని. చేతులు, కాళ్ళు, ముఖమును గడుగు కొని మూఁడుసార్లు పుక్కిలించిన నిది పంచస్నానమగును, అప్పుడు శుద్ధియగును. ఆ వైష్ణవుఁడు లఘుశంకకొఱకు జలమును దీసి కొని పోలేదు. అందువలన నాతనికి మిక్కిలి సిగ్గువైచెను. ఈ సాధువుపోయి ఆచార్యులవారికిఁ దన యపరాధమును నివేదించునేమోయను శంకయును గలిగెను. అందువలన నాతఁడు కొంచెము భయపడెను.

ఆ సాధువీతని భావమును గనిపట్టెను. ఒకానొక సాధువు నా మూలకముగ వ్యర్థముగ లజ్జింపవలసి వచ్చినదని అతనికి మిక్కిలిగ మానసిక దుఃఖము కలిగెను. అతని సంకోచము దూరమగుటెట్లు" ఇట్లాలోచించుకొని అతఁడు శిరస్సుపై ఘటమును బెట్టుకొని అచ్చటనే నిలుచుండి లఘుశంకచేసెను."

మన మీతనికంటె నెక్కుడేనని ఆ వైష్ణవునకు సంతోషము కలిగెను. ఈతఁడు మనలను మించినవాఁడే. భగవంతుని కొఱకు నీరు తీసికొనిపోవుచున్నాఁడు నిలుచుండి మూత్రమును విడుచుచున్నాడు. ఇది వైష్ణవత్వమేనా?" అనియాలోచించుకొని సంతోషమున నాతఁడు వెడలెను.

ఇచ్చట నీ సాధువు మరలఁ గావేరికి వచ్చెను. వచ్చి సచేల స్నానమాచరించి, బిందెను దోముకొని మరల నీరు దీసికొని పోయెను. అ వైష్ణవుఁడెట్లుండెనో అట్లే యుండెను. అతఁడు తన స్వభావాను సారముగ నీ విషయమును నాచార్యచరణులకిట్లు నివేదించెను:- "స్వామీ!

వలెను." అని బాధను నటించుచు నా ముసలిసాధువుయొక్క ఆసనము పై గూర్చుండి యిట్లనెను:- "రెండుగుక్కలు హుక్కా-దొలకిన జాలును. నానొప్పి శాంతించును." అతని శిష్యు లాశ్చర్యచకితులైరి. స్వామి వారు తమాలపత్రమును దాఁకనేతాకరే నేఁడు ధూమపానేచ్ఛ నేల చేయుచున్నారు? "ఇంతలొ నా వృద్ధుఁడిట్లనుకొనెను:- "ఈతఁడును ధూమపాన వ్యసనియే. ఇంకేమి హానికలదు?" వెంటనే ఆతఁడు దానియుంచిన హుక్కానుదీసి యిచ్చెను. "స్వామీ! ఇప్పుడే నింపి యుంచితిని."

మహంతు సంతోషమున నిట్లనెను:- "మంచిది, తెమ్ము" అని పలికి అటునిటు రెండుసార్లు ఊది యిట్లనెను:- "ఇదిగో తీసికొనుఁడు. మీరు త్రాగుఁడు." ఆ సాధువు త్రాగెను. మహంతు వెడలి పోయెను.

తరువాత నామహంతుయొక్క సాధుత్వముగూర్చి తెలియఁగానే, ఇది యెవరికి దుఃఖము కలుగకుండుటకై చేసిన యభినయమని గ్రహింపఁగానే ఆతని సరళతాసాధుత్వములచే ధూమపానమును వదలెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! క్షమయొక్క సహనశీలతవలన దండమునకంటె నెక్కుడు ప్రభావముపడును. చిత్రకేతువును పార్వతిని గోపించి శాపమొసంగియుండినచో నదినైతిక దృష్టిచే బాగున్నప్పటికిని సాధుతకు విరుద్ధమైనది. సమర్థత యుండియు సహించుటయే సాధుత్వము

యొక్క సర్వశ్రేష్ఠ లక్షణము. ఈ విషయమును దెలుపుచు శివుఁడు పార్వతితో నిట్లనెను:- "దేవీ! దీనిచే నీవు నేర్చుకొనుము. భక్తుల మహత్వమును దెలిసికొనుము. భగవత్పరాయణులకు శాపానుగ్రహములును, స్వర్గనరకములును, సుఖదుఃఖములును సమానములే."

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! శివుఁడిట్లు పలికి యూరకుండ లేదు. ఆతడింకను విష్ణుభక్తుల మాహాత్మ్యమును చెప్పఁదొడఁగెను. దానినిగూడ మీకు తరువాతఁ జెప్పెదను. మీరు సావధానముగ శ్రవణ మొనర్పుఁడు.



# వృత్రచరిత్ర సమాప్తి

శ్లో॥ జజ్ఞే త్వష్టుర్దక్షిణాగ్నౌ దానవీం యోని మాశ్రితః।
వృత్ర ఇత్యభి విఖ్యాతో జ్ఞానవిజ్ఞాన సంయుతః॥
ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి।
వృత్రస్యా సురజాతేశ్చ కారణం భగవన్మతేః॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౭ అ. ౩౮, ౩౯ శ్లో!

వ॥ అట్లు శాపహతుండయిన చిత్రకేతుండు త్వష్టసేయు యజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుండన విఖ్యా

వలెను." అని బాధను నటించుచు నా ముసలిసాధువుయొక్క ఆసనముపై గూర్చుండి యిట్లనెను:- "రెండుగుక్కలు హుక్కాదొరకినఁ జాలును. నానొప్పి శాంతించును." అతని శిష్యు లాశ్చర్యచకితులైరి. స్వామి వారు తమాలపత్రమును దాఁకనేతాకరే నేఁడు ధూమపానేచ్ఛ నేల చేయుచున్నారు? "ఇంతలో నా వృద్ధుఁడిట్లనుకొనెను:- "ఈతఁడును ధూమపాన వ్యసనియే. ఇంకేమి హానికలదు?" వెంటనే ఆతఁడు దానియుంచిన హుక్కానుదీసి యిచ్చెను. "స్వామీ! ఇప్పుడే నింపి యుంచితిని."

మహంతు సంతోషమున నిట్లనెను:- "మంచిది, తెమ్ము" అని పలికి అటునిటు రెండుసార్లు ఊది యిట్లనెను:- "ఇదిగో తీసికొనుఁడు. మీరు త్రాగుఁడు." ఆ సాధువు త్రాగెను. మహంతు వెడలి పోయెను.

తరువాత నామహంతుయొక్క సాధుత్వముగూర్చి తెలియఁగానే, ఇది యెవరికి దుఃఖము కలుగకుండుటకై చేసిన యభినయమని గ్రహింపఁగానే ఆతని సరళతాసాధుత్వములచే ధూమపానమును వదలెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! క్షమయొక్క సహనశీలతవలన దండమునకంటె నెక్కుడు ప్రభావముపడును. చిత్రకేతువును పార్వతినిఁ గోపించి శాపమొసంగియుండినచో నదినైతిక దృష్టిచే బాగున్నప్పటికిని సాధుతకు విరుద్ధమైనది. సమర్థత యుండియు సహించుటయే సాధుత్వము

నీ బాహ్యశరీరాకృతి మీఁద నేవిధమగు మహత్త్వము నారోపించుకొనరు. ఏ జన్మమైననేమి? మనస్సు భగవంతునిపై నిల్చినఁజాలును. అన్నియును మంచివే. అందువలననే విద్యాధరాధిపతియగు చిత్రకేతువునకు అసుర శరీరము వచ్చినను దుఃఖింపలేదు. అచ్చటను నాతఁడేదోవిధముగ భగవద్భక్తుఁడయ్యెను.

శంకరుఁడు పార్వతీదేవితో నిట్లుచెప్పుచున్నాడు :- "పార్వతీ! భక్తులదృష్టిలో ద్వైతముండనే యుండదు. వారు సర్వత్ర సర్వజ్ఞుఁడును సర్వ వ్యాపకుఁడునగు తమ స్వామినే చూచుచుందురు. స్వర్గముకానిండు, నరకముకానిండు, దేవయోనికానిండు, కీటపతంగయోని కానిండు, ప్రయాగ కానిండు, మగధకానిండు. సర్వత్ర ఆతనికి సమబుద్ధియే యుండును. ఎవ్వడును సుఖదుఃఖముల నొసంగఁ జాలఁడనియును, స్వేచ్ఛచే నెవ్వడును శాపము నొసంగఁజాలఁడనియు, దనకు దానను గ్రహింపఁబడ సమర్థుఁడు కాఁడనియు, జీవులకుఁగలుగు సుఖదుఃఖములు, జననమరణములు, శాపానుగ్రహములను నీద్వంద్వములు భగవంతుని లీలలచేతనే, దేవతిర్యగాది దేహసంయోగాదులచేతనే జరుగుచుండునవియు, ఆత్మయందు దేవ, మనుష్య, పశుపక్ష్యాది బేధభావము లేదనియు, ఆత్మ అందఱియందు సమానరూపమున వ్యాపించి యున్నాఁడనియు భావించును.

అంత బార్వతి యిట్లడిగెను:- ప్రభూ! ఆత్మ అందఱిలో సమానరూపముగనున్నచో వీరు దేవతలు పూజనీయులు వీరసురులు

ఆవాదరజేయులను బేధభ్రమ యేలకలుగుచున్నది. అందఱును దేవతలను శ్రేష్ఠులనుటయేల, అసురలను నిందింప నేల ? ”

అంత శివుఁడిట్లనెను:- “ప్రియా! ఇది వ్యావహారిక విషయము. యథార్థమున కాత్మయందణుమాత్రమైనను భేదభావములేదు. స్వప్నమందు సుఖదుఃఖ ప్రతీతి భ్రమచే నెట్లుకలుగుచున్నదో, మేల్కొన్నను జీఁకటిలో నెదుటనున్న మొద్దునుజూచి భూతమనుకొనినట్లును, వంకరగాఁబడియున్న త్రాడునుగాంచి సర్పభ్రమను జెందినట్లును, దూరముననుండి కొయ్యయేమఁగునుగాంచి నిజమగు నేనుఁగని భావించినట్లును నజ్ఞానమున నీభ్రమ కలుగుచుండును. నిద్రను మేల్కొని స్వస్థుఁడు కాఁగానే యీ భేదభావమంతయును బోవును. భక్తుఁడు భగవంతుని పార్శ్వవర్తియే యగుటచే నాతనికీ భ్రమకలుగదు. ఆతఁడు భక్తినే ప్రధానముగ భావించును. వాసుదేవుని భక్తులు నిర్భయులై యుందురు. ప్రపంచమున భగవంతుఁడుతప్ప వారిబుద్ధికి వేఱు ఆశ్రయము కనఁబడదు. సూకరమైనను భక్తి ప్రాప్తించెనా అది శ్రేష్ఠమే కాఁగలదు. దేవతా జన్మలోనైనను నది లేకుండెనా అది నష్టమైనదే కాఁగలదు.“

అంత శౌనకుఁడిట్లడిగెను:- “సూతా ! శ్రేష్ఠమైన జన్మలలో శ్రేష్ఠత్వముండనే యుండును.”

శీఘ్రముగ సూతుఁడిట్లనెను :- “స్వామీ! ఎందుకుండదు. కాని అది సాధనా భజన సమగ్రత వలన కలుగును. ఇంద్రియముల కృత్రిమతచేఁగాదు. మనుష్య జన్మలో నధిక సాధనము, భజనము

భగవచ్చింతనము, పరమార్థ సాధనముండఁగలదు. అందువలన మనుష్యజన్మ శ్రేష్ఠమని చెప్పఁబడినది. సుదుర్లభమగు నీ దేహమును బొందియు నీ సంసారసముద్రమును దాటి ప్రభు పాదపద్మ సన్నిధికిఁ జేరకున్నచో నట్టివాఁ డాత్మహంతయని చెప్పఁబడినాడు. భక్తుఁడు భగవత్ప్రేమను గాంక్షించును. అతఁడు పశువైనను భక్తియబ్బినా అతఁడు పశువగుటనే అంగీకరించును."

సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ విషయమున నేను మీకొక చక్కని దృష్టాంతమును జెప్పెదను. పరమ పావనమగు కాంచీ పురమందు ఒక గొప్ప భగవద్భక్తుఁడగు వైష్ణవుఁడుండెను. అతని కెల్లప్పుడును దనను ప్రభువెట్లు కృపఁజూపునా ? నేను భగవంతున కధికమగు స్నేహభాజనుఁడ నెట్లగుదునా ? యని యనుకొనుచుండును.

ఒక దినమున నా సాధువు కూర్చుండియుండెను. ఒక శ్రీమంతుఁడును, వైభవశాలియునగు నతఁడు రథముమీఁద గూర్చుండి వెడలుచుండెను. అతనివెంట నాతని ధర్మపత్నియును గలదు. ఒక కుక్కయును నాతని యొడిలోఁ గూర్చుండెను. ఆ భార్యాభర్త లిద్దరు నా కుక్కను నత్యధికముగఁ బ్రేమించుచుండిరి. ఒక్కొక్కప్పుడు వారు దానిని ముద్దు పెట్టుకొనుచుందురు. ఒక్కొక్కప్పుడు దాని శరీరమును దట్టుచుందురు. ఒక్కొక్కప్పుడు వారి మృదుకరములతో దాని ముఖమును నత్తుచుందురు. ఒక్కొక్కప్పుడు దానిని నిమురుచుందురు. దాని దీర్ఘ వెండ్రుకలలోనికి వ్రేళ్ళను బోనిచ్చి గీరుచుందురు. ఆ భగవద్భక్తుఁడు లీలనుగాంచి

లోలోన మిక్కిలి సంతోషమును జెందుచుండెను. మునులారా! ఈ భగ వద్భక్తులు ప్రేమపిపాసులుగ నుందురు. ప్రేమ యెచ్చట గనఁబడిన నచ్చట ముగ్ధులైపోవుచుందురు. తన ఆహారమును జూడఁగానే తమ చిత్తము దానివైపునకు స్వాభావికముగఁ బరువిడునట్లును, ధూమ పానము అలవాటు, వ్యసనముకలవాఁడు ఒకానొక నీచుఁడు ధూమ పానమును జేయుటను గాంచఁగానే దానినిఁ గైకొని త్రాగవలయునని ఆతనికిఁగోరిక కలుగును. ప్రేమి తన ప్రియతమునిఁ బ్రేమించుచుండు టను గాంచఁగానే వాని మనస్సు ఉవ్విళ్ళూరుచుండును. తన్నుఁ బ్రేమిం చిన వాడుకూడ అట్లే ప్రేమించినఁ జాలుననుకొనుచుండును."

వైష్ణవుఁడిట్లనుకొనుచుండెను—"ఈ దంపతులీ కుక్క నెంతగాఁ బ్రేమించుచున్నారో చూడుఁడు. నేనుగూడ కుక్కనగుచో లక్ష్మీవర దుఁడు యారమణుఁడు నన్నుఁదన భార్యతోసహా ప్రేమించి నన్నుఁగూడ నీవిధముగఁ బ్రేమింపవచ్చును."

ఇట్లాలోచించుకొని ఆతఁడు తన్నుఁగుక్కగా భావించుకొనుచుం డెను. కుక్కవలెఁ జేతులను నేలపైఁబెట్టి నడుచుచుండెను. వైష్ణవుల యుచ్ఛిష్ట పత్రములను గుక్కవలె నాకుచుండెను. ఎవరైననొకముద్దను బడవైచినచోఁ గుక్కవలె దానినిఁ దినుచుండెను. నదిలోకిఁబోయి కుక్క వలె నీరును ద్రాగును. కుక్కవలె నెచ్చటనైనను మలమూత్రములను విడుచుచుండును. ఎవరైనఁ గొట్టినచోఁ గుక్కకువలె కుఁయ్యి కుఁయ్యి యని పారిపోవుచుండును. సారాంశమేమనఁగా నాతఁడు సర్వవిధములఁ దన్ను గుక్కఁగా భావించుకొనుచుండెను." భగవానుఁ డీతని నిష్ఠ

ప్రీతినిఁజెంది ఆతని ననుగ్రహించెను. కావున మునులారా! భజనము జరిగిన శరీరమే శ్రేష్ఠమైనది. భజనము జరుగక మన్మథుని శరీరము వంటి సుందరమగు మనస్సు, సమస్త సాంసారిక భోగములతోఁ గూడిన మానవశరీరము ప్రాప్తించినను నదివ్యర్థమే కాఁగలదు. ఈ భావమును జెప్పుచు శివుఁడు పార్వతితో నిట్లుచెప్పుచుండెను:- "దేవీ! ఆ భగవానుని మహిమమును, అతని యద్భుత లీలలను నందఱెఱుఁగఁజాలరు. మిగిలినవారి సంగతి నట్లుంచుఁడు నేను స్వయముగ వారి మహత్వము బాగుగా నెఱుఁగఁజాలను. బ్రహ్మ, సనకాది మహర్షులు, నారదముని, మరీచి, అత్రి, అంగిరాది బ్రహ్మపుత్రులు, లోకపాలురును, ప్రధానులగు దేవగణము వారి యథార్థరూపమును దెల్ప నసమర్థులన నన్యుల విషయము చెప్పనేల? సాంసారికులు మూర్ఖతా వశమునఁదమ్ముఁ దాము సర్వసమర్థుల మనుకొనుచుందురు. ఈ చిత్రకేతునునిలోఁగల సహనశీలత భగవానునియెడలఁగల నహైతుకభక్తి కారణముననే కలిగినది. కావున నీవేవిధమునను విస్మయమును జెందకుము. భగవద్భక్తుల కేకార్యమును దుష్కరమనునది లేదు. వారి కసంభవమేదియును లేదు."

శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! శంకరుని ముఖమున నీ వాక్యములను వినఁగానే పార్వతికిఁ గలిగిన విస్మయము దూరమయ్యెను. విష్ణుభక్తుల యీ మాహాత్మ్యమును విని ఆమె గతవిస్మిత యయ్యెను."

త్వష్ట ప్రజాపతి విశ్వరూపుని వధమునకుఁ గ్రోధితుఁడై అగ్నియందు "ఇంద్రుని శత్రువు వృద్ధినొందుఁగాక!" యను నీమంత్రముతో

దక్షిణాగ్నియందు హవన మొనర్పఁగానే చిత్రకేతువే పార్వతీ శాపమున నీయసురుఁడై జన్మించెను. పుట్టఁగానే అతఁడు త్రిలోకములను గప్పి వేయుటచే వృత్రాసురుఁడను పేరఁ బ్రసిద్ధిఁ జెందెను. అసురజన్మలో నైనను నీతనికి జ్ఞాన విజ్ఞానములు లుప్తము కాలేదు. అతఁడదే విధముగ ననన్య అచ్యుతో పాసకుఁడును. బరమ భగవద్భక్తుఁడునయ్యెను రాజా! అసురుఁడయ్యు వృత్రాసురుఁడింతటి భగవద్భక్తుఁడేల నయ్యెనని నీవు ప్రశ్నింపఁగా దానికిఁ బ్రత్యుత్తరముగాఁ బరమ శిక్షాప్రదమగు నీ చిత్ర కేతుని పుణ్యప్రదమగు నుపాఖ్యానమును జెప్పితిని. దీనిని వినఁగానే నీకు విస్మయము దూరము కాఁగలదు. ఇప్పుడు నీవు దేనిని వినఁగోరు చున్నావు?"

పరీక్షిన్మహారాజు పరమాశ్చర్యముతో నిట్లనెను:- "స్వామీ! మీరువాడు చక్కని కథను వివిపించితిరి. ఏమైనఁగానిందు భగవద్భక్తుల మహిమమిట్టిదియే. భగవచ్చరిత్రములను శ్రద్ధాపూర్వకముగ నెవరు విను చుందురో వారి పాపసంతాపములు దూరములు కాఁగలవు."

అంత నవ్వి శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! భగవచ్చరిత్ర లను వినుటచే సాంసారిక బంధనములు తెగుటయనునది నిర్వివాద విష యము. విష్ణుభక్తి మహాత్మ్య రూపమగు నీచిత్రకేతుని పవిత్రేతిహాస మును శ్రద్ధాభక్తుల తోడను నేకాగ్ర చిత్తముతోడను నెవరు వినుచున్నారో వారు సంసార బంధమునుండి విడివడఁగలరు. భగవచ్చరిత్రలకంటె భక్తుల చరిత్రలు శ్రేష్ఠములని చెప్పఁబడినవి. ఏలయనఁగావానిలో నచ్చ

టచ్చట భగవంతుని భక్తవత్సలత, కరుణ, అహైతుక కృపనుగూర్చిన వర్ణనము రాఁగలదు. భక్తుల చరిత్రము వేఱుగనేమికలదు ? భగవత్పరాయణతయే వారి ప్రధాన చరిత్రము. వారు నిద్రించినను, మేల్కొన్నను, కూర్చుండినను, లేచినను భగవద్భక్తియందే నిమగ్నులై యుందురు. భగవంతుడు తప్ప వారికి ప్రపంచమున వేఱు ధనములేదు. ఎవఁడు ప్రాతఃకాలమున లేనఁగానే భగవంతుని స్మరించి, భక్తి వర్ధకమగు నీయితిహాసమును జెప్పుదురో వినుచుందురో, లేక చెప్పుచుందురో ఆతఁడవశ్యము పరమ పదమున కధికారియగును. ఈ విషయములో నీవిసుమంతైన, నణుమాత్రమైన సందేహింపఁ బనిలేదు. మంచిది రాజా! వింటివా! దీనిని మఱవరాదుసుమా! నేను త్వష్టుని వంశవర్ణన మొనర్చుచు విశ్వరూపుని జన్మసంబంధమునఁ బ్రసంగవశమున నతి సంక్షేపముగ వృత్రాసురుని కథను జెప్పితిని ఇఁకనీకేమి విననలయునను గుతూహలము కలదో చెప్పుము.



# అదితియొక్క శేషవంశవర్ణనము.

శ్లో॥ పృశ్నిస్తు పత్నీ సవితుః సావిత్రీం వ్యాహృతిం త్రయీమ్
అగ్నిహోత్రం పశుంసోమం చాతుర్మాస్యం మహామఖాన్॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౮ అ. ౧ శ్లో॥

సీ॥ వినవయ్య నరనాథ విశదంబుగాఁ ద్వష్టృ వంశంబు సెప్పితి వానివెనుక
పవిత్రుండు పృశ్నియు సావిత్రి వ్యాహృతియను భార్య లందు నింపారవేడ్క
నగ్నిహోత్రంబుల నరయంగఁ బశుసోమ పంచయజ్ఞంబులఁ బరఁగఁగనియె॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచములో నామరూపములుగల పదార్థములేవి కలవో వాని అన్నిటికిని వేఱువేఱు అధిష్ఠాతృదేవతలు కలరు. గృహ, గ్రామ, నగర, దుర్గ, వృక్ష, లతా, గుల్మాది సమస్తజీవులకును నధిష్ఠాతృ దైవములుండును. దీని నధిదైవిక సృష్టియందురు. ఈ విధముగఁ బ్రపంచములో జడమనునదియేలేదు. అధిదైవ, ఆధ్యాత్మికములనంగీకరింపక, కేవలము కన్నులకుఁ గనఁబడు పంచభూతములే సమస్తమనినమ్మి, వీనిద్వారా సాంసారిక వాసనలను బూర్తికావించుటకే జడతయనిపేరు. మనకీచర్మ చక్షువులకుఁగనఁబడు వస్తువులన్నియును నధిభౌతిక స్వరూపములు, ఏలయనఁగా మనము చక్షుగోళములద్వారా సమస్తమును జూచుచున్నాము. చక్షుగోళకము లధిభౌతికములే, ఈ చక్షుగోళకములున్నను వీనియందు సూర్య శక్తి ప్రవేశింపకున్నచో, అతఁడు మననేత్రములను, జూచు వస్తువులను ప్రకాశప్రదానము కావింపకున్నచో మనము వస్తువులను నేత్రగోళకము లున్నను జూడఁజాలము. అందువలననే ఘోరాంధకారమందు మనమే వస్తువును జూడఁజాలకున్నాము.

ప్రకాశగోళకములకు అధిష్ఠానమగు చక్షువను నేయింద్రియము కలదో, ఏది ప్రకాశమును గ్రహించి వస్తువులను బ్రకాశింపఁజేయు చున్నదో అదియే దాని యథ్యాత్మ స్వరూపము. పురాణములందుగల సృష్టివర్ణనము ఆధ్యాత్మ, అధిదైవికము. అధిభూతవర్ణనము ప్రాయి కముగ లేనట్టిదే. అందువలనఁ బురాణములలో నుసుళ్ళవలెఁ బుట్టుచుండు జీవుల వర్ణనముండదు. ఆ వర్ణనములవలనఁ బ్రయోజన మేమున్నది? నిత్యమయినదియును, గనీయము కల్పజీవులైనట్టియు. ముక్తులు, ముముక్షువులు మొదలైనవారి వర్ణనముకలదు. బద్ధజీవుల విషయమేదైన నుదాహరణముగ వచ్చినచో నది వేఱు విషయము, కాని వారిని వర్ణించుట పురాణముల కిష్టములేదు. బద్ధులు బద్ధులే.

శుకదేవుఁడు వృత్రాసురేతిహాసమున సమాప్తము చేయఁగానే రాజునకు మూలకథ స్మరణమునకు వచ్చెను. అతఁడు చేతులను జోడించుకొని యిట్లనెను:- "స్వామీ! మీరు నాకు దేవతా, ఋషి, పిత రాదుల వంశములను గూర్చి చెప్పుచున్నారు. మొదట మీరు స్వాయంభువ మనువు యొక్కయు, అతని పుత్రులగు ప్రియవ్రతోత్తానపాదుల యొక్కయు వంశవర్ణనమును గావింపలేదు. ప్రియవ్రతునకు అగ్నీధ్రుఁడును, నాతనికి నాభియు; నాభికి ఋషభదేవుఁడును నుద్భవించిరి. ఋషభదేవునకే భరతుఁడుపుట్టెను, ఈతఁడే జడభరతుఁడనఁబడినాఁడు, మీకు వీరందఱ చరిత్రమును జెప్పితిరి. ఉత్తానపాదుని వంశమును వర్ణించుచు మీరు ప్రాచీన బర్హివంశమువఱకు వర్ణించితిరి. ప్రాచీన బర్హికి పదిమంది ప్రచేతసులు కలిగిరని చెప్పితిరి. అతఁడు వార్షియను నామెను

వివాహమాడినాఁడు. ఆమెకే బ్రహ్మపుత్రుఁడగు దక్షుఁడు శివశాపమున మరలఁ బుత్రరూపమున నీమన్వంతరమున నుద్భవించినాఁడు. ఆ సమయమునఁ బ్రజలందఱును క్షీణమైరి. అందువలననే నీ ప్రజలచేత సులపుత్రుఁడగు దక్షుఁడే సృష్టినంతను వృద్ధినొందించెను. ముందుగా నాతఁడు హర్యశ్వ, శబలాశ్వులను పదునొకండువేలమంది పుత్రుల నుద్భవింపజేసెను. వారందఱును నారదోపదేశమున సాధువులైరి. అంత బ్రహ్మాజ్ఞచే నాతఁడఱువదిమంది కన్యలనుత్పన్నము కావించెను. వారిలో నిరువదేడుగురను జంద్రునకును, పదిమందిని ధర్మమునకును, ఇద్దరిద్దరిని భూతములకును. అంగిరసునకును, తార్క్ష్యనకును నీవిధముగ నలుబదేడుగురు కన్యకలవంశమునుగూర్చి సంక్షేపముగఁ జెప్పియుంటిరి. అంతఁగశ్యపుని పదముగ్గురు పత్నుల వంశవర్ణనమును గావించితిరి. వారిమండి తిమి, శరమ, సురభి, తామ్ర, క్రోధవశ, మునిఁ, ఇల, సురస, అరిష్ట, కాష్ఠ, దనువు అను నీ పదకొండు సంతానముగూర్చి మీరు సంక్షేపముగఁ జెప్పితిరి. అంత మీరు కశ్యపపత్నియగు నదితి వంశవర్ణనము జేయుచుండిరి. మీరీ ప్రపంగములోనే అదితికి పండ్రెడుగురు పుత్రులు కలిగిరనియు, వారే ద్వాదశాదిత్యులని పిలువఁబడుచుండిరని చెప్పితిరి. వారిపేర్లు వివస్వాన్. అర్యమా, పూష, త్వష్ట, సవితా, భగ, ధాత విధాత, వరుణ, మిత్ర, శక్ర, ఉరుక్రములు, వారిలో మీరు వివస్వాన్, అర్యమా, పూషవంశముల సంబంధమున సంక్షేపముగ వర్ణించుచు నాల్గవ అదిత్యుఁడగు త్వష్టుని వంశముగూర్చి చెప్పితిరి. త్వష్ట అసురుల చెల్లెలగు రచనను వివాహమాడెననియు నామె కుమారుఁడే విశ్వరూపుఁడనియుఁ జెప్పితిరి. ఆ కథాప్రసంగముననే

విశ్వరూపుని వధయు. వృత్రాసురుని కథయును వచ్చినది. ఇది అవాంతరకథ. ఇప్పుడు మీరు నాకు మూలకథను వినిపింపవలయును.వివస్వాన్ అర్యమా, పూష, త్వష్టలుకాక సవితాదులెనమండుగురు ఆదిత్యులింక నున్నారు. ఇప్పుడు మీరు వారి వంశవర్ణనమును గావింపవలయును. ఇక నిప్పుడు మూలకథకు రండు.

పరీక్షిన్మహారాజు మాటలనువిని శుకదేవుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యిట్లనెను:- "రాజా! నీవు ధన్యుడవు, కథను వినుటకు నిజమైన అధికారివినీవే. నీవు కథలోని మూలసూత్రమును వినుటకు ఉపేక్షింపవు. మూలమును గట్టిగఁ బట్టుకొందువు. శాఖ ప్రశాఖల విస్తారమున మూలమును నుఱువవు. నేను వృత్రాసురుని కథను జెప్పుచు ముందేమి చెప్పవలయునో మఱచితిని. ఇప్పుడు నీవుజ్ఞాపకము చేసితివి. రాజా! ఈ ద్వాదశాదిత్యులవలననే సమస్త దైవిక సృష్టియు నుత్పన్నమైనది. వీరి వంశములనుగూర్చి నేను విస్తారముగ వర్ణింపఁ బూనినచో నెన్నటికిని సమాప్తముకాదు అందువలన నేను కథా ప్రపంగమును వ్యవస్థాక్రమములందుంచుటకై వీరి వంశముల నతిసంక్షేపముగ వర్ణించుచున్నాను. దానిని నీవు దత్తచిత్తుఁడవై శ్రవణ మొనర్పుము,"

ఐదవ ఆదిత్యుఁడు సవిత.ఆతనిభార్య పృశ్ని. ఈమెకు ముగ్గురు పుత్రికలును, నైదుగురు పుత్రులు నుదయించిరి. సావిత్రి, గాయత్రి యనుపేర్లను బిలువఁబడునామె యీతని పుత్రికయే. రెండవయామె

వ్యాహృతి. ఈమె గాయత్రినంటిపెట్టుకొని యుండును. మూఁడవ యామె విద్య. ఈమెయే సమస్త కర్మకాండకునాది. వేదములలోఁ బంచయజ్ఞములు చెప్పఁబడినవి. ఒకటి అగ్నిహోత్రము. సమస్త వర్ణాశ్రమద్విజులందఱును చేయవలసినదిది. పశుయజ్ఞమొకటి. దీనిలోఁ బశుబలి జరుగును. ఇంకొకటి సోమయజ్ఞము. సోమలత నుండి సోమమును దీసి దానినుండి దేవతలకు భాగమీయఁబడును. మఱియొకటి చాతుర్మాస్య యజ్ఞము. ఇది వర్షాకాలము నాలుగు నెలలును జేయఁబడును. ఇంకొకటి పంచమహా యజ్ఞము. దీనిని నిత్యము ద్విజాతిగృహస్థులు చేయవలసి యుండును. ఈ యైదింటికి సధిష్ఠాత్రి సవిత్రునుండి యుద్భవించినది. నేనత్యంత సంక్షేపమున సవిత్రు వంశవర్ణనమును గావించితిని. ఇప్పు డాఱవ యాదిత్యుఁడగు భగుని సంతానమును వినుము.

భగుని భార్యపేరు సిద్ధి. ఈమెకు మహిమ, విభు, ప్రభువులను ముగ్గురు పుత్రులుదయించిరి. ఆశిషయను నొక కన్యయు నుదయించెను. పెద్దలు చిన్నల కాశీర్వాదము నొసంగుదురు. ఆమె భగుని కూతురే. దక్ష యజ్ఞమందు కుపితుఁడై వీరభద్రుఁడీతని నేత్రములను బెఱికివైచెను. అందువలన నీతఁడు మిత్రదేవతా నేత్రములతోఁ జూచును. అప్పటి నుండి యీతఁడు మిత్రభావముతోఁ జూచుచుండును. దీనిఁబట్టి యెవరి నైన సమిత్రభావముతోఁ జూచినచో నా నేత్రములు జూడయోగ్యములు కావని తెలిసికొనవలసియున్నది.

ఇప్పుడేడవ ఆదిత్యుఁడగు దాతయొక్క సంతానమును గూర్చి వినుఁడు. ఈతనికి నలుగురు భార్యలు, కుహూ, సినీవాలి, రాకా,

అనుమతియనువారు. వీరమావాస్య రాత్రిలో భేదములు. ఈ నలుగురకును నొక్కొక్క పుత్రుఁడు కలిగెను. కుహూ కుమారుఁడు సాయం. సూర్యాస్తమయ సమయమునఁ జేయఁబడు హవనమునకు సాయం సవనమను పేరు కలదు. దీని కధిష్ఠాతృదేవత యీధాతాపుత్రుఁడగు సాయమే. సినీవాలి కుమారుఁడు దర్శ. అమావాస్యనాఁడు పితరుల నుద్దేశించి చేయఁబడు యజ్ఞమునకు దర్శయాగమని పేరు. దానికధిష్ఠాతృ దేవత ధాతయొక్క రెండవ కుమారుఁడు. రాకా యను పత్నియందు ప్రాతః అను పుత్రుడుదయించెను. సూర్యోదయమునకు ముందు వెనుక లందుఁగల సమయమునఁ బ్రాతరగ్నిహోత్రాదులు జరుగును. దాని కధిష్ఠాతృ దేవత యీతఁడే. ధాతయొక్క నాల్గవభార్య అనుమతికి పూర్ణ మాసమను బుత్రుఁడు పుట్టెను. మాసాంతమునఁ బూర్ణిమాదినమున దేవతలనుద్దేశించి చేయఁబడు యాగమున కధిష్ఠాతృ దేవత ధాతయొక్క నాల్గవపుత్రుఁడు. ఇప్పుడష్టముఁడగు విధాత సంతానమును గూర్చి వినుము.

ధాతయొక్క తమ్ముఁడు విధాత భార్యపేరు క్రియ. ఆమెకుఁ బురీష్య సంజ్ఞకులగు నైదుగురు పుత్రులుదయించిరి. పూర్వజన్మమందీ యైదుగురు పవిత్రాదులు. తపస్వులిప్పటికినిఁ బంచాగ్ని తప మొనరించె దరు. ఈ పంచాగ్నుల అధిష్ఠాతృ దేవతలు వీరే.

తొమ్మిదవ ఆదిత్యుఁడు వరుణుఁడు. ఈతని భార్యపేరు చర్షణి. బ్రహ్మపుత్రుఁడగు భృగువు కారణ విశేషముచే మరల నీమెకుఁ

బుత్రుఁడుగ నుద్భవించెను. గొప్ప తపస్వియగు నింకొక పుత్రుఁడును నుద్భవించెను. తపస్సు చేయుచుండఁగా నాతనిమీఁదఁ బుట్టలు పెట్టుటచే నాతఁడు వాల్మీకి నాఁబరగెను. ఆతఁడు వల్మీకమును ఛించుకొని వచ్చెను. వల్మీకము నుండి వచ్చుటచే వాల్మీకియయ్యెను. వీరిద్దరును శుద్ధ పుత్రులు. ఇంకనిద్దరు పుత్ర ప్రాయులుండిరి. ఒకదినమున నీతఁడు మిత్రునితోఁగలసి వచ్చుచుండఁగా స్వర్గసుందరియగు నూర్వశి యెదుటఁ గనఁబడఁగా వారికి వీర్యపతనమయ్యెను. ఇద్దరు నమోఘవీర్యులు. ఆ దివ్యవీర్యములు వ్యర్థము కాఁగూడదని వానినొక ఘటమున నుంచిరి. ఆ సమయముననే వశిష్ఠునకును, నిమిచక్రవర్తికిని వాద వివాదము యజ్ఞమందు సంభవించెను. అప్పుడిద్దరును బరస్పరము శపించుకొనిరి. వశిష్ఠుఁడిట్లనెను :- "నీ దేహము నశించుగాక !" యనెను. నిమియును తక్కువవాఁడుకాఁడు. ఆతఁడును "నీ దేహము నశించుగాక!" యనెను. ఇప్పుడు వశిష్ఠుఁడు కల్పజీవి యగుటచే మరణింపఁజాలడు. శరీరములేక యెట్లు జీవింపఁగలడు. దేహ రూపమగు నాశ్రయము కావలయును. అందువలన నాతఁడు జీవరూపము నాఘటములోని వీర్యమునఁ బ్రవేశించెను. ఇట్టి దివ్యజీవి యింకొక్కఁడు వచ్చెను. ఈతని పేరగస్త్యుఁడు. ఈ విధముగ వశిష్ఠాగస్త్యులు మిత్రావరుణులకుఁ బుత్రులైరి. అందువలన వీరిద్దరును అయోనిజ పుత్రులైరి. ఘటమునుండి పుట్టుటచే నిద్దరును గుంభజులని పిలువఁబడిరి.

పదవ ఆదిత్యుఁడు మిత్రుఁడు. ఈతనిభార్య రేవతి. ఈమెనుండి యీతనికి ఉత్సర్గ, అరిష్ట, పిప్పలులను ముగ్గురు పుత్రులుదయించిరిఁ

ఇప్పుడు పదునొకండవ ఆదిత్యుని సంతానమునుగూర్చి వినుము.

పదునొకండవ ఆదిత్యుఁడు శక్రుఁడు. ఈతఁడు దేవతలకు రాజగుటచే నింద్రుఁడనఁబడినాఁడు. ఈతఁడు తన వివాహమును నసుర వంశములోఁ జేసికొనెను. ఏలయనఁగాఁ బులోమ యను నసురునకు శచీయను కన్య మిక్కిలి చక్కనిది. త్రిలోకములలో నా సౌందర్యమునకు మించిన సౌందర్యము కల కన్యకలేదు. ఆమెకొక చెల్లెలుకూడ కలదు. ఆమెతండ్రి యామెకు దనపేరు వచ్చునట్లు పులోమయను పేరును బెట్టెను. ఆమె భృగువును బెండ్లాడెను. ఆమెకు చవనఋషి పుట్టెను. నరియే శచీదేవి ఇంద్రునిఁబెండ్లాడి జయంత, ఋషభ, మీఢుషులను ముగ్గురు పుత్రులుదయించిరి. జయంతియను కన్యకయును బుట్టెను. ఆమె ఋషభదేవునిఁ బెండ్లాడెను. ఆమెకు భరతుఁడు మొదలైనవారు నూర్గు రుద్భవించిరి."

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! దేవతలకు సంతానము లేదని మేము విసియుంటిమి ఇంద్రునకు ముగ్గురు కొడుకులును, నొక్క కూఁతురును గలరని చెప్పుచున్నారే?"

అంత సూతుఁడిట్లనెను - "స్వామీ పూర్వమందఱకును సంతానము కలుగుచుండెడిది. పార్వతి శాపమొసంగినప్పటినుండి సంతానము కలుగుట ఆగిపోయినది. కావున్నఁ గుబేరునకు నలకూబర మణిగ్రీవులను నిద్దరు పుత్రులుండిరి. వరుణునకుఁ బుష్కరుఁడను బుత్రుఁడుండెను. యముని కూఁతురును అంగుని పత్నియునగు నామెపేరు సునీథ. ఈతఁడు

శాపవశమున నర్థనపుంసకుడయ్యెను. దేవతా శబ్దము స్త్రీ పుంలింగము లకుఁ జెల్లును."

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:- "మహాభాగా! సూతా! పార్వతి ఈ దేవతలకు శాపమునేల నొసంగెను?"

సూతుఁడిది విని కొంచెము గ నన్యమనస్కుడై యిట్లనెను:- "స్వామీ! ఈ విషయముల నన్నిటినివిని యేమి చేయుదురు? ఇవన్ని యును కలహ విషయములు. దేవతల ప్రారబ్ధమట్టిదని మాత్రము తెలిసి కొనుఁడు చాలును. వీరి నందఱను నిస్సంతానవంతులుగఁజేసి పార్వతి మంచిపని చేసినది. కాకున్న వీరతికాముకులు. నిత్యమును సంతానోత్ప న్నము కావించుచు, నైశ్వర్యమదోన్మత్తులై యుందురు. కాముకుల సంతానము రాత్రిందివముల నర్థమునే కావించుచుండును. చూడుఁడు. ఇంద్రపుత్రుఁడగు జయంతుఁడెట్లు జానకి యెడల దృష్టిచే నపచార మొనర్చినాఁడో! నలకూబర మణిగ్రీవుల అశిష్టతచే దుఃఖితుఁడై నారదుఁడు వారికి వృక్షములు కండని శాపమొసంగినాఁడు. కావున నీ యైశ్వర్యశాలురగు ధనికులు నిస్సంతానవంతులగుటయే మంచిది. కలి గినను నొకటిరెండు సంతానములుండిన నెక్కుడు.

పార్వతి యేల శాపమొసంగినదో యీ కథచాల దీర్ఘమైనది; కాని నేను దీనినతి సంక్షేపముగఁ జెప్పెదను. పార్వతికి సంతానము కావల యునను గోరిక కలిగెను. ఈ భావనచేతనే ఆమె గర్భధారణ కావించుచుం డెను. స్వార్థులగు సురలు అగ్నిహోత్రుని,బంపిమధ్యలోవిఘ్నము కావిం

చిరి. భగవతి యిచ్ఛకు విఘ్నము కలుగుటచేఁ గ్రుద్ధయై ఇట్లు శాప మొసగెను:- "మీరు నా సంతానేచ్ఛకు విఘాతమును గావించితిరి. మీకిఁక సంతానము కలుగకుండుగాక!" అప్పటినుండి దేవతలు సంతాన విహీనులైరి. ఇదివఱకు కలిగిన వారెవరో కలిగిరి. తర్వాత గోవిందాయ నమోనమః అయినది.

పండ్రెండవ ఆదిత్యుఁడు విష్ణువు. ఈతఁడింద్రుని కంటెఁ జిన్న వాఁడగుటచే నుపేంద్రుఁడని పిలువఁబడెను. స్వర్గ సింహాసనమున కీతఁ డును నుప సభాపతి."

అంతశౌనకుఁడిట్లడిగెను:- "సూతా! విష్ణువందఱకంటె పెద్ద వాడుగదా! ఈశని నింద్రునికంటెఁ జిన్నవానిఁగాఁ జెప్పుచున్నారే. ఈతఁడింద్రునకును శాస్తకదా! అట్టియెడ నీవాతనిని స్వర్గమున నుప సభాపతి యనియు నుపేంద్రుఁడనియు నేలఁజెప్పుచున్నారు?"

అంతనవ్వి సూతుఁడిట్లనెను :- "ఈ విష్ణుని మాయ అపరం పారమైనది. ఈతఁడు చిన్నవాఁడయ్యును గొప్ప దర్పము కలవాడు. చిన్నవాఁడయ్యు నంత నాటకమాడుచుండును. పాపము బలిని మోస గించి రాజ్యమునంతను హరించి పాతాళమునకుఁ బంపినాడు. ఆతనినే ఈతఁడు కట్టదలఁచెనుకాని అమాయకుఁడగుటచే నీతఁడే కట్టుబడెను. బాలకుఁడగుటచే సేవకునిజేయఁబోయి తానే సేవకుడయ్యెను ఇప్పుడు చేతిలోఁగఱ్ఱను బుచ్చుకొని బలి వాకిటఁ గావలికాయుచుండెను. అయ్యో! ఇదిచాలపెద్దకథ. భగవంతుఁడదితి దేవినిఁ బ్రసన్నురాలుగా నొనర్చుటకై

ఆమెగర్భమున నవతరించెను. ఇందుని తమ్ముఁడై ఆతని దుఃఖము లను బోఁగొట్టెను. అసురులను మోసగించి కపటమున నాతని రాజ్య మును హరించి దేవతల కొసంగెను. ఈ సమస్త విషయములు నేను ముందు వామనచరిత్రయందు విస్తారముగఁ జెప్పెదను. ముందుగా కశ్య పుని పండ్రెండుగుర భార్యల సంతానమునుగూర్చి సంక్షేపముగఁ జెప్పినాఁడు."

ఇదివిని శౌనకుఁ డిట్లనెను :— "మంచిది. సూతా ! నీవు పండ్రెండుగురు భార్యల వర్ణనమును జేసియుంటిరి. ఇప్పుడొక్కదితియే మిగిలినదిఁ కావున నామెవంశమును వర్ణింపుము."

అంత సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఇప్పుడు నేను దితి వంశవర్ణనము నొనర్తును. ఆదైత్య వంశమునుగూర్చి మీరు సావధాను లరై వినుఁడు."



# దితి వంశ వర్ణ నము

(౪౩౭)

శ్లో॥ అథ కశ్యపదాయాదాన్ దైతేయాన్ కీర్తయామితే।
యత్ర భాగవతః శ్రీమాన్ ప్రహ్లాదో బలిరేవ చ।

శ్రీభాగ. ౬. స్కం. ౧౮ అ. ౧౦. శ్లో॥

వ. దితి సుతులైన దైతేయుల వంశంబు సెప్పెదనే దైతేయ వంశంబునందైనను బ్రహ్లాదబలులు పరమ భాగవతులై దైత్య వాసవ వందితులై వెలసిరి.

శ్రీమదాంధ్ర భాగవతము.

ఛప్పయ.

హిరనకశిపు హిరనాక్ష భయే దితిసుతఖలభారీ।
హిరనకశిపు బహూ కయాధూ అతిపతి ప్యారీ॥
అనుహ్లాద సంహ్లాద హ్లాద ప్రహ్లాద జనే సుత।
సుతా సింహికా భఈ జాసు సుత భయో విప్రచిత॥
జన్యో పంచజన అసురకూఁ; కృతితేచేసుత సంహ్లాదనే।
ఇల్వల వాతాపీ జనేఁధమని పత్ని తేహ్లాదనే॥

ప్రపంచములోఁగల బల, పౌరుష, పరాక్రమ, శ్రీ, తేజ. ఐశ్వర్యము లన్నియును భగవద్దత్తములే. ఇవి యెచ్చటఁ గనఁబడిన దానిని భగవద్విభూతియని తెలియవలెను. భగవంతుని సాత్త్విక విభూతులు దేవతలు. రాజస విభూతులు బ్రహ్మ, మనువు, ప్రజాపతాదులు. తామస విభూతి రుద్ర; అసుర, భూత, ప్రేత, పిశాచ, దైత్య, దానవాదులు. భగవంతుఁడు సత్వగుణమును వృద్ధిచేయఁ దలఁచినచో దేవతల బలమును వృద్ధిపొందించును. తమోగుణమును వృద్ధి చేయదలఁచినచో నసుర రాక్షసుల బలమును వృద్ధిపొందించును. వారు దేవతలను

చంపి. కొట్టి, స్వర్గము నుండి వెడలఁగొట్టి యింద్రాసనమును లాగు కొందురు. భగవానుఁడూరక చూచుచు నవ్వుకొనుచుండును."

"అసురులవృద్ధి యేలగావించుననుటలో నీయేలకేమి ప్రత్యుత్తరము ? లడ్డును దిని కారమును దినఁబెందులకు ? క్షీరాన్నమును దిని పుల్లన, కారముగల పచ్చడి నంజుకొనుటెందులకు మనస్సున కానందము కలుగఁజేయుటకు చదరంగములో నప్పుడప్పుడు సైనికుఁడు రాజు నోడించును. కొయ్య సైనికుఁడు కొయ్యరాజు నేమియోడించును ? ఇది ఆటగానికి వినోదము. ఇదేవిధముగఁ త్రిగుణాతీతుఁడగు భగవానునకు నుత్తమాధములు లేరు. అందఱాతని ఆటబొమ్మలు. లీల కొఱకు వినోదము కొరకాతఁడు జయపరాజయములు సంభవింపఁజేయును. నాటకములో నాటజరుగును. అది అయిపోయినతర్వాత నింకేమియునుండదు. కావున సృష్టికొఱకు సురలెంత యావశ్యకమో అసురులునంతే యావశ్యకము. సురలకు ముందు మధుకైటభులుద్భవించిరి. అందువలన వీరిని దేవతలకన్నట్లుగఁ జెప్పుచుందురు. సురల వంశమునుగూర్చి వినిన నేఫలముకలుగునో అసురుల వంశశ్రవణమువలనను నదేఫలము. ఇద్దరకును దండ్రి యొక్కఁడే. కేవలము తల్లులు వేఱగుటచే వారిలో వేఱుబాటు కలిగినది. అదితి కొడుకు లాదిత్యులైరి, దితి సంతానము దైత్యులైరి.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా ! నేను నీకు కశ్యపుని పండ్రెండుగురు భార్యల వంశవర్ణనమును గావించితినిఁ ఇప్పుడాతనికి పదుమూఁడవ భార్యయగు దితియొక్క వంశమును వర్ణించుచున్నాను వినుము.

తన యితర సవతులకు సంతానము కలుగుటను గాంచి దితికి అసూయ కలిగినదని నేను సూకరావతార ప్రసంగమున హిరణ్యాక్షవధ కథలోఁ జెప్పియుంటిని. ఆమె సంధ్యాకాల హోమసమయమునఁ బుత్రాపేక్షచే సకామయై తన నాథుఁడగు కశ్యపునికడకుఁ బోయెను. ఆమె బలవంత మొనర్చి గర్భాధానము గావించుమనెను. ముని యనేక విధములఁ జెప్పెను కాని భవితవ్యత అట్లుండెను. ఆమె తలపై గామ ఘాతము తాండవించుచుండెను. భర్తమాట వినలేదు. వివశుఁడై ముని యా దారుణ వేళయందు గర్భాధాన సంస్కారము కావించి, దీనివలన నీకిద్దరు మహాక్రూరులగు నసురులు, మహాపరాక్రమవంతులు పుత్రులుగఁ బుట్టఁగలరు. సర్వజ్ఞుఁడగు మునివాక్యములు మృషలెట్లు కాఁగలవు? ఆదితి గర్భమునుండి హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను నిద్దరు దైత్యు లుద్భవించిరి. ఈ యిద్దరెవరో కాదు. విష్ణుభగవానుని పార్షదులగు జయవిజయులే సనకాదుల శాపముచే నసురులై పుట్టిరి. అందుకనియే వీరు భగవంతునిచేఁ జచ్చిరి. దేవతలను ద్వేషింపఁగలిగిరి. తన పుత్రులకు మృత్యువు భగవంతునిచేతనే కలుఁగవలయునని వారి తల్లి దితి కశ్యపునివలన వరమును బొందెను. అందువలన భగవంతుఁడు రెండవతారములనెత్తి యీ సోదరుల నిద్దరను జంపెను. సూకరావతారమును ధరించి హిరణ్యాక్షునిఁ జంపెను. నృసింహావతారమును ధరించి హిరణ్యకశిపునిఁ జీల్చెను. సూకరావతార కథ నడుగఁగా నిదివఱకు చెప్పితిని, నృసింహావతార కథను జెప్పెను. ఇచ్చటనీ హిరణ్యకశిపుని దైత్యవంశమును వినుఁడు."

రాజా! హిరణ్యకశిపుడు జంభుఁడను దానవుని కుమార్తె కయాధూ అను నామెను పెండ్లాడెను. ఆమె వలన హిరణ్యకశిపునకు నల్గురు పుత్రులుద్భవించిరి. వారు సంహ్లాదుఁడు, అనుహ్లాదుఁడు, హ్లాదుఁడు, భక్తాగ్రగణ్యుఁడగు ప్రహ్లాదుఁడు. సింహికయను గన్యకయుఁ బుట్టెను. ఆమెను విప్రచిత్తియను దానవుఁడు పెండ్లాడెను. ఆ సింహిక పుత్రుఁడే రాహువు. అతని శిరమును భగవానుఁడు మోహినీ రూపమున నుండఁగా సముద్రమథన సమయమున ఖండించెను. ఈ నలుగురుకాక స్మర, ఉద్గీథ, పరిష్వంగ, తంగ, పతంగ, క్షుద్రభృత్, ఘృణియను నార్గురు పుత్రులుదయించిరి. వీరు ప్రథమ స్వాయంభువ మన్వంతరమందు మరీచి ప్రజాపతికి ఊర్ణయను నామెకుఁ బుత్రులైరి. బ్రహ్మ శాపమున నసురులైరి. ముఖ్యులు నలుగురే. ఇప్పుడా నల్గురు వంశములన్ను వినుము.

హిరణ్యకశిపుని పెద్దకుమారుఁడు సంహ్లాదుఁడు. అతని భార్య కృతి. ఆమెవలన నాతనికి పంచజన్యుఁడను పుత్రుఁడుదయించెను. ఈయసురుఁడు సముద్రజలమున శంఖరూపమున నివసించుచుండెను. ద్వాపరాంతమున భగవానుఁడీతనినిఁ జంపి యాశంఖమును గ్రహించెను. అందువలననే భగవానుని శంఖమునకుఁ బాంచజన్యమను పేరువచ్చెను. భగవంతుని కోమలాధరములచేఁ దాకఁబడిన శంఖమును నస్థిగాఁగల నాయసురుఁడు ధన్యుఁడు. దానికొఱకై అసంఖ్యాకమగు సంవత్సరములు సాధకులు తపస్సుచేయుచుందురు.

హిరణ్యకశిపుని రెండవకుమారుఁడు హ్లాదుఁడు. ఆతని భార్య పేరు ధమని. ఆ ధమని గర్భమునుండి యిద్దరు పుత్రులుదయించిరి. వారిలో నొకనిపేరు ఇల్వలుఁడు (ఆతాపి) రెండవ వానిపేరు వాతాపి. వీరిలో వాతాపిని నగస్త్య మహాముని తిని జీర్ణింపఁజేసికొనెను.

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా ! ఇంతటి గొప్ప బలవంతు లగు నసురులను నగస్త్య భగవానుఁడు బ్రహ్మణుఁడయ్యు నేలఁదిం చెను. ఆతఁడెట్లు జీర్ణమయ్యెను. ఈ కథను మీకుచితమని తోఁచిన జెప్పుడు."

ఇది విని సూతుఁడిట్లనెను:- "మహానుభావా ! ఇది చాలా పెద్ద కథ; కాని నేను మీ కత్యంత సంక్షేపముగఁ జెప్పెదను. మీరందఱును ఓుక్కిలి జాగ్రత్తగ వినుఁడు."

వాతాపి, ఇల్వలురను నీయిద్దరసురులు గొప్ప శూరవీరులు, పరాక్రమవంతులు ధనికులు, ఐశ్వర్యశాలురు. ఆ దినములలో వీరు భూమిమీఁదనే నివసించుచుండిరి. భూమి మీదఁగల రాజులలో వారధిక ధనవంతులుగ నెన్నఁబడుచుండిరి. కాని వీరికొక చెడ్డ వ్యసనమలవాట య్యెను. వారు మాంసభోజులగు దైత్యులే. వీరికి ఋషి మునుల మాంస మును దిను నలవాటయ్యెను. శ్రాద్ధాన్నమును దిని బలిసిన బ్రాహ్మణుల మాంసము వీరికి ప్రియము. క్షీణతేజము, అల్పవీర్యముగల మునులను వీరు తినివైచిరి. వారొక యుక్తినిఁ బన్నిరి. ఇచ్ఛానుసారముగ రూప మును ధరించు శక్తి వీరికిఁ గలదు. అందువలన వాతాపి పెద్ద మేక

యయ్యెడువాఁడు. ఈతని సోదరుఁడగు నిల్వలుఁడు బ్రాహ్మణ వేష మును ధరించి మునుల కడకుఁబోయి చేతులు జోడించుకొని యిట్లనును: "మునులారా ! మా యింట శ్రాద్ధము. భో జ న ము చేయుటకు మా యింటికి దయచేయుఁడు. నేను మాంసమునుగూడ తినెదను గావున శ్రాద్ధమందు మాంస భోజనమును బెట్టెదను. ఆ బ్రాహ్మణులంగీక రించెడువారు. అప్పుడు మేకయైన నా వాతాపి మాంసమును వండి అందఱకును వడ్డించెడువాఁడు. శ్రాద్ధనిమంత్రితులగు బ్రాహ్మణులు దానినిఁ దినెడువారు. అప్పుడిల్వలుఁడు "అన్నా! వాతాపీ! బయటకురా! అని కేక వేయును.

ఇది వినఁగానే ఆతఁడందఱ పొట్టలు పగులఁగొట్టుకొని బయటకు వచ్చెడువాఁడు. అప్పుడిద్దరునుగలిసి మిక్కిలిప్రేమతో నా బ్రాహ్మణుల మాంసము దినెడువారు. మేము ఫలహారమును జేయుదుము, మాంసమును శాకము తినము బ్రాహ్మణు లెవరైనను నుండినచో నప్పుడు వారు పనస. మామిడి, జామ మొదలగు ఫలములగు చుందురు. వారు తినగానే పొట్టపగిలి పెద్ద పెద్ద ఫలములు బయటకు వచ్చెడివి. అప్పుడిద్దరు వానినిఁదిని వేయుదురు. ఇట్లు రహస్యముగ శ్రాద్ధ మొనర్చుట యితరు లెవరికినిఁ దెలియలేదు. చాల దినముల వఱకు వారిదే విధముగ బ్రాహ్మ ణులను జంపి మోసమునఁ దినుచుండిరి.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! పాపము బహుదినములు దాగదు. మునుల కీ విషయమును తెలిసెను. ఈ విధముగనైనచో వీరు మనకందఱకును శ్రాద్ధములు పెట్టఁగలరు. ఋషులలోఁ గలవరము

బయలుదేరెను. అందఱును గలిసి ఒక సభను జేసికొని ఒక శిష్టమండలమును అగస్త్య మహర్షికడకుఁ బంపవలయునని నిర్ణయించుకొనిరి. ఆతఁడే మనకందఱకును జ్యేష్ఠుఁడును, శ్రేష్ఠుఁడును. అతఁడొక పుక్కిట సమస్త సాగరముల జలమును ద్రావివైచెను. తర్వాత లఘుశంకద్వారా దానిని విడిచెను. ఆ దినమునుండి సాగరజలముప్పగ నుండెను. ఆతఁడు తలచుకొనిన నీ యసురులను దండింపఁగలడు. వీరు సాధారణమునులకు వశపడరు."

అందఱ అంగీకారము బడయఁగానే ఒక శిష్టమండలి కలిసి అగస్త్యమహాముని సమీపమునకుఁ బోయిరి. ఇరువైపుల నమస్కార ప్రణామములు, శిష్టాచార కుశలప్రశ్నలు జరిగిన అనంతరము అగస్త్య మహాముని యిట్లడిగెను:- "మునులారా ! నేఁడు మీరందఱేల నాపైఁ గృపఁ జూపితిరి మీ రింతగాఁ జింతాక్రాంతులైతిరేల ?"

ఆ ఋషులలోఁ గొంచెము వృద్ధుఁడుగనున్న యాతఁడు చేతులు జోడించుకొని యిట్లడిగెను:- "ఏమి చెప్పుదుము స్వామీ ! మేము చాల దుఃఖములో మన్నాము. హిరణ్యకశిపుని మునులు ఆతాపి వాతాపులను వారిద్దరు నెందఱో బ్రాహ్మణులను దినివైచిరి. వాతాపి మేఁకయై బ్రాహ్మణుల కడుపులోనికిఁ బోవుచుండును. ఆతాపి పిలువఁగానే అందఱ పొట్టను బగులఁగొట్టుకొని బయటకివచ్చును. ఇద్దరును నా బ్రాహ్మణులను దినివేయుదురు. వీరెందఱు బ్రాహ్మణులను దినివైచిరో లెక్కయే లేదు."

ఇదివిని వారికి ధైర్యముచెప్పుచు అగస్త్యమహాముని యిట్లనెను:- "మునులారా ! నన్నొకదినమున నిదేవిధముగా నిమంత్రించితిరా వారి పని పట్టెదను."

ఋషులిట్లనిరి :- "మంచిదిస్వామీ! రేపేస్వామీ, మీరు మాకందరకును శిరోమకుటము. మీ కనిష్టము జరిగెనా మన సమాజమునకే నష్టము సంభవింపఁగలదు."

అంతనవ్వి అగస్త్యమహాముని యిట్లనెను:- "మునులారా ! మీరు భయపడకుఁడు. ఆయుధములఁగు నసురులు నన్నేమియును జేయఁజాలరు. వారు నా వలలోఁబడిరా ఇఁకఁ దప్పించుకొని పోఁజాలరు."

ఋషులిట్లనిరి ; "మంచిదిస్వామీ! మీరు జ్ఞాపకముంచుకొనుఁడు ఆతఁడు బ్రాహ్మణరూపమును ధరించి రాఁగలడు.

ఏదోవిధముగనొకదినమున నగస్త్యమహర్షినిగూడనిమంత్రించుఁడని వారికిఁ గబురంపిరి. వారిదృష్టులను దర్శనీయమగు ఋషి శరీరము పైఁబడెను. అందువలన మఱునాఁడే సుందర బహుమూల్యమగు పీతాంబరమును ధరించి, బొట్టును దిద్దుకొని మునిసమీపమునకుఁ బోయెను, దూరమున నుండియే సాష్టాంగ నమస్కారమొనర్చెను. వీడు ఒక భక్తుని దండమును బెట్టుచున్నాఁడని మునిగ్రహించెను. అయినను నేమియును పలుకలేదు. గంభీరముగ గూర్చుండియుండెను. ఆతఁడువచ్చి చేతులు జోడించుకొని యిట్లనెను :- "స్వామీ ! రేపు

మాయింట శ్రాద్ధము. మీరు శిష్యులతోఁగూడి మా కుటీరమునకు దయ చేయవలయును."

ముని గంభీరుడై యిట్లనెను :- "అయ్యా! మేము శ్రాద్ధాన్నము దినము. శ్రాద్ధాన్నము మిక్కిలి కఠినముగ జీర్ణమగును. దాని కొఱకై జప తపము లొనర్పకున్నచో బ్రాహ్మణుని నాశమొనర్చును. అయినను మీరింతదూరము వచ్చితిరికావున సరియే నేనువచ్చెదనులెండు"

ఇది వినఁగానే ఆతాపి మిగుల నానందమును జెంది లోలోన నానందించుచు నింటికిఁ బోయెను. మఱునాడు నియత సమయమునకు ఆతఁడు మునికడకు వచ్చెను. ముని శిష్యులతోఁ గూడి వానికడకు విచ్చేసెను. ఆతఁడందఱనుబూజించి, పత్రములలో వడ్డించుచుండెను.

ముని యిట్లనెను :- "నాయీ శిష్యులందఱును భోజనమొనర్చెదరు. ముందుగా నేమ భోజనము చేయవలయును. ముందు నాకడుపు నిండిన వీరిసంగతినిఁ జూతము."

అంత వాతాపి యిట్లనెను :- "స్వామీ! నేను మాంసముతో శ్రార్ధమొనర్చెదను.

ముని యిట్లనెను :- "మీ సదాచారమెట్లో అట్లే చేయుము. తీసికొనివచ్చి వడ్డించుము."

ఇప్పుడాతఁడు వడ్డించుచుండెను. ముని తినుచుండెను. వాతాపి మాంసమునంతను దినివైచెను. అప్పుడు ఋషి విగ్గఱగఁ ద్రేపెను.

పెద్దగ నొక్క అపానవాయువును విడిచెను. దానికి శిష్యులు పొట్టలు విఱుఁగఁబడి నవ్వుచుండిరి. ఈ సమయముననే ఆతాపి యిట్లుపలికెను:- "వాతాపీ! బయటకు రా, మునిపొట్టను బ్రిగులఁగొట్టుకొని." కాని వాతాపి యింకెక్కడమన్నాఁడు?

ఆఁతడు మరల మూఁడు వాళ్లు సార్లు పిలిచెను. అప్పుడపాన వాయువును విడుచుచు నవ్వుచు ముని యిట్లనెను:- "వత్సా! ఇప్పుడు గోవిందగీతమును బాడుము. ఇప్పుడు వాతాపి ఆశను బెట్టుకొనకుము. వానిని నేను తిని జీర్ణింపఁ జేసికొంటిని."

ఇది వినఁగానే ఆతాపి మునిపైకి దుమికెను. అప్పుడు ముని ఒక్కసారి హుంకరించెను. దీనితో నాతఁడచేతనుఁడై పడిపోయెను. ముని తన శిష్యులతో వెడలిపోయెను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! అగస్త్యుని కడుపులో సదా బడబాగ్ని ప్రజ్వలించుచుండును. ఆతఁడేది తిన్నను నిమిషములోభస్మము కాఁగలదు. అందువలన నజీర్ణ భోజనమును దిని, ఆ భోజనము జీర్ణము కాక, ఆఁకలి వేయకున్నచో నట్టివాఁడు భోజనముచేసి, మూఁడుసార్లీ మంత్రమును బఠించుచుఁ బొట్టను నిమురుకొన్నచో నేదితిన్నను నది తక్షణము జీర్ణమగును.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఆ మంత్రమును మాకవశ్యము చెప్పుడు. ఒక్కొక్కప్పుడు కథలో నధికముగఁ గూర్చుండుటచే నుదర మందు భారముగ నుండుచున్నది."

ఇదివిని నవ్వి సూతుఁడిట్లనెను :- "స్వామీ ! మీరు విశ్వమునే జీర్ణింపఁజేసికొనువారు. మీకు భారముగనుండుటేమి ? అయినను నేను మంత్రమును జెప్పివైచెదను. ఇతరులకుఁ బనికివచ్చును. -అది-యిది-

శ్లో॥ వాతాపీ భక్షితోయేన అతాపీచ నిపాతితః।
సముద్రః శోషితోయేన సమేఽగస్త్యః ప్రసీదతు॥

ఈ మంత్రమును జదివి క్షీరాన్నమును, హలువాను, లడ్డు మొదలగు వాటిని నిష్టమువచ్చినట్లు తినుఁడు అన్నియును స్వాహాయగును.

ఈవిధముగ మునులారా! నేను హిరణ్యకశిపుని యిద్దరు పుత్రుల యొక్క వంశములను వర్ణించితిని ఇప్పుడిఁక నన్యపుత్రుల వంశములను గూర్చి చెప్పుదును వినుఁడు.



## మ హి షా సు ర క థ

( ४३८ )

శ్లో॥ అనుహ్లాదస్య సూర్మ్యాయాం వాష్కలో మహిషస్తథా।
విరోచనస్తు ప్రహ్లాదిర్దేవ్యాం తస్యాభవద్బలిః ॥
శ్రీభాగ. ౬ స్కం ౧౮ అ. ౧౬ శ్లో॥

వ. అనుహ్లాదునకు సూర్మ్యయను భార్యయందు భాష్కల మహి

షులు గలిగిరి. ప్రహ్లాదునకు దేవియను భార్యయందు విరోచనుండుపుట్టె నతనికి బలి జన్మించె.

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఈ ప్రపంచమంతయును మహామాయశక్తిద్వారానే పంచలించు చున్నది. శక్తిలేకున్నచో సర్వసమర్థుడగు శివుడును శవమువలె నగును. ప్రపంచములో సర్వత్ర సర్వరూపములలో సర్వతో భావేనశక్తి వ్యాపించియున్నది. ప్రపంచములో స్త్రీలింగ పదార్థములన్నియు శక్తి స్వరూపములే. అవిలేక పుంలింగ వాచ్యశబ్దములకు మహత్వములేదు. మహామాయకు అనంత నామములు కలవు. వానిని బ్రహ్మాదిక దేవత లును నెఱుగరు. శివా, భద్రాజగదంబా, రౌద్రా, నిత్యా, గౌరీ, ధాత్రీ, జోత్స్నామయీ, చంద్రరూపిణీ, సుఖస్వరూపా, శరణాగత వత్సలా, సిద్ధిస్వరూపా, నైరృతీ, భూభృతా. లక్ష్మీ, శర్వాణీ, దుర్గా, దుర్గపరా, సారా, సర్వకారిణీ, ఖ్యాతి, కృష్ణా, ధూమ్రా, సౌమ్యా, రౌద్రరూపా, జగదాధార భూతా, కృతి, విష్ణుమాయాది అనేక నామము లచే విశ్వబ్రహ్మాండమందు విఖ్యాతివి జెందియున్నది. ఆమె కనేకరూప ములు కలవు. ఆమె లేక విశ్వ బ్రహ్మాండసృష్టికానిండు త్రిమూర్తులు, జతుర్భువనములు, జరాచర జగత్తు లేనేలేదు, ఆ జగదీశ్వరజననియే ఒక్కొక్కప్పుడు దేవరూపమున గనబడును. ఒక్కొక్కప్పుడాతని సహోదరి మాయయై భగినీ రూపమున బూజింపబడుచుండును. ఒక్క యెడ శ్రీకృష్ణున కాహ్లాదమును గలిగించు రాధారూపమున జరాచర విశ్వమున కానందమును గలిగించుచుండును. ఆమె ధర్మపత్ని రూప

మున ధర్మపుత్రులను గనును. ఒక్కొక్కప్పుడామె ప్రాణులలో సుఖ
సంచారములనుగలిగించుచు శాంతమై యుండును. ఆదేవియే తుష్టి,
పుష్టి, స్మృతి, శాంతి, కాంతి, భ్రాంతి, శక్తి, వృత్తి, బుద్ధి, జాతి,
వ్యాప్తి, లక్ష్మి, ఈశ్వరి, క్షుధ, తృష్ణ, ఛాయ, మాయ, నిద్ర,
చేతన, క్షమ, శ్రద్ధ, విశుద్ధ, దయ మొదలగు ననేక రూపములతోఁ
జరాచరజగత్తున వ్యాపించియున్నది. ఆమెకు సాత్త్వికి, రాజసి, తామసి
యను ననేక భేదములున్నను వాస్తవమున మూలమున నొక్కటియే.
రజోగుణశక్తి సత్వగుణశక్తిచే నణఁగిపోవును. తమోగుణము రజో
గుణముచే నణఁగును. భిన్నభిన్న శక్తులు పనిచేయఁజాలనప్పుడు,
ఆదేవియే సంఘశక్తి ప్రభావముచేఁ గఠినాతి కఠిన కార్యములను సరళ
ముగ నొనర్చును. దుర్జయాతి దుర్జయ శత్రువునుగూడ సుగమముగ
జయించును. ఈక్రోధరూపమగు మహిషము మన సమస్త దైవీవృత్తుల
నణఁచి శరీరరూపమగు స్వర్గమందుఁ దన యాధిపత్యమును సాగించి
నపుడు మనయందుసమస్త సద్గుణ వివేకశక్తుల ముత్పన్నము కావించును.
దేవతలకు విజయముకలుగును. ఆత్మ వినాశమును గావించు కామ,
క్రోధ, లోభాది, ప్రబల శత్రువులను జండీదేవి వినాశము కావించును.
తమోగుణ వ్యాప్తిచే నైశ్వర్య మదమత్తులైన క్రూరాసురులకు ఆమె
కోమలాంగియైనను రణరంగ దుర్మదయగును. సుకుమారియయ్యు రణ
చండియగును. ఆమె అబలయయ్యు సబలయగును. సింహవాహనమెక్కి
ఆమె శత్రువుపై దుముకును. ఆ సమయమున నామెకు ఫలహారమిష్ట
ముండదు. ఆమిషాహారమే ప్రియముగనుండును. ఆమె కుంకుమాలక్త
ముచేఁ దనముఖము మీఁదఁ గృత్రిమకుంకుమ నలఁదుకొనదు. ఆమె

మధుపానమును గావించి తన ముఖమండలమును రక్తరంజితము కావించును. ఆ సమయమున నామెకు ముత్యాలహారములు ప్రియములు కావు. ఆమె నరముండమాలచేతనే తన వక్షఃస్థలమును సుశోభిత మొనర్చుకొనును. ఆమె తన చేతిలోని పుచ్చెను శత్రువుయొక్క ఉష్ణరక్తముచే నింపుకొని, అత్యంత ప్రబలుఁడగు మహిషాసురునిఁ జరణతలముచే నణఁచిపట్టి నాశమొనరించును. ఆమె అన్ని శక్తులతోఁ బ్రకటమగును. అన్ని అస్త్ర శస్త్రములను ధరించును. అందఱను దనవెంటఁబెట్టుకొని పోరాడును. విజయసుఖమును స్వయముగఁదానే అనుభవింపక దానిని దేవతలకర్పించును. ఇట్టి సంఘముచే నుత్పన్నమైన మహిషాసురమర్దనీ దేవి పాదపద్మములకు మా కోటికోటి ప్రణామములు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! హిరణ్యకశిపుని మూఁడవ కుమారుఁడు అనుహ్లాదుని భార్యపేరు సూర్మ్య. ఆమె గర్భము నుండి బాష్కలుఁడుఁను, మహా పరాక్రమవంతుఁడగు మహిషాసురుఁడు నుత్పన్నమైరి. రాజా ! మహిషాసురుఁడెంత బలియనఁగా నాతనిని యుద్ధములో నెవరును నెదుర్కొనఁజాలరు. ఆతఁడు యుద్ధములో దేవతల పీచమణఁచెను. వారిని స్వర్గమునుండి పాఱఁద్రోలెను. స్వయముగ నింద్రుఁడై త్రిలోకములను బాలించుచుండెను. అప్పుడు దుర్గాదేవి ప్రకటమై వానిని సంహరించెను."

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! భగవతీదేవి యెట్లు ప్రకటమైనది ? స్త్రీయగు నామెకింతటి బలపరాక్రమము లెట్లువచ్చెను ?

ఆమె యెవరికుమార్తె. ఎవరిని. బెండ్లాడినది? ఆమె మహిషాసురు నేల చంపినది ? మా యీ ప్రశ్నలకుఁ గృపతోఁ బ్రత్యుత్తర మీయ వలయును."

అంత సూతుఁడిట్లనెను:- "మునివరా ! ఈ కథ చాల పెద్దది. మహామాయ చరిత్ర. అనంతమైనది. ఇప్పటనేను ఆమె మహిమ నభి వర్ణించెదను. కేవలమామె మహిషాసురునెట్లు మర్దించినదో ఆ కథను చెప్పెదను."

మహిషాసురుఁడు బలవంతులగు నసుర సేనలను దీసికొని దేవతలపైకి దండెత్తి, ఇంద్రుని జయించి, స్వర్గమున నింద్రాసనమునఁ గూర్చుండఁగా నప్పుడు దేవతలత్యంత దుఃఖితులైరి. వారిల్లు వాఁకిండ్లను వీడి భూమిపై మనుష్యులవలె గుప్తరూపమునఁ దిరుగుచుండిరి. దేవతలు మిక్కిలి దుఃఖితులైరి. చివరకు వారందఱును గలిసి లోకపితామహుఁ డగు బ్రహ్మకడకుఁబోయెను. బ్రహ్మ వారినందఱను గైకొని శివుని కడకుఁబోయెను. శివుఁడందఱను దనవెంటఁబెట్టుకొని విష్ణువు కడకుఁ బోయెను. దేవతలు మొదటనుండి చివరవఱకు వారి దుఃఖ వృత్తాంత మును జెప్పుకొనిరి. దైత్యులయొక్క యీ సాహసమును వినఁగానే సర్వేశ్వరుఁడగు విష్ణువునకు మిక్కిలికోపము వచ్చెను. భగవానుఁడు కోపమును జెందఁగానే ఆతని శ్రీముఖమునుండి ఒక తేజము బయలు దేరెను. ఇప్పుడు దేవతలందఱును దమతమ తేజస్సులను దానిలోఁ గలిపిరి. ఒక్కదారముతోఁ జెట్టుమగట్టిన నది తెగిపోవును. చాల దార ములను జేని యేనుఁగును గట్టినను నదిదెగదు. సంఘశక్తి పుట్టినది.

వానిలో సందఱ తేజస్సులను గలిసెను. అది తమస్త్యాగ, శమ, దమాది సాత్త్వికీ శక్తియుతమైనది కాదు. అది క్రోధముచే నుత్పన్నమైన వీరతా పూర్ణమగు రౌద్రరసప్లావిత తేజము. తేజములన్నియునువచ్చి భగవదాకారమునఁ జేరఁగానే అది మానవాకారమునఁ బరిణతిచెందుచుండెను. విష్ణుతేజముచే వీరతా పూర్ణములగు నిరువది చేతులయ్యెను. చంద్ర తేజముచే స్తనములును, నింద్రతేజముచేఁ గటి ప్రదేశమును, వరుణ తేజముచే జంఘలును, పృథ్వీతేజముచే నితంబమును బ్రకటమయ్యెను. బ్రహ్మతేజముచేఁ జరణద్వయము, సూర్యతేజముచే వ్రేళ్ళు, కుబేరుని తేజముచే నాసిక, ప్రజాపతుల తేజముచే దంతములు, అగ్ని తేజముచే నేత్రములు, సంధ్యా తేజముచే నొసలు, వాయుతేజముచేఁ గర్ణములు, ఇతరదేవతల తేజముచే నితర భాగములు నుత్పన్నములయ్యెను. ఇప్పుడా తేజఃపుంజమొక పరమవీరవతియగు నారీరూపమునఁ బ్రకటమయ్యెను. సమస్త దేవతలా సర్వశక్తిమతియగు దేవిపాద పద్మములందు శ్రద్ధా భక్తి పూర్వకముగఁ బ్రణామము కావించిరి. ఆమెనుగాంచి దేవతలందఱును భగవతికి జయము జయమని జయ జయ ధ్వానములు గావించిరి. ఆజయజయ ధ్వానములు దశదిశలు నిండెను.

దేవి సమస్త దేవతలవైపు కృపాభరిత దృష్టులతోఁ జూచి యిట్లనెను:- "దేవతలారా! మీరు నన్నేలస్మరించితిరి?"

దేవతలిట్లనిరి :- "జగదంబా! మేమందఱమును మహిషాసురునివలనఁ జాల బాధపడుచున్నాము. మమ్ములను రక్షింపుము. మా

కభయ దానమిమ్ము. పోఁగొట్టుకొనిన మాసిరి నసురులనుండి మా కిప్పింపుము."

దేవి యిట్లనెను :- "దేవతలారా ! నేను మీఅందఱ శక్తిచేఁ బ్రకటమైతిని. ఇప్పుడు మీరందఱును గలసి నాకు మీయస్త్ర శస్త్రముల నొసంగుఁడు. అప్పుడు నేను మహిషాసురుని మదమణఁచెదను."

దేవియొక్క మాటలను విని సమస్త సురులు సహర్షముగ నామెకుఁ దమతమ అస్త్ర శస్త్రములనుండి శక్తినిఁదీసి యొసంగిరి. శివుఁడు శూల మును, విష్ణువు చక్రమును, వరుణుఁడు శంఖమును, అగ్ని శక్తిని, వాయువు ధనుస్సును, బాణములచే నిండిన అంబులపొదిని, ఇంద్రుడు వజ్రమును,యముఁడు దండమును, వరుణుడు పాశమును, బ్రహ్మ కమం డులువును, ప్రజాపతి స్ఫటికాక్షమాలను, సూర్యుఁడు రోమములోని తేజమును, కాలము డాలు, కత్తిని, సముద్రుఁడుఉజ్వల ముక్తాహారమును, దివ్య వస్త్రములను, చూడామణి, కుండల కంకణ, కేయూర నూపు రాంగుళీయకములను, వింకను నితరయంగముల దివ్యభూషణములను నొసంగెను. విశ్వకర్మ పరశువును, నెన్నఁడును వాడిపోనిమాలను, సముద్రుఁడు క్రీడాకమలమును, హిమాలయము వాహనముగ సింహమును చాలగ రత్నములను, కుబేరుఁడు మధుపూర్ణ పాత్రము, శేషుడు మణి ముక్తాయుక్తమగు నాగహారమును, ఎన్నని చెప్పఁగలము ? ఎవరివద్ద నెన్ని ఉత్తమ వస్తువులుకలవో, తమ మాతృభూమి నుద్ధరించుకొనుటకై పోఁగొట్టుకొనిన రాజ్యమును బొందుటకై, ఆతతాయులగు నసుర లేయే

వస్తువులపై నధికారమును వహించితిరో దేవికి ఆసమస్త వస్తువుల నర్పించి సన్మానించి ఆమెయుత్సాహము నినుమడింపఁజేసిరి.

దేవతలద్వారా ఉత్సాహితయై మహామాయ తన సింహము నాడించుచుఁ బరశువును దోమరమును ద్రిప్పుచుఁ, దన దేవత్వముచే వీరత్వమును లజ్జింపఁజేయుచు, భూమినిఁ తన తేజోబల పౌరుషములచే వణఁకించుచు నసురులపైఁబడెను. దూరముననుండి దేవివచ్చుటను గాంచి వారు విభ్రాంతపోయిరి. మహిషాసురుఁడు తనసేనను సుసజ్జిత మొనర్చుకొని దేవిపైకురికెను. దేవికి సహస్ర భుజములందు సహస్రాయుధము లుండుటను నసురులు గాంచిరి. ఆమె తేజః పుంజమువలె నిర్భయమై అసురసేనలోఁ బ్రవేశించి సంహారము చేయసాగెను. అప్పు డసురులు శక్తికొలఁది ఆమెతోఁ బోరాడసాగిరి. చక్షురుఁడను బరమ పరాక్రమశాలియగు దైత్యుఁడు మహిషాసురుని సేనకంతకును నధినాయకుఁడు. ఆతఁడు ముందుకువచ్చి యుద్ధముచేయసాగెను. మహామాయ అట్టహాసమొనర్చుచు వానిని నిముషములో యమపురమునకుఁ బంపెను. ఇప్పుడు చామర, ఉదగ్ర, ఆసిలోమ, వాష్కలులనువారు దేవితోఁ బోరాడవచ్చిరి. వారు నిముషములో యమపురమునకుఁబోయిరి, కొందఱు నస్త్రశస్త్రములతోడను, గొందఱను సింహపుపంజా దెబ్బలతోడను, గొట్టించి యమపురమునకుఁ బంపెను, ఈ విధముగ దేవికిని దైత్యుల కును భీషణయుద్ధము జరిగెను. దేవి అపరాజిత. ఆమె మధుపానమును గావించి, క్రోధోద్రిక్తమై అసురసేనను సంహరించుచుండెను. తన సేనను దేవి మట్టుపెట్టుచున్నదనియు. వారందఱును బారిపోవుచున్నార

నియు మహిషాసురుఁడు తెలిసికొని, తాను మహిషరూపమును ధరించి, దీర్ఘములగు శృంగములను ద్రిప్పుకొనుచు దుమికెను. అతఁడు రాగాఁనే దేవీగణమును బాధింప నారంభించెను. అప్పుడు దేవి కవ్వించి యిట్లనెను :- ఓరీ ! దుష్టా ! నీ కొఱకే నేనింతవఱకు వెదకుచున్నాను. నేఁడునేను నీవు చేసినదానికి ఫలము ననుభవింపఁజేసెదను. నేఁడునిన్ను యమసదనమునకుఁ బంపెదను."

నేఁడునిన్ను పచ్చడిచేసెదను. నీదర్పమునకు ఫలమును జూపింెదను. నీవు నాముందఱకురా" ఇదివినఁగానే మహిషాసురుఁడు తన కొమ్ములతోఁ బెద్దబెద్ద కొండలను బెల్లగించి భగవతీ వాహనమగు సింహముపైకి విసరెను. అతఁడు గిట్టలతో భూమిని ద్రవ్వుచుండెను. మేఘమువలె సింహనాద మొనర్చుచుండెను. అతఁడు తన శ్వాసచే ఫూత్కారములొనర్చుచుండెను. తన పరాక్రమమును జూపి దేవిని పరాజితఁగావింపఁజూచుచుండెను. ఇంతలోనే దేవి ఒక దుముకు దుమికి మహిషరూపమును ధరించిన నసురునిఁ బాశమున బంధించి, పండ్లు పటపటఁ గొఱకుచు, అట్టహాస మొనర్చుచు నిట్లనెను:- "ఇప్పుడు నీవేమి చేయగలవో చెప్పు."

ఇంతలోనే అతఁడు తన మహిష రూపమునువీడి గొప్ప బలము గల సింహరూపమును ధరించెను. దేవి సింహరూపుఁడగు నాదైత్యుని ఖండింపఁ దలఁచునంతలో నాతఁడు ఖడ్గధారియగు మనుష్యుఁడయ్యెను. అప్పుడు దేవి డాలు ఖడ్గమునెత్తి, వేఱకరములతో బాణములను సంధిం

చుచు, వాని శరీరము నంతను వేధించెను. అప్పుడాతఁడు పురుషరూప మును వీడి యేనుఁగై జగదంబికాసింహమును దనతొండముచే పెలిపైచి లాగెను. దేవి వాని తొండమును దీక్షణ ఖడ్గముతో ఖండింపఁ జూచు నంతలో మరల నాతఁడు మహిషమయ్యెను. ఇప్పుడు మరల నాతఁడు పర్వతములను బెల్లగించి దేవిపై విసరెను.

దేవియొక్క క్రోధము పరాకాష్ఠనందుకొనెను. ఆమె యెగిరి ఆదైత్యునిఁ గాళ్లక్రిందఁ ద్రొక్కిపట్టి వానిశిరస్సును ఖండించునంతలో నాతఁడు శిరస్సు నీవలకు లాగుకొనఁ బ్రయత్నించుచుండెను. అప్పుడు దేవికి మిక్కిలి కోపమువచ్చెను. ఆమెఒక తీక్షణ ఖడ్గముచే నాతని శిర స్సును మొండెమునుండి వేఱుపఱచెను. ఆ మహిషాసురుడు చావఁగానే అసురసేన యందు హాహాకారము వ్యాపించెను. దేవతలాకాశమునుండి దేవిపై పుష్పవృష్టిని గురిపింపసాగిరి. గంధర్వులు గానము చేసిరి. అప్సరసలు నృత్యమొనర్చిరి. ఆకాశమందందఱును "భగవతికిజై, మహామాయకు జై, జగదంబికా భవానికి జై, అటల ఛత్రకు జై"యను జయధ్వానము లొనర్పసాగిరి."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇది నేనత్యంత సంక్షేమ ముగ నసుహ్లాద పుత్రుఁడగు మహిషాసురుని వధా వృత్తాంతమును జెప్పితిని. ఇప్పుడు హిరణ్యకశిపుని నాల్గవ కుమారుఁడగు ప్రహ్లాదుని వంశమునుగూర్చి చెప్పెదను. మీరు సావధాన పూర్వకముగ వినుడు."



# దితి వలన మరుత్తుల యుత్పత్తియెట్లు ?

(౪౪౦)

శ్లో॥ మరుతశ్చ దితేః పుత్రాశ్చత్వారింశన్నవాధికాః।
త ఆసన్న ప్రజాః సర్వే నీతా ఇంద్రేణ సాత్మతామ్॥

శ్రీభాగ॥ ౬ స్కం. ౧౮ అ. ౧౯ శ్లో॥

వ. "మఱియు నాదితి సంతానంబులగు మరుత్తు లేకోన పంచాశత్సంఖ్యగలవార లందఱు ననపత్యులై యింద్రునితోఁగూడి దేవత్వంబు నొందిరి."

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రారబ్ధము యొక్కటి విచిత్రమైన మాయ. ఒక్కొక్కడెచ్చటనో పుట్టును నెచ్చటనో ప్రసిద్ధినిఁ జెందును. ఉచ్చకులమున నీచప్రకృతిగల పురుషులు పుట్టుచుందురు. నీచకులమందున భగవద్భక్త మహాపురుషులు జన్మించుచుందురు. మనమేదో భావనతోఁ గార్యమొనర్పఁబోవుచుందుము చివరకు దానిఫలము దానికి పూర్తి విపరీతముగ జరుగును. త్వష్ట యింద్రునిఁ జంపు పుత్రునుత్పన్నము చేయఁ దలచెను. కాని దైవ వశమున నింద్రునిచేఁ జచ్చుపుత్రుఁడు పుట్టెను. నిత్యమిట్టి సంఘటనములను జూచుచుండఁగా శక్తికొలఁది పురుష ప్రయత్నము చేయవలయునని నిశ్చయింపఁబడినది.ఏలయనఁగాఁ బురుషప్రయత్నమొనర్పక ప్రారబ్ధము ప్రకటముకాదు. ఇది మన ప్రారబ్ధములోఁ గలదో లేదో మనకుఁ దెలియదు. పూర్వజన్మ పురుషార్థముచేతనే ప్రారబ్ధరచనము జరుగును.

కావునఁ గర్మనొనర్చునపుడు కర్మచేయుటయందే మన కధికారముగాని ఫలము ఈశ్వరేచ్ఛయందాధారపడి యున్నదని నిశ్చయించుకొనవలయును

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా! నేను హిరణ్యకశిపుని సంహ్లాద, అనుహ్లాద, హ్లాదులను నీ ముగ్గురు పుత్రుల వంశవర్ణనమును మీకు గావించితిని; ఇప్పుడందఱ కంటెఁ జిన్నకుమారుఁడును, బరమ భాగవతుఁడునగు ప్రహ్లాదుని వంశవర్ణనమును వినుము. మహారాజా! నీవు ఉత్సహింపకుము. నేను భక్తాగ్రగణ్యుఁడగు ప్రహ్లాదుని చరిత్రమును ముందు విస్తారముగఁ జెప్పఁగలను. ఇచ్చట ప్రసంగానుసారముగ నాతని వంశవర్ణనమును మాత్రము కావించెదను.

ప్రహ్లాదుని పుత్రుఁడు విరోచనుఁడు. ఈతఁడు పరమ బ్రహ్మణ్యుఁడయ్యెను. ఈతఁడు బ్రాహ్మణులైన దేవతలకుఁ దన ప్రాణములను గూడ నొసంగెనుఁ ఆ విరోచను పుత్రుఁడే దాతలలో సర్వశ్రేష్ఠుఁడగు బలిచక్రవర్తి. బలి వంటి సాహసులను, దాతలను నీ పృథియందు విరళముగనుందురు. బలిచక్రవర్తి భార్యపేరు అశన (రత్నావళి) ఆమె గర్భమున నూర్గురు పుత్రులుద్భవించిరి. వారందఱలో బాణాసురుఁడు జ్యేష్ఠుఁడును శ్రేష్ఠుఁడును నయ్యెను. ఈతఁడు భూతనాథుఁడగు శంకరున కనన్యభక్తుఁడు. తన అనన్య శివభక్తివలననే ఈతనికి శివభక్తులలోఁ బ్రముఖత ప్రాప్తించెను. ముందీతని చరిత్రము విస్తారముగ వర్ణింపఁబడును. ఇప్పటికి హిరణ్యకశిపుని వంశవర్ణనమైనది. ఇప్పుడిఁక హిరణ్యాక్షుని వంశ వర్ణనముగూడ వినుము.

కశ్యపుని వీర్యముచే దితిగర్భమునుండి హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను నిద్దరు పుత్రులుదయించిరి. హిరణ్యాక్షుఁడు రుషాభాను అను నామెను బెండ్లాడెను. ఆమె గర్భమునుండి తొమ్మిదిమంది పుత్రులు పుట్టిరి. శకుని, శంబాసురుఁడు, ధృషుఁడు. భూతసంతాపనుఁడు, వృకుఁడు, కాలనాభుఁడు, మహానాభుఁడు, హరిశ్మశ్రువు. ఉత్కచుఁడు వీరందఱును బరమవీరులు. అతి ఉత్సాహవంతులు. సురద్వేషులు మహా పరాక్రమశాలురు. అసురులు చాలమందికలరు. కాని దితి పుత్రులిద్దరి వంశవర్ణనమునే నేను మీకు గావించితిని. ఇప్పుడు నేనిఁక మహాభాగ వతుఁడగు ప్రహ్లాదుని చరిత్రమును జెప్పవలసియున్నది. దానికిది భూమికయని తెలిసికొనుము. ఈ దైత్యవంశకీర్తనముచే మాకేమియును ప్రయోజనములేదు. భగవంతునితో వైరభావమును బెట్టుకొనినవారును. భగవద్భక్తులనగువారి చరిత్రలే భగవత్సంబంధముచే శ్రవణీయమైన దియుఁ గథనీయమైనదియునగుచున్నది.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! నేను దితియొక్క హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను నిద్దరు పుత్రుల వంశమును జెప్పితిని. వీరిద్దరే కాక దితికి నలుబదితొమ్మిదిమంది పుత్రులుగలరు, వీరిని నలుబది తొమ్మిది మరుత్తులందురు. వీరు దితి సుతులైనను దైత్యులనఁబడక దేవతలని పిలువఁబడిరి. ఈ నలుబది తొమ్మిదిమంది వేఱొక దేవగణము."

ఇదివిని పరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ! ఇది మీరు చాల విచిత్రముగఁ జెప్పుచున్నారే. దితి గర్భమునుండి పుట్టి మరుత్తులు దైత్యు

అని పిలువఁబడక దేవతలెట్లైరి? ప్రారబ్ధఖేలనము విచిత్రమైనది. ఈ విషయమును వినవలయునని నాకుఁ గుతూహలము జనించుచున్నది. పెక్కిది యుచితమని తోఁచినచో నీ ప్రసంగమును మీరు నాకుఁ జెప్ప వలయును. వీరసురులయ్యు దేవభావమును జెందుటకీ మరుత్తులేమి శుభ కర్మ నొనర్చిరి? ఈ విషయములో నేనే యాశ్చర్యాన్వితుఁడనగుటకాదు, ఈ పరిషత్తునందుగల ఋషులును, మహర్షులును నీ విషయము నెఱుఁగు టకు సముత్సుకతను జూపించుచున్నారు. కావునఁ గృపతో నీ పరమ రహస్య మయమగు నుపాఖ్యానమును మాకుఁజెప్పుఁడు."

పరీక్షిన్మహారాజు యొక్క యీ యుత్సాహమునుగాంచి వ్యాస నందనుఁడగు శ్రీ శుకదేవుఁడు మిక్కిలి యానందమును జెందెను. ఆతఁడు రాజుయొక్క ప్రశ్న చాతురికి పరమ ప్రముదితుఁడయ్యెను. మహారాజు వాక్యములు వినయ యుక్తములుగనుండెను, బాగుగా భావమును ప్రకటించునవిగను, సారగర్భితములుగను నుండెను. ఇట్టిమనోహర జిజ్ఞాసా పూర్ణవచనములనువిని పరమహంస చూడామణియగు శ్రీ శుకుఁడాతని. ప్రశంసించుచు నిట్లనెను:- రాజా! నీవు చాల ఉత్తమమగు ప్రశ్నను గావించితివి. ఈ యుపాఖ్యానముచే భాగ్యము యొక్క విడంబనమును. భగవంతుని భక్తవత్సలతయును ప్రకటమగుచున్నది. నేనీ పరమపావన మగు నుపాఖ్యానమును మీసమ్ముఖమునఁ జెప్పెదను. నీవీ సమస్త ఋషులతో దీనిని శ్రవణము చేయుము."

మహారాజా! భగవానుడు సూకరరూపమును ధరించి హిరణ్యాక్షుని నృసింహరూపమున హిరణ్యకశిపునిఁ జంపఁగానే యీ యిద్దరకును

దల్లియగు దితికి మిక్కిలి దుఃఖము కలిగెను. ఆమె యిట్లనుకొనెను:- విష్ణువు సమదర్శి. ఆతనికి శత్రువులుగాని మిత్రులుగాని లేరు. కాని యమాయకుఁడు. ఆతఁడత్యధిక స్తుతిప్రియుఁడని తోచుచున్నది. ఈతని వెంటఁబడినవారి యెడలను, స్తుతి ప్రశంసలను చేయువారి యెడలను శీఘ్రముగ ప్రసన్నుఁడై ఆతని పక్షమును వహించి చేయరాని యనుచిత కార్యములనైనఁ జేయుచుండును. నా పుత్రులాత్మాభిమానులు. వారు విష్ణువు కడకుఁబోరు. ఇంద్రాది దేవతలీతని వెంటఁ దిరుగుచుందురు. ఆతఁడేమనిన దానినంగీకరించెదరు. ఆతఁడేదిచెప్పిన దానినిఁ జేయు చుందురు. అన్ని విధముల నాతని కధీనులై యుందురు. వీరే ఆయీ మాటలనుజెప్పి నాపుత్రులకు విరుద్ధముగా ఎంచినారు. స్వర్గ సుఖమును నిష్కంటకముగ భోగించుటకు నాపుత్రులను జంపివైచిరి. ఈ దోషమంతయును శతక్రతువగు నింద్రునిది. కావున నీకు ప్రధాన శత్రువు నా సవతికొడుకు నీయింద్రుఁడే. ఈతఁడు మిక్కిలిక్రూరుఁడు. ఈతనిచిత్త మత్యంత నిష్ఠురమైనది. తన సోదరులను హత్యకావించి యీ స్వర్గసుఖమును భోగింపఁ జూచు చున్నాఁడు. సోదర రక్తరంజిత విషయ ములను భోగించి యీతఁడు సుఖింపఁగోరుచున్నాఁడు. ఈతఁడు విషయ లోలువుఁడగు పాపాత్ముఁడు, నిర్దయుఁడు. ఏ విధముగనైన నీ పాపా త్ముఁడు చచ్చునుపాయ మేదైనఁజేయవలయును. ఇంద్రుఁడు చచ్చినచో నేను సుఖముగనిద్రించెదను. చచ్చిన నాపుత్రులకు ప్రతీకార మొనర్చి నేను సంతోషించెదను."

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఎవరిమీదనైనను క్రోధము

కలిగినదా ఆతనికి వానిలో నంతయును చెడ్డతనమే తోచుచుండును. ద్వేషకారణమున నొక్క గుణమైనను గనఁబడదు. దితి పుత్రశోకమున నంధురాలైనది. ఆమె వివేకము నశించెను. ఆమె యిట్లనుకొనెను:- "ఇంద్రుఁడెంతటి నీచుఁడు క్షణిక సుఖము కొఱకు ఈతఁడు తన తండ్రి కుమారులను, సోదరులను జంపుచున్నాఁడు. ఈ నశ్వరమైన శరీరము కొఱకు హత్యనొనర్చుటెంత యుచితము. శరీరము రాజుది కానిండు దరిద్రునిది కానిండు గతులు మూఁడే. కాల్చినచో మట్టి బొగ్గగును. నీటిలోఁగాని అరణ్యమునఁగాని పాఱవైచినచో నక్కలు, కుక్కలు, తాఁబేళ్లు మొదలగు జీవులుతిని మలముగ విడుచును. భూమిలోఁ బాతి బెట్టినచోఁ బురుగులుపడును. ఈ తుచ్ఛ శరీరపాలన పోషణము కొఱకు ప్రాణులను హింపించుట పాపులపని. ఈ సాంసారి సుఖములకొఱకు పాపమొనర్చు వాఁడును, ప్రాణులను ద్వేషించువాఁడును. వైరభావమును బెట్టుకొనువాఁడును, నరకాగ్నిలో ననుభవింపవలసి వచ్చును. యమ సదనమున ననేకవిధముల యాతనల ననుభవింపవలసి వచ్చును. నాపుత్రులను జంపించువాఁడీ యింద్రుఁడే. వీఁడెట్లు చచ్చునో అట్టి యుపాయ మొనర్పవలయును."

మరనామె యిట్లనుకొనెను:- "ఇంద్రుఁడు చచ్చును పాపము నేనేవిధముగఁ జేయుదును? విష్ణు నారాధించినచో విష్ణువింద్రుని పక్షము వహించునేమో! కావున నేను సర్వసమర్థుఁడగు నానాథునే ఆశ్రయింప వలయును. నేనాతని నా సేవా హావభావ కటాక్షములచే వశపఱచు

కొందును. ఆతనినే ప్రసన్నునిఁగా జేసికొని యింద్రునిఁజంపు పుత్రు నడిగెదను."

శ్రీశుకదేవుఁడిట్లనెను:— "రాజా! స్త్రీలు చాలపట్టుదల గలవారుగ నుందురు. వీరికే పట్టుదల యుండునో వారు దానిలోఁ దన్మయులగు చుందురు. వీరు శరీరము మఱచిపోవుదురు. వీరి మనస్సులోని విషయ మెవరికినిఁ దెలియదు. కాని వీరి సేవా శుశ్రూషలచేఁ బాషాణములైనఁ గఱఁగిపోఁగలవు. ఏవిధముగను వశపడని వ్యక్తులుకూడ వీరి సేవా చాతురిచే వశమగుదురు. ఈ విధముగ దితి తనమనస్సులో నిశ్చయ మొనర్చుకొని పరమానురాగ వినయములతో నింద్రియములను వశపఱచు కొని నిరంతరము తన పతియగుఁ గశ్యపుని సేవా శుశ్రూషయందు దత్పరయైయుండెను. ఈమెకుఁ బతిభావములు బాగుగఁ దెలియును. ఆతఁడెప్పుడు ప్రేమించునో, ఆతనిఁ దానెప్పుడు లాలింపవలయునో ఆమెకు బాఁగుగాఁ దెలియును. కావున నామె తన ఉత్కట భావముల ద్వారా, మంద మంద హాసమయ కటాక్షభంగిమల ద్వారా, మధుర మనోహర వచనముల ద్వారా, తన పతిని సంతోషపెట్టసాగెను. తన భార్య యిట్టిసేవలు చేయుచుండ నామె సేవకు బ్రసన్నముకాని కృత ఘ్నుఁడగు పురుషుఁడెవడుండును కశ్యపుఁడామె వలలోఁబడెను. ప్రేమ జాలములోఁబడి ఆమెకధీనుఁడై పోయెను. ఈమె లోపల నేమిస్వార్థము కలదో పాపమాతనికేమి తెలియును? ఈమె యేయభిప్రాయముతో నీవిధముగ సేవించుచున్నదో ఆతఁనికేమి తెలియును?"

శ్రీశుకదేవుఁడిట్లనెను.- "మహారాజా! తన భార్య యొనర్చు సేవలకు సంతుష్టుఁడై కశ్యప భగవానుఁడామెకు వరము నొసంగ సిద్ధపడెను.



## దితి పతిని ఇంద్రునిఁజంపు పుత్త్రుని యాచించుట

(౪౪౧)

శ్లో॥ వరదోయది మే బ్రహ్మన్ పుత్రమింద్రహణం వృణే।
అమృత్యుం మృత పుత్త్రాహం యేన మేఘాతితౌసుతౌ॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౮ అ. ౩౩ శ్లో.

"ఆ. వరము గోరనాకు వరదుండ వేనివి
నింద్రుఁ ద్రుంచునట్టి యిద్ధబలుని
నమిత తేజుఁదనయు నమరత్వ సంప్రాప్తు
నెందుఁజెడనివాని నిమ్ము నాథ"॥

శ్రీమదాంధ్ర భాగవతము.

హృదయమున ద్వేషాగ్ని ప్రజ్వలించుచున్నప్పుడు స్వపర భేదము నశించుచుండును. హృదయములోనికిఁ గ్రూరత్వము ప్రవేశించి, ఆక్రూరత్వమును నే సాధుపురుషుని ద్వారా నైనఁ జేయింపఁదలచినచోఁ గొంతకాలము వఱకు స్వార్థులు సాధు స్వభావమున కనురూపముగ

ననుచుందురు. వారు తమ మనస్సును వశమందుంచుకొని చిత్తమును జంచలము కానీయరు. ఇంద్రియ సంయమము కావించెదరు. సమస్త సుఖములకును దిలాంజలుల నొసంగుదురు. ఆ సాధుపురుషులకు సర్వదా అదీనులగుదురు. మనస్విపురుషులవలె సుఖ దుఃఖములందు సమాన భావముతో నుండి తమకోరిక నెఱవేరు ప్రయత్నములోనే యుందురు. అందుకనియే మనీషులు స్వార్థులను మనస్విలను నొక్కటిగనే చెప్పిరి. ఇద్దరకును భేదమేమనఁగా మనస్విలు దానిని హృదయ పూర్వకముగఁ జేయుదురు. చేయుచునే యుందురు. స్వార్థులు కార్యార్థులై కపట భావముతోఁ జేయుచుందురు. అంతవఱకు మనస్సును వశమందుంచుకొని ఆ కార్యమగునంతవఱకు నొనర్చుచుందురు. కార్యసిద్ధికాఁగానే వారు దానినుండి నివృత్తిని జెందెదరు. తమ యథార్థరూపమును ప్రకటించెదరు. వారి యదృష్టము పుచ్చెనా మహాపురుషులు వారి ధూర్తతను గనుగొందురు. ఇట్టివారి కెన్నటికిని మేలు కలుగఁబోదు. వారు తరువాతఁ బశ్చాత్తాపము చెందవలసివచ్చును.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! దితి కశ్యపుఁడు వశపడు నంతగా సేవయొనర్చెను త్రైలోక్య వందితుఁడును, జ్యేష్ఠుఁడును నగు తన పుత్రుఁడగు నింద్రుని జంపుటఁ కింతటి సేవ యొనర్చుచు చున్నదనియు ఈమె మధురవాక్కులు విషభరితములై యుండెననియు, మృగమును బట్టుటకై వేటకాఁడు మధుర సంగీతమును సుమధుర స్వరమున గానము చేయునట్లీమె యిట్టి మధురసంగీతమును దన్ను వశమొనర్చు కొనుటకు చేయుచున్నదని ఆతఁడు తెలిసికొనఁజాలకపోయెను. ఆతఁడామెకు వశుఁడయ్యెను."

అంతఁ బరీక్షన్మహారాజిట్లడిగెను :— "ప్రభూ : కశ్యపుఁడు విద్వాంసుడు, ఆలోచింపఁగలవాఁడుగదా, ఆతఁడీమె మాయాజాలములో నెట్లుపడినాఁడు ?"

ఇదివిని నవ్వుచు శ్రీ శుకుఁడిట్లనెను:- "రాజా! ఈ స్త్రీయను మహామాయ చాల బలవత్తరమైనది. ఈమె గొప్ప గొప్ప యోగులను గూడ తనవలలోఁబడవైచుకొనును. పైఁగా సేవయెట్టిదనఁగా నీ సేవచే నెట్టి మానవునైనను వశపఱచుకొనవచ్చును. ప్రపంచములోఁగల మోహక వస్తువులన్నిటిలో నీ స్త్రీరూపమగు మాయయే అధిక మోహక మైనది. ఈమె నిలుచుండుట, కూర్చుండుట, మాటలాడుట, కదలిక, నడచుట, వైఖరి, నవ్వు, కోపము, రోదనము, స్పర్శ, వాక్కు, ఎన్నని చెప్పఁగలను సమస్త చేష్టలును హృదయమునకుఁ బ్రియమును గలిగించునవియే. పైఁగా నామె రూపవతియు, బుద్ధిమతియునగుచో నప్పుడు బ్రహ్మనైనను వశపఱచుకొనఁగలదు. ఇఁక సాధారణుల విషయము చెప్పవలసిన దేమున్నది ? స్త్రీ సేవచే నెంతటి వజ్రహృదయము కలవాఁడైనను వశపడిపోవును. అట్టియెడఁ గశ్యపునివంటి సహృదయుఁడగు మునివిషయమునఁ జెప్పవలసిన దేమున్నది ? సేవాసంతుష్టుఁడగు పురుషునిచే స్త్రీ యేమైనఁ జేయింపఁగలదు. బుద్ధిమతియగు స్త్రీకి దీనినిఁ జేయించుట యేమంత ఆశ్చర్యకరమగువిషయముకాదు. స్త్రీయందాసక్తినిఁ జెందినవాఁ దేసనినైనఁ జేయుటయును నాశ్చర్యకరమగు విషయమును గాదు. బ్రహ్మాండమును సృజించిన బ్రహ్మయు నీమాయలోఁ బడినాఁడు."

అంత రాజిట్లడిగెను :- "స్వామీ ! ఈ స్త్రీ జాతి కంతటి మోహకత యెట్లువచ్చినది?"

నవ్వి శుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఇదంతయును నీ నలుమొగముల పితామహుని విషవృక్షము. ముక్తి కొఱకు మానవుఁడెంతగా యోచించుచుండునో అంతగా బంధనముపడును. విషయమిది. సృష్ట్యాదియందు బ్రహ్మకు సృష్టిచేయవలయునను మిక్కిలి చింతకలిగెను. ఆతఁడు చాలమంది ఋషులు, మునులు మొదలగు మానసిక సృష్టినిఁ గావించెను. ఎవరు సృజింపఁబడుచుండిరో వారందఱునుబోయి తపస్సులోఁ గూర్చుండిరి. భగవద్ధ్యాన విమగ్నులైరి. వారికెవరితోడను సంబంధము లేకుండెను. అందఱకు నేకాంతమే ప్రియముగనుండెను. దీనికి బ్రహ్మ అత్యధికముగఁ జింతించి యిట్లనుకొనెను;- ఇట్టి సృష్టి యెట్లు వృద్ధిపొందఁగలదు. ధ్యానమొనర్చుకొను విరాగులవలన సృష్టి వృద్ధిపొందు నాశలేదు. ఎంతగా నాలోచించినను బ్రహ్మకేనియును దోపలేదు. అప్పుడు భగవాను దేదైన మోహకవస్తువును మానవుఁడు బంధమునఁ బడునట్లు సృజించుమని ప్రేరణము కావించెను. దానినిఁ జూచిన నేకాంత ప్రియసతిఁగూడ వదలి మానవుఁడు దానికొఱకై యువ్విళ్లూరునట్లొనర్పఁదలచెను. ఈ భావము రాఁగానే బ్రహ్మ శరీరము రెండుగనయ్యెను. అందులో నొకటి ముక్కున బులాకి పెట్టుకొని నల్లని జడనూపుకొనుచుఁ గులుకుచు నటునిటు మదవతియై తిరుగుచుండెను. రెండవది దానియందనురక్తినిఁజెంది దాని చరణచిహ్నములననుసరించుచుండెను. ఆ బులాకినిఁ బెట్టుకొనిన మోహకభాగమే స్త్రీ

పేరుఁ బ్రసిద్ధినిఁజెందెను. అందుకనియే స్త్రీని అర్ధాంగిని యనుచుందురు స్త్రీ లేక పురుషుఁడు సగమే, పురుషుఁడు లేక స్త్రీ సగమే. ఇద్దరును గలసి ఒక్కటిగ నగుదురు. ఒకదానినుండి అనేకము కలుగును. శనగ గింజలో సగభాగమును భూమిలోఁ బాతిపెట్టుచో నది యెన్నటికి నంకు రింపదు, పుష్పింపదు, ఫలింపదు. ఈ రెండుభాగములలో స్త్రీ భాగ మధిక ఆకర్షవంతమైనది. దీనినిఁజూడఁగానే ఋషులును, మునులును, మాలలు, బోలెను, వదలి గృహస్థులుకాఁ బ్రయత్నించెదరు. బ్రహ్మ బండినడక నారంభించెను. సంసార చక్రము తిరుఁగ బ్రారంభించెను. పురుషుఁ డున్మత్తుఁడై నారీసందేశమున నాట్యమాడసాగెను. రాజా ! దీనికి నీవాశ్చర్యమును జెందపనిలేదు. స్త్రీప్రేమతోఁజేసిన సేవ మోహక ముగ నుండును. నీవు ముక్తభోగివికాలేదా ! ఏలయైనావు ?"

లజ్జితుఁడై పరీక్షిన్మహారాజిట్లనెను :- "స్వామీ ! శాస్త్రకారుల యనుభవము మిథ్యలు కావు. అట్టే జరుగును-పరియే తర్వాత నేమైనది"

శుకదేవుఁడిట్లనెను:- "రాజా ! అయినదేమున్నది ? హరిణము వలలోఁబడినచో దానినెట్లయిన నుపయోగించు కొనవచ్చును. ఒక దిన మునఁ గశ్యపుఁడు ఆమెస్నేహమయమగు సేవకు సంతుష్టుడై ఆమెతో నిట్లనెను :- "ప్రియా ! నేను నీశీలస్వభావమునకును, నీప్రేమకును, సేవకును బరమసంతుష్టుడ నైతిని. భామినీ ! అనిందితా ! నీవు నన్నే దైన వరమడుగుము. దుర్లభమగు నీసేవకు దుర్లభమగు వరమడిగినను నిచ్చుటకు సిద్ధముగ నున్నాను."

ప్రేమమానములచే మునిమనస్సు మోహింపజేయుచు నా భామిని యిట్లనెను :- "పోనిండు ; మీరు వరదానము గిరదానము నేమియొసం గెదరులెండు. మీరిట్లు నన్ను ప్రేమించుచుండినఁజాలును. ఇదియే నాకు బదివేలు. నేనేదైననడిగిన దానిని మీరియఁజాలకున్నచో నిద్దరిమాటలు వృథయేకాఁగలవు. నిట్లుండుటయే బాగు."

తనమాటమీఁద నిలుచు మునియిట్లనెను :- ప్రియా ! నీవెట్టి మాటలు మాటలాడుచున్నావు. నీకు నామీద విశ్వాసము లేదాయేమి ?"

అంత నదితి యిట్లనెను :- స్వామీ ; విశ్వాసము లేక పోవుట కాదు, నాకొక భయమున్నది. నేనేదైన దుర్లభ వస్తువు నడిగినచో మీరు సంకోచములోఁ బడెదరేమో ?"

అత్యంత స్నేహముతో మమతనంతను గుమ్మరించుచుఁ గశ్య పుఁడిట్లనెను:- "ప్రియా! నీవు నన్ను వరమడుగుటకు సంకోచింప కుము. భర్తప్రసన్నుఁడైనచో పతియగు స్త్రీకి దుర్లభమేదియునులేదు. ఆకోరునది ఈ లోకమునకు సంబంధించిన దైనగానిండు. నేను నీ సమస్త మనోరథములను నెఱవేర్చెదను."

అంత భక్తినిఁజూపుచు దితి యిట్లనెను :- "ప్రియా మీరే నాకు బూజనీయులు, ఆరాధనీయులు, ఇష్టము. ప్రపంచములో మీరుతప్ప నాకెవరున్నారు?"

అంతఁగశ్యప భగవానుఁడిట్లనెను :- "ప్రియా ! నేనెంత ? పూజనీయుఁడా సర్వాంతర్యామియగు హరియే. ఆ వాసుదేవ భగవానుఁదే

సమస్తప్రాణుల యంతఃకరణమున విరాజిల్లుచు నామరూపభేదముచేఁ గల్పనఁ జేయబడినది. భగవంతుని నెవరేభావముతో భజించెదరో వారి కాభావముతోడనే దర్శన మొసంగును. నీవే దేవతో పాసన మొనర్చినను సమస్త రూపములందును నఖిలేశుఁడగు నచ్యుతుఁడే పూజింపఁబడుచున్నాఁడు. సతీ సాధ్వులగు స్త్రీలాతనినే పతిరూపమునఁ బూజించెదరు. కావున నీవుకావించు నర్చనవందనాదులు నా పాంచభౌతిక శరీరమునకుఁ గాదు. నీవు అంతర్యామియగు శ్రీహరినే పూజించుచున్నావు. నీవు నిష్కపట భావముతో నీశరీరసుఖములనుపదులుకొని నాపూజనుగావించితివి. కావుననేఁడు నేను నీసమస్త కోరికలను నెఱవేర్చెదను. నీవు నన్ను నీకిష్టమువచ్చిన వరమును గోరుకొనుము. నా కోరిక నెఱవేఱునో లేదో యని సందేహింపకుము. నీవు నీకోరిక నెఱవేరినదనియేతెలిసికొనుము"

శ్రీశుకదేవుఁడిట్లనెను :- రాజా ! సమస్త విధములఁ గశ్యపుఁడు తనకు వశపడినాఁడని తెలిసికొని దితి తనహృదయమును రాయిచేసుకొని విషభరితమగు మధురవాక్కులను పలికెను. ఆమె యిట్లనెను :-"స్వామీ మీరు హృదయ పూర్వకముగ నాయెడలఁ బ్రసన్నులరైనచో, నిజముగ నాకు వరమీయఁ గోరునెడల నాకొకపుత్రుని దయజేయుఁడు."

కశ్యప మహాముని యిట్లనెను :- "ఈయల్ప విషయమునకై యింతటి భూమికను జరిపితివే. ఇందెంతమాట, ఒకటికాదు.

మధ్యలోనే మాటనందుకొని దితి యిట్లనెను:- "కాదుస్వామీ ! నేనట్టి సాధారణపుత్రునిఁ గాంక్షించుటలేదు. విశ్వవిజయులును, పరమ

పరాక్రమవంతులును, త్రైలోక్య విఖ్యాతులునగు హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను పుత్రుల నీయధముఁడగు నింద్రుఁడు చంపించినాడు. ఈసారి నేనింద్రునిఁ జంపు పుత్రుఁడు కావలయునని కోరుచున్నాను. నాసవతి కొడుకును, సమృద్ధి శాలియును, నీర్ష్యాళువును, పరసంపత్తినిఁ గాంచి అసహిష్ణుతనుగల శతక్రతువును యమపురమునకుఁ బంపువాఁడుగ నుండవలెను. రణమున నతనిని వధించువాఁడుగ నుండవలెను. ఇట్టి ప్రబల పరాక్రముఁడగు పుత్రుని నాకొసంగవలెను."

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! దితియొక్క యీ వాక్యము లను విని కశ్యప భగవానుఁడు నిర్ఘాంతపోయెను అతఁడేమియును మాట లాడఁజాలక పోయెను. అతఁడౌను అనఁజాలకపోయెను, కాదనఁజాలక పోయెను."



# కశ్యపుడు దుఃఖితుఁడై నీతిపూర్వక వరమునొసంగుట

( ౪౪౨ )

శ్లో॥ పుత్రస్తే భవితాభద్రే ఇంద్రహా దేవబాంధవః।
సంవత్సరం వ్రతమిదం యద్యంజోధారయిష్యసి॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౮ అ. ౪౫ శ్లో.

వ. (కశ్యపుఁడు) దితిం జూచి యోతనుమధ్య నీకునట్లు దేవ బాంధవుండయిన యింద్రహంతయగు పుత్రుఁడు గలిగెడు నొక్క సంవత్సరంబు వ్రతంబునం జరియింపుము."

శ్రీమదాంధ్ర భాగవతము

క్రోధము పాపమునకు మూలమని చెప్పఁబడినది. క్రోధమును జెందిన స్త్రీగాని పురుషుఁడుగాని తమ శరీరము తమకు తెలియకుందురు. వారినెత్తిన భూతమెక్కి తాండవమాడుచుండును. వారు కర్తవ్యా కర్తవ్య జ్ఞానమును బోఁగొట్టుకొందురు. స్త్రీలెంత కోమలాంగులుగ నుందురో కుపితులైనచో వారంత కఠోరులుగనుందురు. వీరు తమ స్వభావములో నుండఁగా నెంతటి దయామయులుగను, మమతామయులుగను, ప్రేమ మయులుగ నుందురో, వారు ప్రతికూల స్వభావము కలవారగుచో నంత నిర్దయులుగను, క్రూరస్వభావులుగను, వజ్రహృదయులుగ నుందురు. సాధారణముగ స్త్రీలలోఁ బురుషులకంటె నస్థిరతయు, జంచలతయు నెక్కుడుగనుండును. శీలసంకోచ సదాచారములందున్న స్త్రీయే నారి, వీనినది పరిత్యజించెనా ఆమె రణచండియగును.

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! దితి తన పతియగు గశ్యపుని నింద్రునిఁజంపు పుత్రునిమ్మని వరముకోరఁగా ముని ధర్మసంకటమునఁ బడెను. ఇప్పుడాతఁడు కన్నులను దెఱచెను. ఇప్పుడాతఁడు రహస్యమును దెలిసికొనెను. ఇది స్వార్థసేవ, కపటప్రేమ, మోహపు స్నేహము. పయో ముఖ విషకుంభము. విషభరిత కనక కలశము. ఇప్పుడు నేనేమి చేయ

పలయును. నేనీమెకు వరము నొసంగునెడల సర్వశ్రేష్ఠుఁడును, దేవతా ధీశ్వరుఁడును, త్రైలోక్య వందితుఁడునగు నాపుత్రుఁడు వధింప బడు టకు గారణము నేనగుదును. వచ్చి నరకయాతనలు పడవలసియుండును. మాటయిచ్చి, ప్రతిజ్ఞనొనర్చి యీతనికి వరము నీయకుండినచో నేను మృషావాది నగుదును, అసత్యమునకు మించిన పాపమీ ప్రపంచమున నింకొకటి లేదు."

నాకు బుద్ధినిఁజూడుఁడు. నేనింద్రియలోలుఁడనై యీ యబలా చాకచక్యములకు మోసపడి నన్ను నేనే మఱచిపోయితిని. ఈముని మన మోహినియును, మహిళారూపమగుమాయ నా మనస్సునుగూడ మధించి వైచినది. నన్నుగూడ కొయ్యబొమ్మగాఁజేసి యిచ్చానుసారముగ నాడించినది.

ఈస్త్రీలు బాలికలగు నంతవఱకు ప్రీతిగనుందురు. వీరు యథార్థ మగు సతీధర్మమున నున్నంతవఱకే అట్టి మంచి నడక ఇదికాక వీరి కిష్టము వచ్చినది చేయుచు, స్వచ్ఛందముగ నిష్టము వచ్చినట్లు తిరుగు చుండిన వీరికి వివేకముండదు. వీరి మనస్సులో నేమి తలచుకొనినను దానినఁనేకోపాయములచేఁ జేసి తీరుచుందురు. చూచుటకు మిక్కిలి యమాయకులుగను, సరళముగను గనఁబడుచుందురు. లోపల నెంతో రాగద్వేషములు నిండియుండును. హృదయము కఱకు కత్తులధార తిరుగు చుండునుగాని పైకి అతినీలాలకములు, కమ్మని జడలు, శరత్కాల కమల కుసుమ సదృశమగుఁ దనమనోహర ముఖమునఁ దనమంద మందహాస

ముచే సదా ప్రఫుల్లిత మొనర్చుచుండును. వాక్కులమృతరసములో మునిఁగి, వచ్చుచుండెనా యవి యనుపించునట్లుగ నుండును. వీరికెవరి వలనఁదమ యభిలాషము బూర్తికావించు కొనఁదలఁతురో వారికతిగ ననుకూలురై ప్రాణములకు మించిన ప్రియతములుగఁ గనఁబడుదురు. కాని యిట్టి స్వార్థతత్పరలు, కులషస్త్రీలకు స్వపరభేదముండదు వారికి ప్రియులునుండరు, బాంధవులుండరు. వారు తమ స్వార్థముకొఱకు పతిపుత్రులను పితృ సోదరులను, నింక నే సంబంధులనైన హత్య గావించెదరు. పతిపతిదై యుండును గాని కామిని యెవ్వరికినిఁగాదు.

ఇట్లాలోచించుకొని ముని మరల నింకొకవిధముగ నాలోచించెను. అతఁడిట్లనుకొనెను:- "ఇంతలో నీమె దోషమేమున్నది ? నేనొక్క యామెకొఱకై సమస్త స్త్రీలను దెగడుచున్నాను. తనవస్తువు మంచిది కాకున్నచోఁ గొనువాఁడు మంచిదెట్లనును. సుఖ దుఃఖములను బెట్టువారి తరు లెవరునులేరు. మనుష్యుఁడు తనవాసనలో బంధింపఁబడి పాపభాగి యగును. నేనుజితేంద్రియుఁడనుగాక, నాయింద్రియములను సంయమము కావింపకున్నచో నేఁడీ విపత్తేల వచ్చును? నేను విషయ భోగములఁ బడితిని. స్త్రీసుఖమే సర్వస్వమనుకొని దానికధీనమైతిని. ఈమె యొక్క మిథ్యా ప్రేమయందుఁ దన్మయుఁడనై నాయొక్క వాస్తవిక స్వార్థమును మఱచితిని. పాపము దీని దోషమేమున్నది? దోషము నాదియే. నేనే మాటిమాటికి వరములు కోరుకొనుమని ప్రేరేపించితిని, ఉత్సాహిత నొనర్చితిని, వివశనుగావించితిని. ఛీ ఛీ నాబ్రతుకు కాలస్త్రైణుఁడనైన

నాయొక్క తపము సంయమము, అగ్నిహోత్రము, వ్రతాదులన్నియును గాల్పనా నామనస్సు స్త్రీజనిత సుఖమందుఁ బడిపోయినది.

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! ఈ విధముగఁ గశ్యపభగవానుఁడు స్త్రీ పురుషులిద్దరియొక్క కామనిందను గావించుచు దుఃఖితుఁడయ్యెను. అతఁడు ధైర్యమునుఁవహించి మరల నిట్లాలోచించుకొనెను - నేఁటికైన నేమో అయినది. ఇప్పుడు నేనేమి చేయుదును. ఈమె కేవరము నొసంగుదును? కాదు, ఇట్టివరమొసంగఁజాలను. ఇంద్రవధ జరగ కుండునట్లును నామాట అబద్ధములు కాకుండునట్టి యుపాయమొక దాని నాలోచించెదను. ఈమెకపటముగ నున్నప్పటికిని యట్టి యవసరములందు క్షమింపఁదగినది. వరదానముతో నొక్క నియమమునుబెట్టి, అది పూర్తి కాకుండునట్లును, నింద్రుని జంపు పుత్రుఁడు పుట్టకుండునట్లు చేసెదను, "తొమ్మిది మణుగుల కాటుక వచ్చేదియులేదు రాధ ఆడేదిలేదు" "బాబా వచ్చేదిలేదు గంట మ్రోగేదిలేదు" అని ఆలోచించుకొని కశ్యపుడామెతో నిట్లనెను:- "ప్రియా! నీకింద్రునిఁగొట్టఁగల పుత్రుఁడు కలుగఁగలడు కాని దానికి తోడుగా నొక నియమమున్నది."

"అదియేమి? స్వామీ! అని దితియనెను.

కశ్యపుఁడిట్లనెను:- "అదేమనఁగా - నేను నీకొక వ్రతమును జెప్పెదను. నీవీవ్రతము నొక్క సంవత్సరము వఱకు నిర్విఘ్నముగ ధరించునెడల-ఆ వ్రతమే విఘ్నముమ లేకయే పూర్తియగుచో నీగర్భము నుండి యింద్రునిఁ జంపఁగల పుత్రుఁడుద్భవింపఁ గలడు. వ్రతలోప

షేదైన జరిగినను, నేఛిద్రమైననున్నను, దాని పరిణామము తలక్రిందు లగును. ఆతఁడింద్రహంతకుఁడు గాక దేవతలకు బంధువు కాఁగలఁడు."

దృఢస్వరమున దితి యిట్లనెను :- "స్వామీ ! నేనన్నిటినిఁ జేయఁగలను. మీరు నాకీ వ్రతదీక్ష నొసంగుఁడు. మీరెట్లు చెప్పిన నట్లే నేను మిక్కిలి జాగ్రత్తగ నావ్రతమును జేయుదును. ఏ విధముగను విఘ్నమును రానీయను. ఈ వ్రతములోఁ జేయవలసినదేమో నాకు ముందుగఁ జెప్పుఁడు. అనఁగా నేకార్యములొనర్చిన వ్రతభంగమగునో చెప్పుడు."

ఇదివిని కశ్యపుఁడిట్లనెను:- "నీవు పుంసవనమును నొనర్పుము. ప్రాతఃకాలమున నరుణోదయముననే లేవవలయును. శౌచాది నిత్యకర్మలు పూర్తి చేసికొని విధ్యుక్తముగ స్నానమొనర్పవలయును. స్నానమొనర్చి ధౌతవస్త్రమును ధరింపవలయును. పసుపు కుంకుమ సింధూరాది సౌభాగ్య చిహ్నములను ధరింపవలయును. పూటపూటకి భోజన మొనర్ప రాదు. భోజన మొనర్పకపూర్వమే గో, బ్రాహ్మణ లక్ష్మీనారాయణులకుఁ బూజ చేయవలయును. భగవత్పూజానంతరమున సౌభాగ్యవతులగు స్త్రీలు గంధమాలాదులను, ధూపదీప నైవేద్యములచేఁ బూజింప వలయును. తదనంతరమదే విధముగా శ్రద్ధాసహితముగఁ బతి పూజను గూడ చేయవలసియుండును. పతి యాజ్ఞను నెన్నడును నుల్లంఘింపరాదు. సదా ఆతని సేవయందే తత్పరయై యుండవలయును. ఆతని కనుకూలా చరణము నొనర్పవలయును, ఈతని తేజస్సు నా కుక్షిలోఁ బ్రవేశింప

వలయునని చింతింపవలయును. ఈతఁడే యింకొక రూపమునఁ దన కుక్షిలో నున్నాఁడని భావింపవలయును. ఇవి పుంసవనము యొక్క సదాచారము. వ్రతోపదేశమును నేను తర్వాతఁ జేసెదను. ఇవి దానిలోఁ జేయవలసిన కార్యములు."

అంత దితి యిట్లనెను:- "స్వామీ! మీరు వ్రతములోని కర్తవ్య కార్యములను నిర్దేశించితిరి. ఇంక నీవ్రతములో నేమి చేయరాదో వినఁ గోరుచున్నాను. నిషిద్ధాచరణమును గూర్చియు నేను వినఁగోరుచున్నాను. వ్రతభంగము కాకుండునట్టు చూడవలసియున్నది. ఇది చాలఅవసరము.

అంతఁ గశ్యపుఁడిట్లనెను:- "ఈ విషయములమీఁద జాగ్రత్తగ దృష్టి పెట్టికొనియుండవలయును. ఈ కార్యములనెన్నడును జేయరాదు.

1. ఎన్నడు నేప్రాణిని హింసింపరాదు.
2. క్రోధ వశీభూతవై యెవ్వరిని శపింపరాదు.
3. ఎన్నడు నబద్ధమును జెప్పరాదు. మౌనముగా నైననుండవలయును లేక సత్యభాషణమునైనఁ జేయవలయును.
4. నఖరోమములను వ్రతమునందు ఛేదింపరాదు.
5. అమంగళ, అశుచివస్తువును దాఁకరాదు. జలమును గ్రహించి దానితో స్నానము చేయవలయును.
6. జలములోఁ బ్రవేశించి స్నానము చేయరాదు.
7. పొరపాటుననైన కోపమును జెందరాదు.

8. దుష్టస్వభావము గలవారలతోడను, దుర్జనుల తోడను సంభాషింప రాదు.

9. ఉదుకని వస్త్రములను గట్టరాదు.

10. ఇతరులు ధరించిన నుచ్ఛిష్టమాలలను ధరింపరాదు.

11. ఎంగిలి అన్నమును దినరాదు.

12. భద్రకాళికి నివేదించిన అన్నమును దినరాదు.

13. మాంసయుక్తమగు భోజనమును బొరపాటుననైనఁ దినరాదు.

14. శూద్రుఁడు తెచ్చిన అన్నమును దినరాదు.

15. రజస్వల చూచిన అన్నమును దినరాదు.

16. దోసిలితో నీటినిఁ ద్రాగరాదు.

17. ఎంగిలి మూఁతితో నింటినుండి బయలుదేరరాదు.

18. భోజనముచేసి ఆచమనము చేయక బయటకుపోరాదు.

19. ప్రాతసాయంకాలములోని ఉభయ సంధ్యలయందును నిల్లువిడిచి పోరాదు. ఆ సమయమున భగవద్ధ్యానములో లీనము కావలెను.

20. ముడిజడవేయక తల విటియఁబోసికుని నిర్లజ్జ స్త్రీలవలె బయటకుఁబోరాదు.

21. సౌభాగ్యవతి చిహ్నములు అనఁగా బొట్టు, కాటుక మొదలగు

నవి ధరింపకయు. శృంగార మొనర్చుకొనకయు వింటినుండి బయటకుఁబోరాదు.

22. బయటకు బోయినపుడు జాగ్రత్తగ వాక్కును నియమించుకొన వలెను, అబద్ధములు, కటువచనమును, అప్రియ వచనములు పలుకరాదు.

23. వస్త్రమును ధరింపకయు, నేకవస్త్రముతోడను బయటకుపోరాదు.

24. పక్కమీఁదఁ బరుండునపుడు కాళ్లు కడుగుకొని నిద్రింపవలెను.

25. ఎంగిలిమూతి మొదలగు నేవిధమగు నపవిత్రతయున్నను నట్టి స్థితిలో శయ్యపైఁ బరుండరాదు. పవిత్రయై ఆచమించి నిద్రింప వలెను.

26. తడికాళ్లతోఁ బొరబాటుననైనఁ బరుండరాదు. కాళ్లుకడుగుకొని బాగుగాఁ దుడుచుకొనిన తరువాత శయ్యపైఁ గాళ్లుంచవలయును.

27. ఉత్తరముగఁగాని పశ్చిమముగఁగాని యెన్నడును నిద్రింపరాదు. నిద్రింప దలచినచోఁ దూర్పుతలగాఁగాని దక్షిణతలగాఁగాని పరుండవలెను.

28. ఇతరుల పక్కమీఁదగాని, ఇతరులతోఁగూడిపరుండరాదు.

29. మొండిమొలతోఁ బొరపాటుననైన నిద్రింపకుము.

30. ప్రాతస్సంధ్యా సమయమునను సాయంసంధ్యా సమయమునను నెన్నడును నిద్రింపరాదు.

ఈ విధముగ నుప్పది నిషిద్ధ విషయములు కలవు. వానిని జేయ కయే ఒకసంవత్సరము విధ్యుక్తముగఁ బుంసవనవ్రతము నొనర్చినచో నీమనోరథము నెఱవేరఁగలదు. దీనిలో దేనికైనను విఘ్నము సంభవించెనా దానిఫలము దానికి విపరీతముగఁ గాఁగలదు.

ఇదివిని దృఢతాస్వరమున దితి యిట్లనెను :- "స్వామీ! ఇందులోఁగఠిన విషయమేమియును లేదు. నేను సాధారణముగ నిట్లే జరుపుకొనుచుందును. ఇవి పాలింపవలసిన సదాచార శిక్షణము. నేను వీటిని పాలింపఁబడఁదగినవి కావునఁ బాలించెదను. త్యజింపవలసినవి త్యజించెదను. మీరునాకు పుంసవన వ్రతోపదేశమును గావింపుఁడు."

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా! దితికి అంగీకారముకాఁగానే కశ్యప భగవానుఁడు ఆమెకు విధ్యుక్తముగ గర్భాధాన సంస్కారము కావించెను. కశ్యప మహాముని అమోఘ తేజోయుక్తమగు వీర్యము దితిగర్భమందు ఆకాశమున శుక్లపక్ష క్షపాకరునివలె వృద్ధిపొందసాగెను. తనపతివలన గర్భము ధరించి దితి చాల జాగ్రత్తగ వ్రతనియమము లను బాటించుచుండెను.



# ఛద్మ వేషమున నింద్రుఁడు దితి గర్భచ్ఛేద మొనర్చుట

(౪౪౩)

శ్లో॥ మాతృష్వసురభిప్రాయమింద్ర ఆజ్ఞాయ మానద।
శుశ్రూషణేనాశ్రమస్థాం దితిం పర్యచరత్కవిః॥
నిత్యం వనాత్సుమనసః ఫలమూలసమిత్కుశాన్
పత్రాంకురమృదోఽపశ్చకాలే కాల ఉపాహరత్॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౮అ. ౫౬, ౫౭ శ్లో॥

మానవుఁడు జీవితాశచే సమస్త దుఃఖములను ధైర్యముగ సహించును. వానికి జీవనభయమున్నచో ధైర్యము వీడిపోవును. అతఁడు ప్రాణరణముగ మృత్యువును బోఁగొట్టుకొనుటకుఁ బ్రయత్నించును. ప్రాణులందరును మృత్యువునుండి బయటపడుటకై నిరంతరము ప్రయత్నించుచుందురు. ఏదోవిధముగ మృత్యువు రాకుండవలయుననియు, జీవించియుండవలయుననియు ప్రతిప్రాణి కాంక్షించుచుండును. ఎవరికి మృత్యుభయము హృదయమునుండి పారిపోయినదో, స్వేచ్ఛగా మృత్యువు నాహ్వానించుచున్నాఁడో అతఁడు సంసార బంధనమునుండి ముక్తుఁడైనట్లే. తదీయుఁడై పోవును. జీవితాశయున్నంతవఱకు సమస్తోపాయములచే మృత్యువును దప్పించు కొనుటకుఁ బ్రయత్నించును.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! ఎంత రహస్యముగాఁ బాప పుణ్యములొనర్చినను నవి దాగక యెప్పుడో ప్రకటములగును. ఏల

యనఁగా సూర్య, చంద్ర పంచభూతములును, దిశలును, ధర్మము విని మనస్సులోని విషయముల నెరుగును తన్నుఁ జంపుటకుఁ దన సవతి తల్లియగు దితి పుంసవన వ్రతమాచరించుచున్నదను సంగతి మయ దానవునిచే నింద్రునకుఁ దెలిసెను. ఆమె గర్భములోఁ దన తండ్రి యొక్క అమోఘ వీర్యము స్థాపింపఁబడినది. మా తండ్రి సత్య సంకల్పుఁడు. ఆతఁడు నప్పుటాలకైనను నబద్ధమాడఁడు, మా సవతి తల్లిచేయు సాంవత్సరిక వ్రతము నిర్విఘ్నముగఁ బూర్తియయ్యెనా నన్నుఁజంపు పుత్రుఁడుదయింపఁగలఁడు. ఏవిధముగనైన దీనికి విఘ్నము కలిగినదా యీ గర్భము వ్యర్థము కాఁగలదు. ఇప్పుడేదో విధముగ నీమె వ్రతమునకు విఘ్నమును గలిగింపవలయును. నేను విఘ్నమును మాత్ర మేమి చేయఁగలను ? ఈమె నియమ పూర్వకముగ నున్నంతవఱకు, సదాచారపూర్ణమగు జీవనమును గడుపుచున్నంతవఱకు నేనీమెను గన్నెత్తి యైనను జూడఁజాలను. ఇప్పుడు నేనేమి చేయుదును ?"

ఈమాటవిని శౌనకుఁడిట్లనెను :- "సూతా ! దితి గర్భము విష యము మయునకెట్లు తెలిసినది ? ఒకవేళ తెలిసినను గృహవిషయమును దేవేంద్రునకేల చెప్పినాఁడు ?

ఇదివిని సూతుఁడిట్లనెను :- "మహాభాగా ! మయాసురుఁడు మాయలన్నిటికిని బండితుఁడు. ఆతఁడు తన మాయచే నన్నిటిఁ దెలిసి కొనును. పైఁగా నసురుఁడు. దితి యింటిలోని విషయములన్నిటి నెఱుఁగఁగలఁడు. మిత్రత్వమునకు వశీభూతుఁడై యాతఁడింద్రునితో సత్యమునంతయు వెల్లడించినాఁడు."

ఇదివిని యింకను నాశ్చర్యమును చెందుచు శౌనకుఁడిట్లనెను :- "సూతా ! నీవొక్కదానికి మించిన మఱియొక యద్భుత విషయమును జెప్పుచున్నావు. దేవాసురులకు స్వాభావిక వైరము కలదుగదా ! మయాసురుని తమ్ముఁడగు నముచిని దేవేంద్రుఁడు తన వజ్రముచేఁ జంపినట్లు వినియున్నాము. భ్రాతృహంతకుఁడగు నింద్రునకును మయునకును మైత్రి యెట్లు కలిగినది ?

ఇదివిని సూతుఁడిట్లనెను :- "మునులారా ! ఈ విషయమున నొక పౌరాణిక కథకలదు. దానిని మీకు వినిపించెదను. విషయమేమనఁగా-పూర్వము నముచి దైత్యులందఱకును రాజు. ఇచ్చట ఇంద్రుఁడు దేవతలకు రాజు. వీరిద్దరకును ఘోర యుద్ధము జరిగెను. ఇంద్రునకు పరాజితుఁడగు శాపము కలదు. ఆతఁడు పరాజితుఁడై పాఱిపోయెను. ఇంద్రుఁడు యుద్ధమునుండి పాఱిపోవుటను గాంచి నముచి వెన్నంటెను. నముచితన్ను, వెన్నంటి వచ్చుటనుగాంచి చాల భయపడెను. ఆతఁ డైరావతమును వీడి సముద్ర ఫేనమును గ్రహించి నముచి మీఁద బ్రహారము కావింపఁగా నముచి చచ్చెను. ఇంద్రునకు మిక్కిలి యానందము కలిగెను.

మాయాసురుఁడు నముచికితమ్ముఁడు. తనయన్న యింద్రునిచేఁ జావఁగా మయునకు మిక్కిలి క్రోధము కలిగెను. ఆతఁడు తన యన్నను జంపిన వానిని జంపుటకై ఘోరతపస్సు నొనర్చెను. తపః ప్రభావముచే నాతఁడు దేవతలుకూడ యెఱుఁగనంతటి మాయలను

నేర్చెను. తన కఠోర తపశ్చర్యచేఁ జరాచర స్వామియగు శ్రీహరియును ప్రసన్నుఁడై అనేక శ్రేష్ఠవరముల నొసంగెను. మయాసురుఁడు గొప్ప యజ్ఞము లొనర్చెను, బ్రాహ్మణులను బూజించెను. యాచకులకుఁ గొల్ల లగ దానముల నొసంగెను. ఆతనిదానమునకు సర్వత్ర ఖ్యాతికలదు. బ్రాహ్మణులాతని హృదయముతో నాశీర్వదించుచుండిరి. ఇప్పు డింద్రుఁడు చాల భయపడెను. ఆతనికి భోజనముగాని స్వర్గసుఖములు గాని నచ్చలేదు. తాను మయుని నుండి రక్షింపఁబడుటెట్టులాయనియే యాతనికి రాత్రింబవళ్లు చింత. ఇంత ధర్మమొనర్చుచు, తన సేవనే బ్రాహ్మణులను సంతోషపెట్టువానిని యుద్ధమునఁ పరాజితుఁ జేయఁ జాలము. పైఁగా నీతఁడు విష్ణువుచే వరమును బొందినాఁడు. అనేక మాయల నెఱిఁగినవాఁడు. ఇట్టివానితో మైత్రి యొనర్చుటయే మేలు." అని యిట్లాలోచించుకొని యింద్రుఁడు బ్రాహ్మణ వేషమును ధరించి మయుని సమీపమునకుఁబోయి యాచకులు పలుకు దీనవాక్కులతో నిట్లనెను:- "రాజా! నేఁడు ప్రపంచములో మీదానము విషయమునఁ జాల ఖ్యాతికలదు. మీ వాఁకిట యాచకుఁడూరక విముఖుఁడై తిరిగి పోఁడని నేను వినియుంటిని. ఈయాశచేతనే నేను మీకడకు వచ్చితిని. మీరు నాకోరికను దీర్పుఁడు. నాకుమనోవాంఛిత వస్తువునొసంగుఁడు."

ఇట్టి యోగ్యుఁడగు బ్రాహ్మణునిఁ గాంచగనే మయాసురునకు రోమాంచితమయ్యెను. ఆతఁడానందమును బ్రకటించుచు నిట్లనెను:- "విప్రవరా! మీరు నన్నెంతగాఁ బ్రశంసించుచున్నారు. మీవంటి యోగ్యపాత్రమునుబొంది నేనుకృతార్థుఁడనైతిని. మీరు మీకోరిక నెఱవేరిన

దనుకొనుఁడు. మీరడుగఁ దలఁచినదేదో నిస్సంకోచముగ నడుఁగుడు."

విప్రవేషధరుఁడగు నింద్రుఁడిట్లనెను:- నీవు నాకు నామనోభిల షితమగు వస్తువు నీయఁదలచినచో నేను నీ మైత్రిని గోరుచున్నాను. నీవు నన్ను మిత్రునిఁగా నొనర్చుకొనుము."

ఆశ్చర్యముతో మయుఁడిట్లనెను:- "బ్రాహ్మణోత్తమా! మీరెట్టి పలుకులు పలుకుచున్నారు?" నేను బ్రాహ్మణులకు దాసుఁడను. నాకు మీకు ఇదివఱకెన్నడైన శత్రుత్వముండి యుండిన మిత్రత్వమును నెఱపి యుందును. నేడే నాకు మీ పరిచయము గదా! మిత్రత్వమేమిటి? నేను మీకు ఆజ్ఞాకారినగు సేవకుఁడనే. మీరింకను నేమైన వరమును గోరుఁడు."

స్నేహభరితమైనట్టియు, నుదారతాపూర్ణమైనట్టియు మయాసురుని వాక్కులను విని యింద్రుఁడు యథార్థరూపమునఁ బ్రత్యక్షమయ్యెను. మయుఁడిప్పుడేమి చేయఁగలడు? సజ్జనుల వాక్కొక్కసారియే వెలువడును. దానిని వారు జీవితాంతము వఱకు నిర్వహించుకొందురు. ఆతఁడు దుఃఖమును బ్రకటింపలేదు. మిక్కిలి సంతోషముతో నాశ్చర్యమును జెందెను.

మయుని వాక్యములను విని దేవేంద్రుఁడిట్లనెను :- "సోదరా! ఇప్పుడు నాబుద్ధి యేమియును బనిజేయుటలేదు. రాజస, తామస, దైవతా వ్రతమనుచో నెల్లో విఘ్నమును గావించెడువాఁడనే. ఇది వైష్ణవ

వ్రతము. వ్రతమున నేను విఘ్నమును గావింపఁజాలను. దైవవశమున దివిలో నేదైన లోపము జరిగెనా అవశ్యము విఘ్నము సంభవించును. ఏలయనఁగా మాతండ్రి యీమెతో నాసంగతియేఁ చెప్పియున్నాఁడు. ఏదో విధముగ నేనొక పత్రము ఈమెవెంటనుండుచు నీవ్రతములో సంభవించు ఛిద్రములను గాంచుచుండవలెను.

ఈవిషయములను మయునితోఁ జెప్పి ఆతనియనుమతిచే దేవేంద్రుడేడెనిమిదేండ్ల బాలకరూపమును ధరించి దితి కడ నుండెను. మాతృ స్వభావము దయాయుక్తముగనుండును. విశేషించి దుఃఖితులగు బాలకులను గాంచిన మాతృహృదయము కఱగిపోవును. ఆపిల్లవాఁడెవరైనది వారికక్కరలేదు. దితి మిక్కిలి ప్రేమతో నిట్లడిగెను:- "అబ్బాయీ! నీవెవఁడవు? ఏల యేడ్చుచున్నావు? నీకేమి కావలయును? నీ కేమి కష్టమున్నదో దానిని నాకుఁ జెప్పుము."

బాలక వేషధారియగు దేవేంద్రుఁ డశ్రువులను దుడుచుకొనుచు నిట్లనెను:- "అమ్మా! నేననాథుఁడను. నాకెవరునులేరు. నాకు జీవితాశయును లేదు. నీవాశ్రయ మిచ్చితివా నాప్రాణములు దక్కును. నేను నాచేతనైనంత వఱకు సేవ చేయుచుండెదను. నాకుఁదినుట కన్నముండినఁజాలును.

దితి యాబాలుని యమాయకత్వమునకు సంతసించెను. ఆమె మిక్కిలి పేమతో నిట్లనెను:- "వత్సా! నీవుమిక్కిలి ఆనందముగ

మండుము. నీకిష్టముండినఁ బనిచేయుము. ఇష్టము లేకున్న మాని వేయుము. నీకేవిధమగుఁ గష్టముండదు.

దితి యేకాంతమున నాశ్రమముననుండి చాల జాగ్రత్తగ వ్రత నియమములను బాలించుచుండెను. ఈఛద్మబాలకుఁడు మిక్కిలి భక్తి శ్రద్ధలతో నామెకు సేవచేయ నారంభించెను. అతఁడు ప్రతిదినమును పెందలకడ లేచి, దూరమున నడవికిఁబోయి మంచి పక్వఫలములను దెచ్చును, సుందర సుగంధిత పుష్పములను దెచ్చుచుండును. కొట్టుట కును హూమ మొనర్చుటకును సమిధలను గోసికొనితెచ్చును. పచ్చనికుశ లను గోసికొనివచ్చును. తులసీపత్రములను, బిల్వపత్రములను, ప్రసాదా దులనుంచుటకు పెద్దపెద్ద అరఁటి ఆకులను, పూజకొఱకు పచ్చనిగఱికను దెచ్చును. చేతులుకాళ్ళుకడుగుకొనుటకు శుద్ధస్థానమునుండి కోమలమగు పచ్చని మట్టినిఁ దెచ్చియుంచును. ఇంతలోఁ దల్లి నిత్యకర్మలు పూర్తిచేసి కొనును. ఇంద్రుడు జలమును దెచ్చును. ఆమె స్నానమైన తరువాతఁ దానును స్నానమొనర్చును. పూజాసామగ్రిని సిద్ధమొనర్చి, అగ్నినిఁ బ్రజ్వలింపఁజేయును. పాలుండిన వానిని సెగమీఁదబెట్టి వెచ్చఁజేయును. తల్లియొక్క పాత్రలను బూజాపాత్రలను శుద్ధముగఁ గడుగును. పూజ చేసి తల్లి భోజనముచేయగానే తన వ్యవహారముచే విస్వార్థుడుగఁ గనఁ బడుచుండెను. అతఁడు వ్రతములోనుండిన దితి వ్రతమును భంగమొన ర్చుటకై సమయము కొఱకు తత్పరతతోఁ బ్రతీక్షించుచుండెను.

శ్రీశుకదేవుఁడిట్లనెను :- "రాజా ! ఈ విధముగ సేవచేయుచుఁ జేయుచు నింద్రునకు దగ్గఱ దగ్గఱగా నొక వర్షము గడిచెను. సంవత్స

రము పూర్తియగుట కింక నొకటి రెండు దినములు మాత్రమే కలదు. ఆతఁడెల్లప్పుడును ఛిద్రాన్వేషణమందే సులగ్నుడై యుండెను. ఒక దినమున నేమి జరిగినదనఁగా - వ్రతమొనర్చుచు నామె మిక్కిలి క్షీణించిపోయెను. విధివిధానముచే నామె విమోహితయయ్యెను. శరీరము కొంచెము సుస్తిగ నుండెను. ఒకనాఁటి సాయంకాలమున నామె కొంచెముగ నాహారమును గ్రహించెను. తిని మూఁతి కడుగుకొనలేదు, ఆచమింపనులేదు. అట్లే కాళ్ళుకూడ కడుగుకొనకయే, తలను విఱియఁబోసికొని వెల్లకిలఁ బడియుండె. పరుండఁగానే నిద్రరాఁగా నిద్రించెను.

ఈ స్థితిలో నామె నిద్రించుటనుగాంచి యింద్రుఁడు మిక్కిలి సంతోషించెను. అందులో సంధ్యాసమయమున నిద్రించుట పాపము. పైఁగా నుచ్ఛిష్టముఖమునఁ గాళ్ళుకడుగుకొనక తలవిఱియఁబోసికొని వెల్లకిల శయ్యమీదఁబరుండెను. ఇది ఆమెవ్రతమునకు గొప్పలోటు. ఇంకేమున్నది ? ఇంద్రుఁడు యోగి. తన యోగబలముచే నత్యంత లఘురూపమును ధరించి, వజ్రమును గైకొని ఆమె కడుపులోనికి దూరెను. గర్భము పూర్తియయ్యెను. దితి శ్రమచే నచేతయై నిద్రించుచుండెను. తన గర్భములో నేమి జరుగుచున్నదో ఆమెకేమియును దెలియదు. ఇంద్రుఁడు తన వజ్రముతో సువర్ణకాంతి తేజముచే జాజ్వల్యమానమగునాగర్భమును నేడుముక్కలుగనొనర్చెను. ముక్కలగుటచే నా యేడును నేడ్వ నారంభించెను. ఇంద్రునకు భయమువైచెను. ఈపిల్లలేడ్వ నారంభించుచో దితి మేల్కొనఁగలదేమోయనియుఁ దన్ను శపించి భస్మమొనర్చునని యనుకొనెను. అందువలన నాతఁడు వారిని మారుద

మా-రుద అనఁగా నేడ్వఁబోకుఁడు ఏడ్వఁబోకుఁడు" అనెను. ఏడుముక్క-లుగ నొనర్చినను వారు చావక యేడ్గురు పిల్లలుకాఁగా నింద్రుఁడు మరలఁ దన వజ్రముచే నొక్కొక్క-నిని నేడు ముక్క-లుగ నొనర్చెను. ఈవిధముగ వారు నలుబదితొమ్మిది మందియైరి. భగవంతుని కృపచే నానలుబదితొమ్మిదిమందియు జీవించి పిల్లలైరి. వారందఱును జేతులను జోడించుకొని యింద్రునితో నిట్లనిరి :- "దేవేంద్రా ! నీవు మమ్ములనేలఁ జంపఁజూచుచున్నావు ? నీకును మాకును దండ్రి యొక్క-ఁడే. మేము నీకుఁదమ్ములము. ఎక్క-డనైనఁ దమ్ములనన్న చంపునా ?" ఇదివిని యింద్రుఁడు మిక్కి-లి ప్రసన్నుడై యిట్లనెను :- "మీరు నన్ను జంపరుగదా ? అన్నను దమ్ములు చంపరుగదా ? అన్నను దమ్ములు చంపకున్నచో నేమను మిమ్ములను జంపను. నేఁటినుండి మీరు నలుబది తొమ్మిది మందియు మరుద్గణములు నాకు పార్షదులై తిరి."

అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! ఒకేగర్భంలో నలుబది తొమ్మిదిముక్క-లయ్యును నేలఁజావలేదు? అందఱు నెట్లుజీవించిరి?"

అంత శుకదేవుడిట్లనెను :- "రాజా ! ఇప్పుడీ విషయమున నేమి చెప్పఁగలను ? ఇది భగవంతుని మాయయని చెప్పఁవలసియుండును. ఆతని యిచ్ఛ యిట్లున్నది. భగవన్మాయా సమ్ముఖమున నసంభవమనునది లేదు. ఆతఁడు "కర్తు మకర్తు మన్యథా కర్తుమశక్యః" అని చెప్పఁబడినాఁడు. అసంభవము సంభవముగను సంభవమును నసంభవముగను జేయఁగలఁడు. మరుద్గణము నిత్యులు. వారు శరీరమును ధరింపవలసియుండెను. వారు దితి గర్భంలోఁ బ్రవేశించిరి. గర్భ

మొక్కటియే. మరుద్గణము సంఖ్యలో నలుబది తొమ్మిదిమంది. అందు వలన నింద్రుని నిమిత్తముగాఁ జేసికొని వారిని నలుబదితొమ్మిదిగాఁజేసె పైచెను. కాకున్న నిత్యులగు మరుద్గణములనెవరు సంహరింపఁగలరు. ఏ భగవానుని మరణ కాలమున నిజమగు హృదయములతోడను, ప్రేమ తోడను, నామమును బలుకుటచే మానవుఁడమరుఁడగు చున్నాఁడో అట్టి భగవంతుని దితి కొలఁది దినములు తక్కువగ నొక్కసంవత్సర మారాధించెను. అందువలన నొక్కని నలుబదితొమ్మిది ముక్కలొనర్చినను వారు మరణింపలేదు."

శ్రీశుకదేవుఁడిట్లనెను:- "రాజా! వారు గర్భములో నుండఁగానే వారు నలుబదితొమ్మిదిమందియును నింద్రుఁడును గలసి యేఁబది మందియు మరుద్గణమని పిలువఁ బడునట్లొక అంగీకారమునకు వచ్చిరి. వీరందఱును దితి గర్భమునుండి యుద్భవించియున్నను దైత్యులనఁబడ లేదు. ఇంద్రుని సంబంధమున నీతని దేవతాగణములోనే లెక్కవేయఁ బడెను. యజ్ఞములలో నింద్రునకును, అన్యదేవతలకును హవిర్భాగములు లభించినపుడు, ఇంద్రునితోఁబాటుగా వీరికిని హవిర్భాగములు లభించుచుండెను. వీరిని యజ్ఞమందు భాగభుక్కులందురు. ఈ విధముగ దితి గర్భమునుండి యుత్పన్నమైనను వీరు దేవతలుగనే పిలువఁబడుచుండిరి. రాజా! నీవడిగినదానికి నేను ప్రత్యుత్తర మొసంగితిని. ఇప్పుడు నావలన నీవేమి వినగోరుచున్నావు ?

ఇదివిని పరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! మరుద్గణముల కథ

వినఁగానే నాకు మిక్కిలి ఆనందమైనది. దితికీ సమాచారమంతయును తెలిసిన తరువాత నామె యేమిచేసినదో వినఁగోరుచున్నాను. ఆమె కోపముసుజెంది యింద్రుని శపింపలేదా ?"

అంత శుకుఁడిట్లనెను :- "మంచిది మహారాజా! నేను తరువాత జరిగిన కథనుగూడ చెప్పెదను. నీవు సావధానముగ శ్రవణమొనర్పుము



# మరుద్గణ చరిత్ర సమాప్తి

(౪౪౪)

శ్లో॥ ఇంద్రస్తయాఽభ్యనుజ్ఞాతః శుద్ధభావేన తుష్టయా ।
మరుద్భిః సహతాం నత్వా జగామ త్రిదివం ప్రభుః॥

శ్రీభాగ. ౬ స్కం. ౧౮ అ. ౭౭ శ్లో॥

సత్యము శత్రుహృదయము పైనను దన ప్రభావమును జూపించును. మనము దుఃఖమును బోఁగొట్టు కొనుటకై అసత్య భాషణమును గావింతుము కాని దానివలన దుఃఖము కొంతకాలము తగ్గినట్లుండినను బరిణామమున దుఃఖమునే కలిగించును. కాని సత్యభాషణము వలన నారంభమున దుఃఖమును, విపత్తియును వచ్చినట్లుండినను దానిని విడువరాదు. ఏలయనఁగా విజయము సత్యమునకే కలుగును. అసత్యము

నకు జయము కలుగదు. మనము పెద్దలయెడల నపరాధమొనర్చినచో మనము నమ్రతగాఁ బశ్చాత్తాపముతో సమస్తమును సత్యముగఁ జెప్పిన యెడల వారిపై సత్యప్రభావము బాగుగాఁ బడగలదు. ఒక కథకలదు. తీర్థయాత్రకు కొందఱతో నొకబాలకుఁడు వెడలుచుండెను. దారిలో దొంగలువచ్చి అందఱను దోఁచుకొనిరి. అందఱను దోఁచుకొనిన తర్వాత నా యమాయకపు బాలకుని వద్దకుఁబోయి దొంగల నాయకుఁడు వచ్చి యిట్లనెను :- "ఏమి? అబ్బాయీ! నీ వద్ద నేమైన నున్నదా?" అతఁ డిట్లనెను :- "అయ్యా! నావద్ద నేబది మొహరీలు కలవు" దొంగల నాయకుఁడు వారి శరీరము నంతను వెదకెను. అతని కెచ్చటను మొహ రీలు దొరకలేదు. అప్పుడాతనికి కోపము వచ్చి యిట్లనెను :- "ఓరీ అబ్బాయీ! నీవు నాతో నెగతాళిపలుకుచున్నావా? నీవద్ద ఏమియును లేవే."

పిల్లవాడిట్లనెను :— "అయ్యా! మీరు నా బొంతను జించి చూడుఁడు. దానిలోని దూదిలో నీమొహరీలు దాఁచఁబడినవి." ఆ నాయ కుఁడు బొంతను జించఁగా నిజముగా నందులో నేఁబది మొహరీలు కుట్టఁ బడియుండెను. అంతనాయకుఁడిట్లడిగెను :- "వత్సా! నీవుదాఁచిన యింత ధనమును నేలఁజెప్పితివి? నీవు చెప్పకయుండినచో నీకీధనము దక్కెడిదే కదా ఏలయనఁగా నీ మూసిన బొంతలో నిన్ని మొహరీలు కుట్టబడినవని చెప్పఁకుండిన ననుమానము కలిగియుండెడిది కాదు. అంత నాబాలకుఁడిట్లనెను :- "అయ్యా! మాతల్లి బయలుదేరునప్పుడు నాయనా! అబద్ధము చెప్పకుమని చెప్పినది, అందువలన నేను నిజము

చెప్పితిని." బాలుని సత్య భాషణమువలన దొంగల నాయకుని హృదయ ముమీఁద గొప్పప్రభావముపడెను. అతఁడు దోచుకొనిన ధనమును తిరిగి యిచ్చివైచెను. ఒక్కని సత్యమువలన నందఱ ధనము రక్షింపబడెను. కావున సత్యభాషణముచే సదా మంగళమే కలుగును. అమంగళమెన్న టికినిఁ గలుగదు.

శ్రీ శుకదేవుఁడిట్లనెను :- "రాజా ! దితి గర్భమునఁ బ్రవేశించి యింద్రుఁడామె గర్భమును నలుబది తొమ్మిది ముక్కలుగాఁ జేయఁగా వారేడ్గు రేడ్గురు నేఁడు గణములైరి. అప్పుడింద్రుఁడు గర్భమునుండి బయటకు వచ్చెను. ఆ సమయమున దితి కన్నులు తెఱచెను. ఇంద్రునితో నాన్నా అన్నాయనుకొనుచు నాడుకొను నలుబది తొమ్మిదిమంది బాలకుల నామె గాంచెను. అప్పుడామెకు మిక్కిలి యాశ్చర్యము కలిగెను, ఈపిల్లి లతో నీతఁడు సోదరునివలె నేల వ్యవహారము జేయుచున్నాఁడు. నేనొక్క పుత్రుని కొఱకై పుంసవన వ్రతము నొనర్చితిని. ఈ నలుబది తొమ్మిది మంది బాలకులెట్లుకలిగిరి?" అని యిట్లు యోజించుకొని బాలక వేష ధారియగు నింద్రునితో నిట్లనెను:- "వత్సా! నేను నా సవతియగు నీ దితి పుత్రులకు భయమును గలిగించుటకై ఒక్క పుత్రునేకోరి యీ వ్రతము ననుష్ఠించితిని. నా సంకల్పము ఇంద్రహంతకుఁడును పరమపరాక్రముఁ డగు నొక్కపుత్రుని కొఱకేగదా! ఈ నలుబది తొమ్మిది మంది పుత్రు లేల కలిగిరి? వీరందఱును నీతో సోదరులవలె వ్యవహారమేలఁ జేయు చున్నారు? నీకీ రహస్యము తెలిసినచో నాకు సత్యమును జెప్పుము. నావద్ద కపటమును నటింపకుము."

తన సవతి తల్లియగు దితి పలుకులను విని యింద్రుఁడు కపట రూపమును త్యజించెను. ఆతఁడు చేత వజ్రమును ధరించి సాక్షాత్తుగ దేవేంద్రుని రూపమునఁ బ్రత్యక్షమై చేతులను జోడించుకొని అత్యంత వినయముతో నిట్లనెను " "అమ్మా! నేను నీ సంకల్పమును వినియే సదా నీ సేవలో నుంటిని."

దితి యిట్లడిగెను :- "నీవునాకు నిస్వార్థ భావముతో మిక్కిలి భక్తితో సేవ యొనర్చితివి."

దేవేంద్రుఁడిట్లడిగెను:- "అమ్మా ! నేను నిస్వార్థ భావముతో సేవచేయలేదు. నేను నా స్వార్థభావమును మఱుఁగు పెట్టితిని. పైకి నిస్వార్థతను బ్రకటించితిని. నాకు ధర్మ విచారమేమియును లేదు. నేను మిక్కిలి జాగ్రత్తగా నీ సమీపముననుండి నీకు వ్రతములో లోపము లెప్పుడు కలుగునా, వ్రతభంగ మెప్పుడగునాయని చూచుచుంటిని. దేవీ! నీవు నేఁడు తల విఱియఁబోసికొని, సంధ్యాసమయమున, మంచమున వెల్లకిలగా, సుత్తరపు తలపెట్టి నిద్రించుచుంటివి. సంధ్యా సమయమున నిద్రించుటపాపము, రెండవది తలవిఱియఁబోసికొని వెల్లకిలగ మంచము మీఁదఁ బరుండుటివి. పైఁగా మూడవది నీ నోరెంగిలిది. నాల్గవది నీవు కాళ్ళు చేతులను గడుగుకొనకయే నిద్రించితివి. ఈ దోషముల కారణ మున నీకు వ్రతభంగమైనది. వ్రతములో ఛిద్రము సంభవించుటచే నాకు సాహసము కలిగి, నీయుదరములోఁ బ్రవేశించి, నీగర్భమును నలుబది తొమ్మిది ముక్కలుగఁ జేసితిని. మొదట నే నేడు ముక్కలే చేసితిని.

ఏడుముక్కలొనర్చినను జావకపోఁగా మరల నొక్కొక్కటి ఏడేడు ముక్కలు చేసితిని. నలుబదితొమ్మిది ముక్కలైనను జావకపోఁగా నే నాశ్చర్యచకితుఁడనై వీరందఱకును జీవనదానమొనర్చినవాఁడు పరమ పురుషుఁడగు శ్రీమన్నారాయణుఁడే యనియు నది యీ యుపాసనము వలననే ప్రాప్తించినదనియుఁ దెలిసికొంటిని. అమ్మా! నేను నా జీవన రక్షణము కొఱకు స్వార్థభావముచేఁ బ్రేరితుఁడనై సేవనొనర్చితిని. నే నతినీచుడను. సేవయెల్లప్పుడు స్వార్థరహితముగఁ జేయవలసియుం డును. మోక్షేచ్ఛకూడ పనికిరాదు, సాంసారిక స్వార్థాకాంక్ష లేనివాఁడే నిజముగ స్వార్థకుశలుఁడగు నరుఁడు. నశ్వరములగు తుచ్ఛభోగేచ్ఛచే భగవంతుని భజించువారు తెలిసియుండియు తనకొఱకు కూపముదవ్వు కొనుటయే కాఁగలదు. నరక మార్గమును బ్రశస్తము కావించుకొనుచున్నా రనియే చెప్పవలసియుండును."

దితి యిట్లనెను :- "ఇంత తెలిసియుండియు నీవిట్లు గర్భహత్యా పాతకమున కెట్లొడి గట్టుకొంటివి ?"

ఇంద్రుఁడు లజ్జితుఁడై యిట్లనెను :- "అమ్మా! ఇప్పుడు దీనికి నేనేమి ప్రత్యుత్తరమీయఁగలను. ఇది నాక్షుద్రతయే. స్వార్థపరుఁడగు క్షుద్రుఁడు సదా క్షుద్రతనే కావించును. గొప్పవారికి గొప్పబుద్ధులే పుట్టు చుండును. అమ్మా! నీ వన్నివిధముల పెద్దదానవు. మా అమ్మకు సవతివి పూజ్యులగు తండ్రికి ధర్మపత్నివి. నాకు దల్లివంటిదానవు. ఇప్పుడు నేను నీయుదరమునఁ బ్రవేశించి, నీ పిల్లలతో మరలఁ బుట్టి

తిని. ఆ తరువాత నాకు నూతన జీవనము కలిగినది. కావున నేను నీ పుత్రుఁడను. నేను దుష్టతగ వర్తించితిని; కాని హరి రక్షకుఁ డుగనున్న వారి నెవరు నేమియును జేయఁజాలరు. అదృష్టమేమనఁగా నేనింత క్రూరత్వ మొనర్చినను నీ పిల్లలందఱును జీవించియున్నారు. వారు నన్ను ద్వేషింపక తోడి సోదరులవలె ప్రేమించుచున్నారు.

ఇంద్రుని యిట్టి సత్యవాక్యములను విని దితి యాతనిపై మిక్కిలి ప్రసన్నురాలయ్యెను. ఆమె యిట్లనెను :- "మంచిది వత్సా! భగవదేచ్ఛ ననుసరించి జరుగగలదు. తానొకటి తలంచిన దైవమొకటి తలఁచును. ఈ పిల్లలందఱును నిన్ను సోదరునిగ నెంచుకొనుట చాలసౌభాగ్యకర మగు విషయము. నీవు నా కడుపున మరలఁబుట్టితివి. కావున నీ వలుబది తొమ్మిదిమందియును నీ వొక్కఁడవును గలిసి మీరు మరుద్గణములని పిలువఁబడుదురు. వీరు నీకు ప్రధానపార్షదులు కాఁగలరు. ఎల్లప్పుడును నీ సమీపమునసుండి నీ సేవలో నుండెదరు. నీవు వీరి నందరిని వెంటఁబెట్టుకొని హర్షముగ స్వర్గమునకుఁబొమ్ము. నేను నీశుద్ధ భావమునకు సంతసించితిని".

శ్రీ శుకదేవుఁడిట్లనెను:- "రాజా! దితి యొక్క యీ భావమును గాంచగానే యింద్రునకు హార్దిక ప్రసన్నత కలిగెను. అతఁడు తనది నూతన జన్మగ భావించుకొనెను. అతఁడు దితికిఁ బ్రణామమును గావించి మరుద్గణము వెంటఁబెట్టుకొని స్వర్గమునకుఁ బోయెనుఁ. ఈ విధముగ మరుద్గణము దితి గర్భమునుండి యుత్పన్నమైనప్పటికిని సోమపాయు

లగు దేవతలైరి. ఇప్పుడు నేను నీ కతి సంక్షేపముగ మరుద్గణోత్పత్తి ప్రసంగమును జెప్పితిని. ఇప్పుడు నీవేమి వినఁగోరుచున్నావు ?



అంతఁ బరీక్షిన్మహారాజిట్లనెను :- "ప్రభూ ! దితి యొనర్చిన పుంసవన వ్రతవిధానముగూర్చి వినఁగోరుచున్నాను. ఏలయనఁగా నిది వైష్ణవ వ్రతము. దీని విధిని నాకుఁ జెప్పుఁడు, ఎప్పటినుండి చేయవలసి యుండును. పూజ నాధులెట్లు చేయవలసియుండును ?



సూతుఁడు శౌనకాదిఋషులతో నిట్లనెను :- "మునులారా ! పరీక్షిన్మహారాజు ప్రశ్నించిన మీఁదట శ్రీ శుకదేవుఁడు పరమపావనమగు వైష్ణవ వ్రతవిధిని గూర్చియు, పూజింపవలసినదియును, నేమంత్రమును జపింపవలసినదియును, నేమంత్రముచే హోమము కావింపవలసినదియును, ఎప్పటి నుండి యజ్ఞ వ్రతారంభ మొనర్పవలసినదియును జెప్పెను."



అంత శౌనకుఁడిట్లనెను : "సూతా ! ఈ వ్రతమును మాకును జెప్పుడు."

అంత సూతుఁడిట్లనెను :- "స్వామీ ! ఈ కథాప్రసంగమునం దంగన్యాస కరన్యాస విధి విధానములను జెప్ప దొడఁగినచోఁ గథా ప్రవాహమాగిపోవును. కావున నాయిచ్ఛ యిట్టిది. ఈ వ్రతాదులన్నిటినిఁ గలిపి ప్రసంగానుసారముగఁ జెప్పెదను తర్వాత మీ యాజ్ఞ".

అంత శౌనకుఁడిట్లనెను :- "మంచిది, అట్లే కావించు కాని

మేము నలుబదితొమ్మిదిమంది మరుద్గణముల నామములను వినఁగోరు చున్నాము. మీకు జ్ఞాపక ముండినచో మాకుఁ జెప్పవలయును."

అంత సూతుడిట్లనెను :- స్వామీ ! మీ కృపచే నా కన్నియును జ్ఞాపకమున్నవి. కాని వీరందఱును మరుద్గణమని పిలువబడుచుందురు. వారి నామములను గూడ వినుఁడు.

1 ఏకజ్యోతి 2 ద్విజ్యోతి 3 త్రిజ్యోతి 4 చతుర్జ్యోతి 5 జ్యోతి 6 ఏకశక్ర 7 ద్విశక్ర 8 త్రిశక్ర 9 ఇంద్రగతి 10 ప్రతిపకృతి 11 సమ్మిత 12 అమిత 13 మిత 14 ఋతజిత్ 15 సత్యజిత్ 16 సుషేణ 17 సత్యజిత్ (ద్వితీయ) 18 అతిమిత్ర 19 నిమిత్రే 20 పురుమిత్ర 21 పురాజిత్ 22 ఋత 23 ఋతధాత 24 విధాత 25 ధారుణ 26 ధ్రువ 27 విధారణ 28 మహాతేజ 29 ఈదృక్ష 30 అదృక్ష 31 ఏతాదృక్ 32 అమితాసిన 33 క్రీతిన 34 ప్రసదృక్ష 35 సరభ 36 ధాతు 37 ఉగ్ర 38 ధ్వని 39 భీమ 40 అతిభుక్త 41 క్షిప 42 సహ 43 ద్యుతి 44 వపు 45 అతాధృష్య 46 వాస 47 కామ 48 జయ 49 విరాట్.

సూతుఁడిట్లనెను :- "మునులారా ! మునులారా ! మీకు నేను మరుద్గణోత్పత్తి ప్రకరణమును జెప్పితిని. దీనిని విన్నను, వినిపించినను విష్ణుభగవానుఁడు ప్రసన్నుడుకాగలడు. ఈ దేవాసుర వంశ శ్రవణమైన తరువాతఁ బరీక్షిన్మహారాజు భక్తి వివృద్ధినిఁ గావించు నత్యంత దివ్య ప్రశ్నమునడిగెను. దానిని నేను మీకుఁ జెప్పెదను, ఇందు దైత్య కులభూషణుఁడును, భక్తాగ్రగణ్యుడును, మహామనస్వియునగు ప్రహ్లాదుని పరమపావన చరిత్రము రాఁగలదు.

---

విజయ్ ఆర్ట్ ప్రింటర్స్, 1-8-522/27, చిక్కడపల్లి, హైదరాబాద్-20